ప్రచురణ సంఖ్య 25

తొలి ముద్రణ 1000 ప్రతులు
1999 మార్చి



వెల : నలభై (40) ) రూపాయలు.

ప్రతులకు :

1. నవోదయ బుక్ హౌస్, ఆర్యసమాజ్ ఎదుటి వీధి
కాచిగూడ చౌరాస్తా, హైదరాబాదు - 500 027

2 విశాలాంధ్ర బుక్ హౌస్, బ్యాంక్ స్ట్రీట్, హైదరాబాదు; also
విజయవాడ, గుంటూరు, etc

3. సహచర బుక్ మార్క్, కాచిగూడ చౌరాస్తా,
హైదరాబాదు - 500 027

4. ప్రజాశక్తి బుక్ హౌస్, చిక్కడపల్లి, హైదరాబాదు -500 020

5. ప్రగతి బుక్ హౌస్, మ్యూజియం రోడ్డు,
విజయవాడ - 520 002

టైప్‌సెటింగ్ : రవి శశి గ్రాఫిక్స్, **6-3-1243/156,** హైదరాబాదు - **500 082.**
Ph : 330 0284 Email mallikmsf48@hotmail com

ముద్రణ : శ్రీకళాంజలి గ్రాఫిక్స్, 3-5-323, విఠల్‌వాడీ, హైదరాబాదు - 500 029.
Ph +91-40-322 9831, Fax +91-40-212613,
Email Srikalanjali@hotmail com

# పీఠిక

హిందూతత్వశాస్త్రంలో ఉపనిషత్తులకెంత ప్రాముఖ్యముందో తత్వ శాస్త్రాధ్యయనాభిలాషగలవారందరికీ తెలుసు. సామాన్య పాఠకులకుకూడ దాన్ని విశదీకరించేందుకు ముందుగా అసలు నా కీ యోచన ఎందుకు కలిగిందనే విషయం కొద్దిగా వివరించ దల్చుకున్నాను. తాను మార్క్సిస్టు కావడమేమిటి, ఉపనిషత్తుల్ని అనువదించి, పరిచయం చేయడమేమిటి, విడ్డూరం అనుకునేవాళ్లూ, అనేవాళ్లూకూడ వుండొచ్చు. ఏదో గతితార్కిక భౌతికవాదం, చారిత్రక భౌతికవాదం, ఆధునిక తత్వ విమర్శ, ముఖ్యంగా సమకాలీన సమాజంలోని వర్గవ్యవస్థలు, వర్గపోరాటాలు, విముక్తి లక్ష్యాలు, మార్గాలు వగైరాల గురించి చదవాలి, రాయాలి గాని ఈ సోది అంతా ఎందుకు, ఎవరికోరకు, ఈయన కెందుకీ అనవసర శ్రమ అనేవాళ్లూ వుంటారు. దీనికి నేను చెప్పేదేమంటే మన దేశంలోని మార్క్సిస్టులం మనం సాధారణంగా మన వారసత్వాన్ని - అది తత్వశాస్త్రంలో కావచ్చు, చరిత్ర, రాజనీతి, అర్థశాస్త్రం, సాహిత్యం - కళలు వగైరా అనేకానేక అంశాల్లో కావచ్చు - సరిగా అధ్యయనం చేయలేదు. కేవలం పాశ్చాత్య తత్వశాస్త్రం, చరిత్ర, అర్థశాస్త్రం వగైరాల అరాకొరా అధ్యయనానికే పరిమితమైనాము. అందునా మార్క్స్, ఏంగెల్సు, లెనిన్, స్టాలిన్, మావోల రచనలుమాత్రమే, అవీ అసంపూర్ణంగా, చదవడం ఎక్కువ. వాటినుండి సుదీర్ఘ ఉల్లేఖనలతో, అరువుతెచ్చుకున్న ఆలోచనలు, విధానాల ఆధిక్యతతో వాస్తవ పరిస్థితుల్ని రంగుటద్దాల్లోంచి చూస్తూ, భ్రమిస్తూ తప్పులమీద తప్పులు చేసుకుంటూ పోతున్నాం. స్వదేశ ప్రత్యేకతల్ని, స్వప్రజల మనస్తత్వాల్ని, ఇక్కడి సాంఘిక, ఆర్థిక, తాత్విక, రాజకీయ తదితర పరిస్థితుల విలక్షణతల్ని అర్థం చేసుకోవడం అటుంచి, ఆ దిశగా ప్రయత్నాలైనా సరిగా చేయనందున నేడు మన దేశ వామపక్ష వుద్యమం సాధారణంగా శోచనీయమైన దశలో వుంది.

ఇందుకు భిన్నంగా మావో రచనల్ని చదివేటప్పుడు వాటిలో అడుగడుగునా ఆయన చైనా దేశ ప్రత్యేకతల్నిగురించి, వారి చరిత్రగురించి, అందునుండి తీసుకోవల్సిన పాఠాలగురించి, మార్క్సిజాన్నే చైనీయం చేయవల్సిన అవసరంగురించి నొక్కిచెప్పడం నాకు చాల విలక్షణంగా, ఒకవిధంగా మనల్ని తట్టిలేపేదిగా అనిపించింది. ఆ రచనలతో మన మార్క్సిస్టు నాయకుల (ఏ పార్టీలు, గ్రూపులకు చెందినవారైనా సరే) రచనల్ని పోల్చిచూస్తే హస్తిమశకాంతరం కనిపించింది. ఆ సృజనాత్మకత, భావ గాంభీర్యం, స్వదేశ వారసత్వంపై గర్వంతోకూడుకున్న సునిశిత విశ్లేషణ, ఆధునిక విప్లవ సిద్ధాంతాలు, తత్వచింతనల ఆచరణాత్మక అన్వయం మావోలో వున్నంతగా మనవాళ్లలో నాకు కనిపించలేదు. అప్పటినుండీ, మనం మొదటినుండీకూడ ఈ విషయంలో పప్పులో కాలేసామేమో ననే వ్యథ నన్ను పీడించసాగింది. మార్క్సు, ఏంగెల్సు, లెనిన్‌ల రచనల అధ్యయనం ఈ వ్యథను మరింత తీవ్రం గావించింది. సరే, క్రియాశీల విప్లవ రాజకీయ జీవితంనుండి బయటికివచ్చి ప్రధానంగా అధ్యయనం, రచనావ్యాసంగాల్లో పడినతర్వాత ప్రామాణిక మార్క్సిస్టు రచనల్ని, విమర్శనాత్మక విప్లవ సాహిత్యాన్ని తెలుగులో తీసుకు రావడానికీనూ, మనదేశ జాతీయ విప్లవకారులగురించి లోతైన అధ్యయనం చేయడానికిన్నూ నా శక్తియుక్తుల్ని ముఖ్యంగా వెచ్చించసాగాను. ఈ రెండో ప్రయత్నంలో భాగంగా కొన్ని ప్రామాణిక రచనలు చేసాను. వాటిలో మొదటి పుస్తకాన్ని (హిందూదేశ స్వాతంత్ర్యపోరాటంలో విప్లవకారుల పాత్ర) రామకృష్ణ మఠాధిపతి స్వామీ రంగనాథానందకు బహూకరించి, ఆయనతో కొంతసేపు చర్చించానుకూడ. ఆయన నా కృషిపట్ల సంతోషం వ్యక్తంచేసాడు; అదేసమయంలో హిందూతత్వ శాస్త్రాన్నికూడ లోతుగా అధ్యయనంచేసి, దానిపై రచనలు చేస్తే బాగుంటుందని సలహా యిచ్చాడు. ఇది జరిగి 12 ఏళ్లు దాటిపోయింది. ఆ సలహాను నేను వెంటనే పాటించలేక పోయానుగాని అప్పుడప్పుడూ అది మనసులో మెదులుతుండేది. గుర్తు వచ్చినప్పుడల్లా ఆ విషయంలో నేను ఆరంభంకూడ చేయలేకపోయానే అనే మెరమెరకూడ కలుగుతూండేది. తర్వాత 9-10 ఏళ్లక్రితం కామ్రేడ్ చంద్ర రాజేశ్వరరావు గారితో పరిచయం ఏర్పడి, 2-3 సార్లు ఆయనతో వివిధ విషయాలు చర్చించిన సందర్భాల్లోకూడ మళ్లీ ఈ హిందూతత్వ

శాస్త్ర ప్రసక్తి వచ్చింది. ముఖ్యంగా రాజేశ్వరరావుగారు ఈ విషయంలో మన కమ్యూనిస్టుల వైఫల్యంగురించి చాల దుఃఖ పడుతూండినారు. ఎంతో అమూల్యమైన మన తాత్విక, చారిత్రక వారసత్వాన్ని మనం సరిగా అధ్యయనం చేయలేదే, పైగా చాల వ్యతిరేకాత్మక (నెగటివ్) వైఖరి తీసుకుని ఆ రంగాన్ని పూర్తిగా మతతత్వశక్తుల స్వేచ్ఛావిహారానికే వదిలేసామే నని ఆయన తెగ బాధపడి పోయారు. అదికూడ నాకు మరొకసారి కర్తవ్య బోధ చేసినట్లయింది. అందుకే ఈ మధ్యనే హిందూతత్వశాస్త్రం అధ్యయనం చేయడం మొదలు పెట్టాను. అయితే శాస్త్ర రాతయోవకూడ వున్నవాడ్ని కనుక నా అధ్యయనంలో భాగంగా కొన్ని ఉపనిషత్తుల్ని తెలుగుచేసాను. నా వ్యాఖ్యలతోసహా అది ఒక పుస్తకరూపంలో తెస్తే బాగుంటుందని భావించి యిప్పుడు పాఠకులకు శ్రమ యిస్తున్నాను. అంతకుమించి నేను హిందూ తత్వశాస్త్రంలో స్కాలరు నేమీ కానని స్పష్టంచేస్తూ, నా అనువాదం, పరిచయాలలో తప్పులేమైనా వుంటే (కొన్నైనా తప్పక వుండేవుంటాయి) సహృదయంతో మన్నించవల్సిందిగాకూడ యిక్కడే కోరుకుంటున్నాను.

ప్రపంచమతాలన్నింటిలోకీ హిందూమతం ఒకవిధంగా విశిష్టమైన దని చెప్పవచ్చు. నిజానికి దాన్ని ఒక మతం అనడంకంటె ఒక సంస్కృతి అనడమే సబబని సర్వేపల్లి రాధాకృష్ణన్ అన్నాడుకూడ. అలాగే అది మతం అనడంకంటె ఒక జీవనవిధానం అనడమే సరైనదనే అభిప్రాయాలూ వ్యక్తమయినాయి. ఒక సంస్థాపకుడనిగాని, ఒక ప్రవక్త అనిగాని లేని మతం యిది. ఇంకోవిచిత్రమే మంటే దేవుడు వున్నాడనే వాళ్ళూ, లేడనే వాళ్లూ ఉభయులకూ ఆస్కారమిచ్చే మతం బహుశా ప్రపంచంలో యిది ఒక్కటేనేమో. మరి దీనికి మూలాలు ఏమిటని యోచించినప్పుడు వేదాలే దీనికి మూలగ్రంథాలని, "**అన్నీ వేదాల్లోనే వున్నాయిష** " అనీ సర్వ సాధారణంగా అనుకోవడం, చెప్పడం కద్దు. కాని ఇది సరైనదని నేను భావించడంలేదు. ఎందుకంటే వేదాలు మన హిందూదేశానికి ఆర్యుల ఆగమనంతో ముడిపడివున్నాయి. అవి ఆర్యుల పవిత్ర గ్రంథాలు. రాత లిపికూడ యింకా రూపొందించుకోలేని ఆదిమ సంచార జాతులుగా ఆర్య గణాలు వున్నకాలంలో, ఒక నోటినుండి మరొక నోటికిగా మౌఖికంగానే వందలాది ఏళ్లగా ప్రచలితమై వచ్చిన స్తుతి గ్రంథాలు వేదాలు. కాని ఆర్యుల

రాకడకు ముందే మన హిందూ దేశంలో ఒక ఉన్నతస్థాయి నాగరికత నెలకొనివుండేదనేది నేడు నిర్వివాదమే. దీన్నే హరప్పా సంస్కృతి లేక సింధు నదీ నాగరికత అని మనం పిలుస్తాము. ఆర్యులు వచ్చి ఈ నాగరికతను నిర్దాక్షిణ్యంగా ధ్వంసంచేసివేసారు. ఆ కారణంగానూ, యితర ప్రకృతి విపత్తులు వగైరా కారణాలవల్లనూ ఈ నాగరికత దాదాపు సమూలంగా అంతరించిపోయింది. కాని పూవు వాడి రాలిపోయినా, దాని సువాసనలు గుభాళిస్తూ వుండవచ్చు. అలాగే ఈ సమున్నత స్థాయి సింధు నదీ నాగరికత రాలిపోయినా, అది తమ విజేతల్నికూడ ఎంతో ప్రభావితం చేసింది. ఆ విజేతల జీవనవిధానంలో అనేక ముఖ్య అంశాలను జొరబెట్టింది. కనుకనే ఆదిశక్తి ఆరాధన, పశుపతి పూజ, విగ్రహారాధన (బహుశా గుళ్లూగోపురాలు సైతం), ప్రకృతి ఆరాధన, జంతుపూజ, వర్గవిభజన, గ్రామదేవతల సాంప్రదాయం వగైరా అనేక అంశాలు ఆర్యుల జీవన సరళిలోకి క్రమేపీ ప్రవేశించాయి. అవిన్నూ వేద వేదాంగాల్లో, యితరత్రా స్మృతుల్లో అభివర్ణించబడ్డ వివిధ ఆర్య చింతనా, ఆరాధనా, యితరేతర సామాజిక జీవనా పద్ధతులున్నూ మమేకమైన ఫలితమే నేటి హిందూ మతం లేక సంస్కృతి అంతస్సారమని నా నిశ్చితాభిప్రాయం. అంతేగాక సింధు నదీ నాగరికత నశించిపోయినా, అందుకు సంబంధించిన జాతులు సమూలంగా అంతరించి పోలేదని, ఆర్య జాతితో జాతి (వర్ణ) సంకరం జరగడం, తూర్పు, దక్షిణ ప్రాంతాలకు తరలిపోవడం, అటవీ , పర్వత ప్రాంతాలకు పారిపోవడం వగైరా పరిణామాలద్వారా నేటికీ మన దేశంలో వివిధ ఆచారాలు, జీవన విధానాలతో వర్ధిల్లుతున్నాయనికూడ గమనించాలి. ద్రవిడులనబడే మనం దాక్షిణాత్యులం బహుశా ఆ సింధు ప్రాంత దస్యుల సంతతివారమేనేమోననే అభిప్రాయాలూ లేకపోలేవు. కనుక హిందూ మతం ఆర్యుల అబ్బసొమ్మేమీ కాదని గట్టిగా వాదిస్తున్నాను.

అంతేకాదు. ఆచారవ్యవహారాలు, సాంప్రదాయాలకు సంబంధించినంతవరకు, అలాగే కులవ్యవస్థకుసంబంధించినంతవరకు హిందూ మతం ప్రధానంగా అనార్య (ఆర్యులకు పూర్వపు + ఆర్యేతర) వారసత్వమేనని కూడ నా గట్టి నమ్మకం. ఒక విధంగా హిందూమతంకంటె పార్సీ మతమే ఎక్కువగా ఆర్యసాంప్రదాయాలు, ఆచారాలతో కూడుకున్నదనికూడ నా

అభిప్రాయం. పారసీకులు అసురజాతికి చెందిన ఆర్యులు. అసురులంటే ఆర్యుల దేవుళ్లో కిందిస్థాయి దేవుళ్లనీ (**అసురాః పూర్వదేవాః** అని అమరకోశం), కాలక్రమాన వాళ్లు ఆర్యసాంప్రదాయంలో దుష్టశక్తులు (demons)గా పరివర్తన చెందారని తెలుసుకోవాలి. కాని ఇండియాకు రాకుండా ఇరాన్‌లో స్థిరపడిపోయిన ఆర్యులుమాత్రం ఈ అసురులనే గొప్పగా భావిస్తారు. వాళ్ల ప్రధాన దైవం **అహూరా మజ్దా** (అంటే వివేకవంతుడైన అసురుడు). వాళ్లకు నోరుతిరగక స ను **హ** గా పలకడంవల్లే (రష్యన్లు **ట** పలకలేక **త** పలికేట్లు, తమిళులు **క, ట** లకు బదులు **గ, డ** లు పలికేట్లు) అసుర యిక్కడ అహుర గా మారింది. అన్నట్లు ఈ నోరుతిరగని ఫలితంగానే మన సింధూ (సింధునదీప్రాంత) దేశమల్లా హిందూ దేశమయిందిగాని హిందూ అనేపదానికి మతపరమైన పుట్టుక అసలే లేదని గమనించాలి. నిజానికి అతి లౌకికమైన పుట్టుకగల ఈ హిందూ దేశమనే పదాన్ని వదిలి ఎవరో ఆర్యరాజైన భరతుని పేరిట వ్యాప్తి చెందిన భారతదేశమనే పేరునే లౌకికవాదులు, సామ్యవాదులుకూడ వరించడం, పైగా హిందూ పదం వాడుక చూచి అసహనంగా జబ్బ తెగరేయడం ఎంత దౌర్భాగ్యమో ననికూడ అనిపిస్తూంటుంది నాకు. సరే ఈ పారసీకులు తమ పవిత్రగ్రంథాల్లో క్రమేపీ అసురులకు పెద్ద పీట వేసి, దైవాస్‌ను (ఆర్యుల దేవతలను) మెల్లమెల్లగా కిందికి దించివేస్తూ అఖరికి వాళ్లను దుష్టశక్తులుగా చిత్రించేసారు. చివరకు ఈ దేవతల్ని పూర్తిగా తిరస్కరించే న్యాయస్మృతి (**వెందిదాడ్**)ని రూపొందించుకున్నారుకూడ. కనుక నేడు, ఆ మాటకు దాదాపు 2 వేల ఏళ్లుగా, వ్యాప్తిలోవున్న హిందూమతం ప్రధానంగా అనార్య సంస్కృతీ భిక్షేనని నా అభిప్రాయం.

అయితే మనకు యిప్పుడు లభ్యమైవున్న తత్వచింతనా ధోరణులకు సంబంధించినంతవరకు ఆర్యసంస్కృతీ ప్రభావమే ఎక్కువని ఒప్పుకోక తప్పదు. కాని యిక్కడకూడ మనకు తెలియని, గట్టి సాక్ష్యాధారాలులేని విషయాలు, ఊహలు ఎన్నో వున్నాయి. ఉదాహరణకు తర్వాతికాలంలో ఉపనిషత్తుల్లో ప్రధానంగా తీసుకురాబడిన పునర్జన్మవాదం మనకు అంతకు పూర్వపు వేదాల సంహితల్లో దాదాపు కనిపించదు; లేదా అరుదుగామాత్రమే ప్రస్తావనకు వస్తుంది. కనుక ఇది హరప్పా సంస్కృతీ

ప్రభావమే నేమో ననిపిస్తుంది. అలాగే ఉపనిషత్తుల్లో ప్రధానంగా ప్రతిపాదించబడి, ప్రస్తుతించబడిన "**బ్రహ్మ మొక్కటే, పరబ్రహ్మ మొక్కటే**" ననే భావనకు మూలాధారం సింధునదీ నాగరికతకు చెందిన ఆదిశక్తి భావనకాదుగదా ?! మరి ఋగ్వేద ఋచాల్లో ఒకచోట **ఏకం సద్ విప్రాః బహుధా వదన్తి** అంటూ ఏకేశ్వర ప్రతిపాదన జరిగిందిగదా అంటే అదీ ఆదిశక్తి ప్రభావమే నేమో ననీ వాదించవచ్చు. ఏమైనా ఈ విషయంలో మనకు ఆధారాలు లేవు. లేవు అనేకంటే లేకుండా చేసివేశారనవచ్చేమో. ఎందుకంటే పూర్వకాలంలో విజేతలైన తెగలవాళ్లు ఆ యుద్ధాల సందర్భాల్లోనేగాక, తర్వాత గణనీయ కాలంపాటుకూడ అతిక్రూర మారణ హోమాలు, విధ్వంసకాండలు జరుపుతూండేవారు. పరాజిత జాతుల సంస్కృతీ భాండారాలన్నిటినీ కసితో సర్వనాశనం చేసివేస్తూండినారు. అలెగ్జాండరు దురాక్రమణల క్రమంలో పారసీకుల పవిత్ర గ్రంథాలను దుంపనాశనం చేయడం, మహమ్మదీయ సంచార తెగల దురాక్రమణల్లో అలెగ్జాండ్రియా గ్రంథాలయాన్ని పూర్తిగా తగలబెట్టడం వగైరా ఉదాహరణ లెన్నో. ఇంకా జాతులకు జాతుల్నే ప్రపంచపటంలో లేకుండా రూపు మాపిన దురాగతాలెన్నోవున్నాయి. మరీ ఇటీవలి 16-19, కొంతవరకు 20వ శతాబ్దాల్లో యూరపియన్ దురాక్రమణదారులు జరిపిన ముష్కర చర్యలు, మారణహోమాలుకూడ ఇంత కేమీ తీసిపోవని ఆస్ట్రేలియాలోని బుష్‌మన్లు, ఉత్తర అమెరికాలోని రెడ్ ఇండియన్లు, ఉభయ అమెరికాల్లో అసలుకే లేకుండా రూపుమాపివేయబడ్డ ఇంకా, మాయా నాగరికతలు నిరూపిస్తూనే వున్నాయి. అలాగే ఈ ఆర్యులుకూడ విజయం సాధించి నప్పుడు, ఆ తర్వాత గణనీయ కాలంపాటు, అనేక దారుణాలు జరిపారు. ఆ క్రమంలో వాళ్లు కసితో, ఈర్ష్యతో సింధునదీ సంస్కృతికి చెందిన అపార గ్రంథ సంపదను సర్వనాశనం చేసివుంటారు. అందుకే నేడు వారి లిపి ఏవో కొన్ని మట్టి పలకలు, విగ్రహాలు, నాణాలపై చెక్కిన అక్షరక్రమాలవరకే, నేటికీ ఎవరూ ఇదమిత్థంగా చదివి వివరించలేని రహస్య లిపిగానే, మిగిలి పోయివుంది. పాత వేదకాలంలోనేగాక వేదాంతాల (ఉపనిషత్తుల) కాలంలోకూడ ఆర్యులకు రాత లిపి లేదనే చెప్పవచ్చు. అందుకే వేద పఠనం, శ్రవణం, కంఠస్థం చేయడాలకే పరిమితమైనట్లు అగుపిస్తుంది. మౌఖిక సాంప్రదాయంద్వారా మనకు మిగిలివచ్చిన ఈ తాత్విక

చింతనాధోరణులన్నీ ప్రధానంగా ఆర్యరుషుల అభిప్రాయ ప్రకటనలే ననడంలో సందేహం లేదు. కాని భావాలు ఎవరి అబ్బ సొమ్మూ కావని, అవి గాలిలో (అంటే వాడుకలో) లీలగా వుంటే, వాటిని ప్రత్యేకంగా పట్టి, వివరించి, మెరుగుపర్చి, ఉన్నత దశకు తీసుకెళ్లివుండవచ్చు, ఆ క్రమంలో కొన్ని కొత్త భావనలు సృష్టించి వుండవచ్చనిసైతం మనం గ్రహించాలి.

సరే ఇక ప్రస్తుత పరిశీలనావిషయానికి వద్దాం. నేటికీ మిగిలివున్న అతి పురాతన హిందూమతగ్రంథాల్లో అత్యంత సనాతనమైనవి వేదాలే. ఇవి పూర్తిగా ఆర్యనిర్మితాలనడంలో సందేహం లేదు. అలాగే అనార్య సంస్కృతీ ప్రభావం అతితక్కువగా వున్నదీ వీటిల్లోనే. ఇవి ఏకవ్యక్తి రచనలుగాక బహురుషి ప్రోక్తితాలు. ప్రధానంగా ప్రకృతిఆధారిత దేవతల (మిత్రుడు, ఇంద్రుడు, వరుణుడు, అగ్ని వగైరాల) స్తవనం, సోమపానానికి ఆహ్వానించడంద్వారా వారిని మచ్చిక చేసుకుని మేళ్లు పొందే ప్రయత్నం, వివిధ యజ్ఞయాగాల ప్రస్తావన వగైరాలు వీటిలో ప్రముఖంగా కనిపిస్తాయి. అనార్యులతో జరిగిన యుద్ధాల ప్రస్తావన, వారిపై జరిపిన మారణ హోమాలు, విధ్వంసకాండల వర్ణనలు కూడ పుష్కలంగా కనిపిస్తాయి. వీటిలో చక్కని కవితాప్రతిభ ద్యోతకమయ్యే కొన్ని భాగాలూ వున్నాయి. కాని ఉన్నత తాత్విక భావనల ప్రతిపాదన, వివరణలుమాత్రం అరుదుగానే కనిపిస్తాయి. ఇందుకు సంబంధించిన ఒక ఉల్లేఖన మనం పైన యిచ్చి వున్నాముకూడ. ఈ దశలో ఆర్యులు యింకా బహు దేవతారాధనముండి, ముఖ్యంగా ప్రకృతి ఆధారిత దేవతారాధనముండి బయటపడలేదు. కాని వాళ్లలో విగ్రహారాధన, దేవాలయ నిర్మాణం వగైరాలు కనిపించదు. అంతా యజ్ఞమయమే. అగ్నియే (ఇంద్రుని తర్వాత) అతి ప్రధాన దేవత. బ్రహ్మ విష్ణు మహేశ్వరుల ప్రస్తావన అరుదే; వారి స్థాయికూడ అతితక్కువే. వర్ణాశ్రమ ధర్మం దాదాపుగా కనిపించదు లేదా అప్పుడే నెలకొంటున్నట్లు కనిపిస్తుంది. సంచార పశుపాలక జాతికిచెందిన సర్వలక్షణాలు కనిపిస్తాయి. పాలకులకంటె పురోహితులు (రుషులు, మతగురువులు) గొప్పగా చూడబడినట్లు అగుపిస్తుంది. ఈ వేదాలు నిజానికి మూడే (**ఋక్ సామ యజూషి ఇతి వేదాస్త్రయీ** అని అమరకోశం). తర్వాత నాలుగోది - అథర్వవేదం - వచ్చిచేరినట్లున్నది. పరబ్రహ్మ విడిచిన ఊపిరులే

వేదాలని( అస్య మహతో భూతస్య నిశ్వసితం యదృగ్వేదః) తర్వాత భాష్యం చెప్పారు. ఇవన్నీ **సంహితలు** అనబడతాయి. ఇవి ప్రధానంగా పద్య ( లేక పాట) రూపంలో వుంటాయి. వీటిని మంత్రాలు అంటారు. ఈ మంత్రాలు సూక్తాలుగా, ప్రపాఠకాలుగా, అధ్యాయాలుగా, మండలాలుగా కూర్చబడ్డాయి. పోతే **బ్రాహ్మణాలు** అనేవి తర్వాతికాలంలో, సంహితల్లోని మంత్రాలను వివిధ యజ్ఞయాగాదుల్లో ఎలా ఉపయోగించాలో వివరిస్తూ గద్యరూపంలో చెప్పబడ్డ గ్రంథాలు. తర్వాతివి **ఆరణ్యకాలు** - వానప్రస్థ ఆశ్రమం తీసుకున్న ఆర్యరుషులు అధ్యయనం చేసిన గ్రంథాలివి. వీటిలో జ్ఞానార్జనా విభాగానికి చెందిన తొలియత్నాలు కనిపిస్తాయి. అనంతర కాలంలో వేదాల జ్ఞానకాండలుగా ప్రసిద్ధమైన ఉపనిషత్తులకు, అంతకు మునుపటి బ్రాహ్మణాలకు మధ్యదశలోని ధోరణులన్నీ వీటిలో ప్రతి బింబిస్తుంటాయి. పోతే **ఉపనిషత్తులు** అన్నింటికంటె చివరిదశకు చెందినవి. వీటిలో కర్మకాండలు, అనుష్ఠానాలు వగైరాలు దాదాపు కనిపించవు; ఇంచుమించు పూర్తిగా జ్ఞానార్జనా, తత్వచింతనా లక్ష్యాలకు కేటాయించబడినవి యివి. ఈ నాలుగు అంగాలు కలిసిన గ్రంథసమ్మేళనాల్ని మొత్తంగాకలిపికూడ **వేదాలు** అనడం కద్దుగాని నిజానికి సంహితలే (మంత్రభాగాలే) అసలు వేదాలని గ్రహించాలి. సరే, మనమిప్పుడు ఉపనిషత్తుల్నిగురించి కొంత తెలుసుకుందాం.

ఆత్మవిద్య, బ్రహ్మజ్ఞానాన్ని ప్రసాదించే హేతువిద్య కావల్సి వచ్చినప్పుడు ఈ ఉపనిషత్తులు ఉద్భవించాయని అంటారు. ఈ జ్ఞానవిద్య అందరికీ అంత తేలిగ్గా లభించేదికాదు; గురువులేకుండానైతే అసలుకే అసాధ్యం. అందుకే **ఉప** అంటే దగ్గర, **ని** అంటే కింద, **సద్** అంటే కూర్చొను - వెరసి **ఉపనిషద్** అయింది. అంటే గురువుకు దగ్గరగా, కింద కూర్చొని ఆయన చెప్పేది శ్రద్ధగా ఆలకించడం (sit down near and hear) ముఖ్యమైన విద్యే ఉపనిషత్తన్నమాట. ఇంకా వేదాల్లోని గూఢార్థాలను విప్పిచెప్పేవే ఈ ఉపనిషత్తులు, కనుక ఈ రహస్యాలను ఎవరో ఏరికోరిన కొంతమందికే వివరించాల్సివుంటుందనే సాంప్రదాయం కూడ వున్నది. కనుక ఉపనిషత్తులను రహస్యవిద్యగా భావించడమూ కద్దు [**ధర్మే**

**రహస్యుపనిషద్ స్యాత్** అని అమరకోశం ]. ఇంకా "**ఉపనిషద్యతే - ప్రాప్యతే బ్రహ్మాత్మభావోనయా ఇతి ఉపనిషద్** " - అంటే దేనివల్ల బ్రహ్మసాక్షాత్కారం కాగలదో అదే ఉపనిషత్తు అనికూడ చెప్పబడింది. వేదాల్లో ఆఖరిభాగంకావడమేగాక వేదరహస్యాల్ని విప్పి జ్ఞానబోధ చేసేవిగనుక వీటిని **వేదాంతాలు** అనికూడ అంటారు. అసలు ప్రధానమైన ఉపనిషత్తులు పదే నని సర్వేపల్లి రాధాకృష్ణన్ రాస్తాడు. కాని ఆదిశంకరుడు - **ఈశ, కేన, కఠ, ప్రశ్న, ముండక, మాండూక్య, తైత్తిరీయం, ఐతరేయం, ఛాందోగ్య, బృహదారణ్యక, శ్వేతాశ్వతార** మొదలైన 11 ఉపనిషత్తులపై వ్యాఖ్యలు రచించడమేగాక యింకా **కౌశీతకి, జాబాల, మహానారాయణ, పైంగళ** ఉపనిషత్తుల్నిగురించి ప్రస్తావిస్తాడనికూడ రాధాకృష్ణన్ పేర్కొంటాడు. **ముక్తికోపనిషత్తు** లో మొత్తం 108 ఉపనిషత్తుల ప్రస్తావన వుంది. కాని తర్వాత తర్వాత వీటి సంఖ్య మరీ పెరిగిపోయి నేటికి సుమారు 240 ఉపనిషత్తులదాకా లెక్క తేలుతున్నాయట. వీటిలో అక్బరు కాలంలో రచింపబడ్డ **అల్లోపనిషత్తు** కూడ ఒకటుందని, దానిలో సంస్కృతం, అరబ్బీలు కలగలిసిన ఒక మిశ్రమభాషలో పది గద్యభాగాలున్నాయి, రసూల్, మహమ్మద్, అక్బర్ మొదలైన పదాల వాడకం వుంది అని తెలుసుకోవడంకూడ ఎంతో ఆసక్తికరంగా వుండగలదు. సరే ఇలాంటి తర్వాతికాలపు హాస్యాస్పద - లేక గంభీరమైనవే కావొచ్చు - రచనల్ని తీసేస్తే ప్రధాన, పురాతన ఉపనిషత్తులు 15-20కి మించవని, అవన్నీ క్రీస్తు పూర్వ కాలానికి చెందినవని తెలుసు కోవాలి. ఈ ఉపనిషత్తులన్నీ క్రీ.పూ. 8-3 శతాబ్దాల మధ్యకాలంలో రూపొందించబడినవని, వీటిలో కూడ ఈశ, కేన, కఠ, బృహదారణ్యక, ఛాందోగ్య, కౌశీతకి, ఐతరేయ, తైత్తిరీయ ఉపనిషత్తులు బుద్ధునికి ఎంతో పూర్వమే - క్రీ. పూ. 8-7 శతాబ్దాల్లో రూపొందించబడ్డాయనీ అంటారు.

ఈ ఉపనిషత్తులు రూపొందేకాలానికే ఆర్యులు సింధునది మైదానాల నుండి తూర్పుకు తరలి గంగామైదాన ప్రాంతాలను ఆక్రమించేసారు. సువిశాలమైన గంగా-సింధూ మైదానప్రాంతమంతా ఆర్యావర్తమనే పేరిట ఈ సాపేక్షంగా నవీనమైన, శక్తు్యత్సాహాలు, జీవజవాలు, పోరాటపాటవాలు

మెండుగాగల జాతికి పాదాక్రాంతమై పోయింది. అంతేగాక క్రమేపీ సింధు నదీ మైదాన ప్రాముఖ్యం తగ్గి, గంగానదీ మైదాన ప్రాముఖ్యం, సింధు, సరస్వతి నదులకంటె గంగా, యమున తదితర నదుల ప్రాముఖ్యం బాగా పెరగజొచ్చింది. చరిత్ర ప్రసిద్ధమైన 16 జనపదాల నిర్మాణం జరిగి పోయిందని లేక ఆ నిర్మాణక్రమం మొదలై వుండిందనికూడ చెప్పవచ్చు. అంతేగాక చక్రవర్తి క్షేత్రస్థాపనకు పాలకులు ఉవ్విళ్లూరే క్రమంకూడ మొదలయింది. వేదకాలంలోని అను, దృహ్యు, పురు, తుర్వశు, యదు జాతులు మరుగున పడిపోయి కురు, పాంచాల, ఉశీనర మొదలైన జాతులు ప్రాముఖ్యంలోకి వచ్చాయి. ఇంకా పూర్తిగా ఆర్యులుకాని లేక వర్ణసంకరంచే ఆర్యుల కోవకు చెందిన మాగధులు, ఉదీచ్యులు, గాంధారులు మొదలైన జాతుల ప్రాశస్త్యంకూడ వెలుగులోకి వచ్చింది. వర్ణాశ్రమ ధర్మం నెలకొన్నది. సమాజంలో బ్రాహ్మణుల స్థానం అత్యున్నతంగావుండేది. వారు భూసురులుగా కీర్తించబడ్డారు. విద్యార్జన, జ్ఞానాన్వేషణ, జ్ఞాన బోధలు వారి ప్రథమ కర్తవ్యాలుగా భావించబడ్డాయి. కాని ఇప్పటిలా జన్మ ఆధారంగా కులవ్యవస్థ నెలకొనివున్నట్లు కనిపించదు. అది అప్పుడప్పుడే రూపొందుతూ వుండివుండాలి. తర్వాతికాలంలో అనేక అనార్యజాతుల్ని కలుపుకునే (assimilate చేసుకునే) క్రమంలో ఈ కుల వ్యవస్థ శాఖోపశాఖలుగా విస్తరిస్తూ, దృఢంగా నెలకొన్నదని గ్రహించాలి.

ఈ రాజకీయ, సాంఘిక పరిస్థితుల నేపథ్యంలో తత్వచింతనకే ముఖ్యంగా అంకితమై అడవుల్లోనో, లేక జనావాసాలకు దూరంగా నిర్జన ప్రాంతాల్లోనో ఆశ్రమాలు స్థాపించుకుని జీవించే ఋషుల నిరంతర చింతనా ఫలితంగానే ఈ ఉపనిషత్తులు వెలువడ్డాయి. తొలి, మలి వేదకాలాల్లో ప్రధానంగా, లేక గణనీయంగా బహుదేవతోపాసనకు, యజ్ఞ యాగాది కర్మ కాండల నిర్వహణకు అంకితమైవుండిన ఋషుల తత్వచింతన ఈ కాలంలో మరింత సునిశితంగా రూపొందింది. ఈ యజ్ఞయాగాదులవల్ల ఫలితమేమి టనేంతదాకాకూడ విమర్శలు సాగాయి. బహు దేవతల వెనుక సర్వస్రష్ట అయిన పరమ పురుషుడు ఎవరో ఒకరు వుండితీరాలనే వాదం మొదలైంది. క్రమేపీ ఆ ఏకేశ్వరాన్వేషణ అసలు పురుషుడు, ప్రకృతి అనేవాటికే అతీతంగా

ఏదో ఒక సర్వాంతర్యామి వుండివుండాలనే నిష్కర్షకు దారితీసింది. అదేసమయంలో సృష్టి వైవిధ్యతను, ప్రాణిబాహుళ్యాన్ని వివరించడానికి, మృత్యురహస్యాన్ని ఛేదించడానికి జీవాత్మ వాద మొకటి కూడ మొదలైంది. శరీరాలు నశిస్తాయిగాని జీవాత్మ నశించదనే నిష్కర్షకు వచ్చారు. మరి నశింపులేని ఆ జీవాత్మ(లు) ఏమౌతాయంటే ఎప్పటి కప్పుడుగా కొత్తగా పుట్టుకొచ్చే ప్రాణుల ఆవిర్భావానికి దారితీస్తాయన్న వివరణ వచ్చింది. అంటే అవి నూతన దేహాలు ధరిస్తాయని. ఇదే పునర్జన్మ సిద్ధాంతం సారాంశం. మానవ జన్మ అతి గొప్పది, దుర్లభం అనే స్వాతిశయం (ప్రపంచంలోని సర్వ మానవజాతులవిషయంలోలాగే) పెచ్చరిల్లింది. కనుక శూకర-కూకరాది, క్రిమికీటకాది ప్రాణులవి నీచజన్మలని అన్నారు. అంచేత. చెడు కర్మలు చేస్తే బతికుండగానేగాక చనిపోయినపిదపకూడ చెడు ఫలితాలు అనుభవిస్తారు, నీచ జన్మ లెత్తుతారనే హెచ్చరికలు, నీతిబోధలు ప్రారంభమైనాయి. దీనికే మరోపక్షంగా ఈ జన్మలో మీరు అనుభవించే దుఃఖాలన్నింటికీ గతజన్మల్లో మీరు చేసుకున్న పాపాలే కారణమనే ఒక వ్యాఖ్యానం పొడుకొన్నది. అంటే కర్మసిద్ధాంతం ఈ కాలంలో కుదురుగా పొదుకుపోయింది. ఈ కర్మ సిద్ధాంత పరిణామానికి ఆర్యులకు పూర్వమున్న దస్యులు (సింధునదీ నాగరికులు) వగైరా జాతుల చింతనాధోరణుల ప్రభావం, పరస్పర ప్రతిచర్య (interaction)లుకూడ గణనీయమైన కారణాలని నా అభిప్రాయం.

జీవాత్మ అస్తిత్వాన్ని ప్రతిపాదించినా సమస్త చరాచర ప్రపంచానికి అది భిన్నమనే చెప్పారు. మరి ఈ సమస్తవిశ్వాన్ని నిర్మించిందెవరు, ఈ జీవాత్మను కూడ సృష్టించిందెవరు అనే మీమాంస మొదలైంది. అది పెరిగి పెరిగి చివరకు **ఈశావాస్య మిదం సర్వం** అన్న నిష్కర్షకు దారితీసింది. మరి **ఈశ** అంటే ఏమిటనే వివరణ అవసరమైంది. వర్ణించబోతే కష్టాలెన్నో ఎదురైనాయి. అది అన్నింటిలోనూ వుండాలి అప్పుడే అది అన్నింటికంటె ఎక్కువకాగల అవకాశం వుంటుంది. అదే సమయంలో అది అన్నింటికంటె భిన్నంగాకూడ వుండాలి. లేకుంటే దాని విశిష్టత ఏముంటుంది ? చాల గడ్డు సమస్యే. దానితో అది ఒకే అస్తిత్వం - **ఏకం సద్** - అన్నారు. దాన్నే కొంతకాలం **పరమపురుష** లేక **పురుష** అన్నారు. అదీ సవ్యమైనదిగా అనిపించలేదు. మానవసహజమైన గుణధర్మాల్లో కట్టివేయబడిందిగా

అనిపించింది. చివరికి దాన్ని **బ్రహ్మ** అని పిలిచారు. మొదట్లో మన ఐరోపా ఖండ శాస్త్రజ్ఞులు సర్వం ఈథర్ మయం అన్నట్లు, లేక ఇటీవల ఐన్‌స్టీన్ సర్వం ఫీల్డుమయం అన్నట్లు అనుకోవచ్చేమో. ఈ బ్రహ్మ యిది అని ఇదమిత్థంగా చెప్పడం అసాధ్యం; కాకుంటే ఇది కాదు, ఇలా కాదు (**నేతి నేతి**) అని చెప్ప వీలవుతుందంతమాత్రమే. అది అన్నింటికీ అతీతమైంది. రిసర్వ గుణాలకూనూ. కనుక అది నిర్గుణ బ్రహ్మ. మరి ఇన్ని గుణవిశేషాలుగల ఈ ప్రపంచం ఎలా వున్నదంటే ఆ నిర్గుణ (పర) బ్రహ్మ సగుణ(అపర) బ్రహ్మగా మారిందని అన్నారు. ఈ విధంగా అద్వైతాన్ని, ద్వైతాన్ని సమన్వయంచేసే ఒక అసిధారావ్రతం చేసారు; లేదా తేలిగ్గా అంటే పిల్లిమొగ్గ వేసారనీ అనొచ్చు. మరి ఈ బ్రహ్మ పదార్థమా - కాదు; భావమా - అదీ కాదు; మరేమిటి ? అనాది మధ్యాంతం, అనిర్వచనీయం, యిలా యిలా అన్నీ అ తే (నెగటివ్స్). మరి దాన్ని తెలుసుకోవడం ఎలా - శాస్త్రాధ్యయనం వల్లనా? - కాదు ; సత్కర్మల వల్లనా - కానే కాదు. నిరంతర ధ్యానం వల్లనా? - కావచ్చు, కాదుకూడ. ఆ బ్రహ్మకే దయకలిగి తెలుసుకొనేందుకు నీవు అర్హుడని భావించినప్పుడే అది నీకు సాక్షాత్కారిస్తుంది. ఐతే ఏమౌతుంది ? [ ఇంకేమౌతుంది, నీ బొంద - ] నీవే బ్రహ్మ అవుతావు. నీవు, అది అనే భేదం వుండదు. ఇలా సాగిపోతుందా తత్వ చింతన, వివరణ అంతానూ.

మరి దీన్నేమందాం భావవాదమనా, భౌతికవాదమనా? భావమంటే ఏమిటి, పదార్థమంటే ఏమిటి అని వితర్కించుకోవల్సివస్తోందిప్పుడు. ఐన్‌స్టీన్ సాపేక్ష సిద్ధాంతం, $E=MC^2$ సమీకరణాలతో, అణు విస్ఫోటనాలతో మునుపటి పదార్థ నిత్యత్వ సిద్ధాంతం ముక్కిచెక్కి పోయింది. పదార్థం శక్తిగా మారగల్గినప్పుడు, శక్తికూడ పదార్థంగా మారగలదా? ఎందుకు లేదు, తప్పకుండా. కాంతికి అణుస్వభావమూ, అలస్వభావమూ రెండూ వున్నాయని ఇప్పుడనడంలేదా? కనుక శక్తికూడ పదార్థంగా మారగలగాలి, మారేవుండాలికూడ. అంటే, ఇదివరలా ఇది పదార్థం, ఇది శక్తి అని వేరు చేసి చెప్పలేము. సర్వం **అదే** నని నేటి భౌతికవాదులుకూడ అనక తప్పదేమో! మరి ఆ **అది** ఏమిటనిమాత్రం నన్నడగకండి. నాకు తెలవదు. అయినా అది తెలిస్తే నేనూ **అది** అయిపోనూ - అయ బాబోయ్!!

మొత్తం మీద ఈ అది భావనకు మన దేశ తత్వవేత్తలు కొన్ని వేల సంవత్సరాల పూర్వమే చేరుకున్నారని గమనించాలి. 17-19 శతాబ్దాల్లో ఐరోపాలో - ముఖ్యంగా జర్మనీలో - బాగా వికసించిన తత్వ చింతన కాంత్, హెగెల్‌ల వివరణలద్వారా ఒక అఖండ భావం ((Absolute idea) ప్రతిపాదనకు వచ్చింది. మార్క్సువద్దకు వచ్చేసరికి ఆ అఖండంలో ఐడియాను తీసేసి మాటర్‌ని(పదార్థాన్ని) ప్రతిష్టించాడు. ఆయనకూడ అద్వైతాన్ని (monism) వ్యవహార ద్వైతం (practical dualism) తో సమన్వయించేసే ప్రయత్నం చేయకపోలేదు. There is no matter without motion and no motion without matter అన్నాడు. నేను ఆ మాటరూ, మోషనూ రెండూకూడ ఒకటికావా అనే ప్రశ్నకూడ తలెత్తుతున్నది మరి. కనుక మనం ప్రస్తుతానికి ఈ అది ని అది గానే వుంచి పక్కకు పెడదాం. సరే, హెగెల్,కాంత్ ల ప్రసక్తి వచ్చిందిగనుక వారికి మన హిందూ తత్వశాస్త్రం గురించి, ముఖ్యంగా ఈ ఉపనిషత్తులగురించి, ఏమైనా తెలుసా అనే విషయంకూడ పరిశీలిద్దాం. కాంత్ కాలానికి జర్మన్‌లోగాని, ఇతర ఐరోపాభాషల్లోగాని వేదాలు, ఉపనిషత్తులేవీ వెలువడలేదుగనుక అతనికి ఈ విషయాలు ఏవీ తెలవ్వుగాని పరోక్షంగా అరబ్బులనుండి ఫిల్టరై వచ్చిన హిందూతత్వమేదైనా తెలిసివుంటే కొంత వుండొచ్చు. పోతే హెగెల్‌కు సంబంధించి వేదాలనుగురించి, కోల్‌బ్రూక్ అనువాదాలద్వారా సాంఖ్య, న్యాయదర్శనాలనుగురించి తనకు 'ఫర్వాలేదులే అనేంత చక్కగా' (tolerably well) తెలుసని తానే చెప్పుకున్నాడు. బ్రహ్మ అనే భావన ప్రస్తావన, వివరణగురించికూడ ఆయనకు కొంత తెలిసినట్లే వుందిగాని ఉపనిషత్తులగురించిమాత్రం తెలిసినట్లు లేదు. పైగా బ్రహ్మభావన తన అఖండభావం (Absolute Idea)కంటె తక్కువస్థాయిది (inferior) అనే, ఆ మాటకు అసలు ప్రాచ్యతత్వచింతనే తమ స్థాయిని అందుకునేంత సమున్నతంగా లేదనే అహం మాత్రం ఆయనలో బాగా కనిపిస్తుంది. పోతే ఉపనిషత్తుల్ని అనువాదంలో చదివిన - ( ఈ అనువాద కథాక్రమం బెట్టిదన - మొగలు చక్రవర్తి షాజహాను పెద్ద కొడుకు, మేధావి అయిన దారా షికో కొన్ని ఉపనిషత్తుల్ని పార్సీలోకి అనువదించివుండినాడు. దాన్ని ఏంక్వెటిల్ డుపెర్రిన్ అనే ఫ్రెంచి రచయిత లాటిన్‌లోకి, ఫ్రెంచిలోకి

అనువదించాడు. **ఔప్నేఖత్** (Oupnekhat) అనే పేరుతో దాని లాటిన్ అనువాదం 1801-02లో ప్రచురింపబడింది) - దాన్ని కష్టపడి అధ్యయనం చేసిన, సుప్రసిద్ధ జర్మన్ తాత్వికుడు **ఆర్థర్ షోఫెనార్** (1788-1860) మాత్రం ఆ ఉపనిషత్తుల్లోని తత్వచింతనతో ఎంతగానో ప్రభావితుడైనాడు. "ఇంతగా మేలుకలిగించే, ఇంతగా దివ్యానుభూతి కలిగించే మరో అధ్యయనం నాకీ ప్రపంచంలో కనిపించలేదు. ఇది నాకు జీవితంలో ఉపశాంతిని ప్రసాదించింది. మరణంలోకూడ యిది నాకు ఉపశాంతి నిస్తుంది" అని గొప్పగా పొగిడాడు. ప్రాచ్యతత్వశాస్త్రాన్ని, ముఖ్యంగా హిందూతత్వశాస్త్రాన్ని - బాగా అధ్యయనం చేసి, వేదాలు, ఉపనిషత్తులు, ఇతర అనేక పవిత్రగ్రంథాలను జర్మన్‌లోకి అనువదించిన మాక్స్‌ముల్లర్ (మోక్షమూలుడు) కూడ, "షోఫెనార్ నుడివిన పై (ప్రశంసా)వాక్యాలకు ధ్రువీకరణ యివ్వడానికి జీవితాంతం వాటిని అధ్యయనం చేసిన నేను సిద్ధంగావున్నాను "అని అన్నాడు. అలాగే **పాల్ డాయ్‌సన్, మెక్‌డొనాల్డ్, ఫ్రెడరిక్ ష్లెగెల్** మొదలైన పాశ్చాత్య తత్వవేత్తలు మరెందరోకూడ ఈ ఉపనిషత్తుల ప్రశస్తిని కొనియాడారు.

ఇలాంటి ఈ ఉపనిషత్తుల్లో ఐదింటిని తెలుగుచేసి, నా వ్యాఖ్యలు అక్కడక్కడా జోడించి మీ ముందుంచుతున్నాను. వీటిలో మొదటిదైన **ఈశావాస్యోపనిషద్** అన్నిటికంటె ప్రాచీనమైన ఉపనిషత్తుగా పేరు గాంచింది. ఈశుడు, జగత్తు రెండూ సారాంశంలో ఒకటేనని, అస్తిత్వం, పరిణామం (ఉనికి, రూపొందడం - being and becoming)రెండూ ఒకటేనని చెప్పడమే ఈ ఉపనిషత్తు పరమార్థం. పోతే సామవేదంలో, తల్వకార బ్రాహ్మణానికి చెందిన **కేనోపనిషత్తు** 2 పద్యభాగాలు, 2 గద్య భాగాలతో మొత్తం 4 ప్రకరణాలుగా వుంటుంది. ఐహిక విషయాసక్తినుండి దూరంకావల్సిన అవసరమెంతైనా ఉంది, అలాంటప్పుడే అంతిమ సత్యంపై కేంద్రీకరించి, పరావిద్యను పొందే అవకాశం వుంటుంది, అపరావిద్య క్రమముక్తికి దారితీస్తుందిగాని అంతకంటె పరబ్రహ్మలో లీనమైపోయే సద్యోముక్తి ప్రసాదించే పరావిద్య సమున్నతమైనదనే బోధన లీ ఉపనిషత్తులో వున్నాయి. పోతే యమధర్మరాజుకు, నచికేతునికి జరిగిన సంవాదం,

యముని బోధనలరూపంలో జీవాత్మ పరమాత్మల అవినాభావ సంబంధాన్ని, పరమాత్మ పరమౌన్నత్యాన్ని వెలువరించేది **కఠోపనిషత్తు**. దాన్ని వున్నదున్నట్లుగా చదవడమే అత్యంత ఆసక్తికరంగా వుంటుంది. ఇక పిప్పలాదుడనే బ్రహ్మర్షిని ప్రశ్నలడిగి సుకేశాది ఆరుగురు మునులు ఆయనవద్దనుండి పరబ్రహ్మతత్వాన్ని సంపూర్ణంగా తెలుసు కొనడం గురించి వివరించేది **ప్రశ్నోపనిషత్తు**. చివరగా అథర్వవేద శౌనకీ శాఖకు చెందిన **ముండకోపనిషత్తు** లో వ్యవహార ప్రపంచపు దిగువస్థాయి జ్ఞానానికీ, పరబ్రహ్మను తెలుసుకున్న సమున్నత జ్ఞానానికీ మధ్య అంతరాన్ని స్పష్టంగా చూపే ప్రయత్నం జరిగింది. ముండక అనేది ముణ్డ్ ( గొరగడం) అనే ధాతువునుండి వచ్చిందని, దీని అర్థం అజ్ఞానాన్ని, తప్పులన్నిటినీ తొలగించి ఉపనిషత్తుల్ని పరిశుద్ధం, విముక్తం చేయడమేనని ఒక వ్యాఖ్య. ఉపనిషత్తుల్లో తలమానికంగనుక ముండకోపనిషత్తన్నారని మరో వ్యాఖ్య. యజ్ఞయాగాది కర్మకాండలు, పూజాపునస్కారాలవల్ల అంత ఉపయోగం లేదని, నిరంతర ధ్యానం, నిష్కామ కర్మల మాధ్యమంగా మాత్రమే బ్రహ్మ ప్రాప్తి సాధ్యమనీ స్పష్టంగా చెప్పబడింది.

**మనిషి నిత్య సత్యాన్వేషిగా, నిరంతర జ్ఞానసాధకుడుగా వుండాలి. ఈ ప్రపంచాన్ని మొత్తంగా తెలుసుకోగలమో లేదో తెలవదుగాని అందుకు ప్రయత్నంమాత్రం విడవకుండా చేయాలనేది నా అభిప్రాయం. నాస్తిక, హేతువాద దృక్పథానికి హిందూతత్వశాస్త్రం పూర్తిగా వ్యతిరేకమనైతే నేను భావించడంలేదు. కనుక పునర్జన్మ పరబ్రహ్మలో ఐక్యత, అందుకు భక్తిప్రపత్తులు, ఆయన కరుణా కటాక్షాలు ముఖ్యమనే భావనల్ని ఒప్పుకోకుండానే హిందూతత్వరంగంలో ప్రతిపాదితమైన కొన్ని సమున్నత భావనల్ని నిర్లక్ష్యం చేయకుండా అధ్యయనం చేయాలనికూడ నేను వాదిస్తాను. అందుకే నా అధ్యయన క్రమంలో ఈ పుస్తక రచన, ప్రచురణలకు పూనుకున్నాను. తెలుగు ప్రజలు నా యీ ప్రయత్నాన్ని తప్పక ఆదరిస్తారనే ఆశిస్తున్నాను.**

15-03-1999. ఇంగువ మల్లికార్జున శర్మ

# మా లక్ష్యాలు

ఏ పార్టీకి, ఏ గ్రూపుకూ చెందని మేము కొందరు కమ్యూనిస్టులం ఈ మార్క్సిస్టు అధ్యయన వేదికను 1981 నవంబరు 7వ తేదీనాడు హైదరాబాదులో ఏర్పాటు చేసాము మా ఆశయాలు, లక్ష్యాలు యివి·

1 వామపక్ష, ప్రజాతంత్ర్య ఐక్యత అవసరాన్ని గురించి ప్రచారం చేయడం; కమ్యూనిస్టు వుద్యమ సూత్రబద్ధ ఐక్యతకోసం పాటుపడడం

2 కమ్యూనిజం, మార్క్సిస్టు సోషలిజాలకు సంబంధించిన మౌలిక రచనల్ని, స్వాతంత్ర్యం, ప్రజాస్వామ్యం, సోషలిజాలకు దోహదపడే యితర ముఖ్యరచనల్ని, వివిధ జాతీయ, అంతర్జాతీయ సమస్యలపై పుస్తకాలు, కరపత్రాలను తెలుగులోను, ఇంగ్లీషులోను, వీలైతే యితర ప్రాంతీయ భాషల్లోను, ప్రచురించడం

3 మార్క్సిజం ప్రచారం, సంరక్షణలకోసం, వివిధ జాతీయ అంతర్జాతీయ సమస్యలపై మార్క్సిస్టు విశ్లేషణకోసం గోష్టులు, సెమినార్లు, సమావేశాలు జరపడం

4 పౌరహక్కుల వుద్యమంలోనూ, యితర ప్రజాస్వామ్య వుద్యమాల్లోనూ చురుకుగా పాల్గొనవల్సిందిగా వేదిక సభ్యులను, యితర ప్రగతిశీలురను ప్రోత్సహించడం

## OUR AIMS AND OBJECTS

Marxist Study Forum, founded on 7 November 1981 at Hyderabad, professes the following aims and objects

1. To conduct study and propaganda and encourage social action aiming at a broad left, democratic unity and a principled unity in the communist movement based on a comprehensive review of the world communist and socialist movements,
2. To publish basic works of socialism, marxism and communism, important works about various revolutionary movements and other valuable works contributing to the cause of social progress and human welfare; also to publish books, booklets and pamphlets on various national and international problems in English, Telugu and other regional languages;
3. To conduct seminars, symposia and meetings to further the cause of socialism and human welfare; and
4. To encourage the members of the Forum and others to actively participate in the civil liberties movement and other rational and just movements of the people.

**Welcome to join us!**



**I. Mallikarjuna Sharma**
Convener, MARXIST STUDY FORUM
6-3-1243/116, D Sanjeevaiah Nagar,
Opp Raj Bhavan,
**Hyderabad - 500 482.**

* * * * *

# విషయ సూచిక



* * * * *

# ఈశావాస్యోపనిషత్తు

ఈ ఉపనిషత్తు శుక్లయజుర్వేద సంహితలోని 40 వ అధ్యాయం ఇదే అన్నింటి కంటె మొదటి ఉపనిషత్తు అని అంటారు శుక్లయజుర్వేదపు మొదటి 39 అధ్యాయాల్లో వివిధ రకాల కర్మకాండలగురించి వర్ణనలు, వివరణలు వున్నాయి అయితే ఈ చివరి అధ్యాయంలో మట్టుకు భగవత్స్వరూపమైన జ్ఞానాన్ని వివరించడం జరిగింది. దీని మొదటి మంత్రంలో ఈశావాస్యమ్ అనే పదజాలం రావడంచేత దీన్ని ఈశావాస్యోపనిషత్తు అనీ, కొన్ని సందర్భాల్లో ఈశోపనిషత్తు అనీ పిలవడం కద్దు

## శాంతి పాఠం

**ఓం పూర్ణమదః పూర్ణమిదం పూర్ణాత్ పూర్ణముదచ్యతే।**

**పూర్ణస్య పూర్ణమాదాయ పూర్ణమేవావశిష్యతే ॥**

**ఓం శాంతిః శాంతిః శాంతిః**

ఓంకారస్వరూపమైన (సచ్చిదానందస్వరూపమైన) అది (పరబ్రహ్మ) అన్ని విధాల పూర్ణమైనది ఇది (ఈ జగత్తు) కూడ పూర్ణమైనది ఆ పూర్ణంనుండే (అంటే పరబ్రహ్మనుండే) ఈ పూర్ణం (జగత్తు) ఉత్పన్నమైనది ఆ పూర్ణం నుండి (పరబ్రహ్మనుండి) ఈ పూర్ణం (జగత్తు) తీసివేసినా పూర్ణం (పరబ్రహ్మ) మిగిలేవుంటుంది అంటే ఈ విశ్వసృష్టికర్తే పరబ్రహ్మ కనుక విశ్వం లేకున్నా ఆ బ్రహ్మతత్వంమాత్రం నిలిచే వుంటుందని అర్థం త్రివిధ తపాలకు శాంతి అగుగాక

* * *

ఈశా వాస్యమిదం సర్వం యత్కించ జగత్యాం జగత్।
తేన త్యక్తేన భుఞ్జీథా మా గృధః కస్య స్విద్ ధనమ్॥

ఈ అఖిల బ్రహ్మాండంలోగల జడ-చేతనారూపమైన చరాచర జగత్తు సర్వమూ ఈశ్వరవ్యాప్తమై వున్నది. ఇది గ్రహించి ఆ ఈశ్వరుడ్ని వెంటవుంచుకునే ( అంటే మనసులో నిలుపుకుని) త్యాగపూర్వకంగా ఐహిక భోగాలు అనుభవించు అంతేగాని విషయాసక్తికి గురికావద్దు ఎందుకంటే ఈ ధనం, సుఖభోగాలన్నీ ఎవరివి ?- అంటే అవన్నీ క్షణికాలే, శాశ్వతాలుకావని, అంతేగాక అవి ఈశ్వర ప్రసాదితాలు గనుక ఈశ్వరార్థమే అనుభవించబడాలని అర్థం. [*భగవద్గీత 9:4* లో *మయా తతమిదం సర్వం జగదవ్యక్తమూర్తి నా / మత్ స్థాని సర్వభూతాని న చాహం తేష్వవస్థితః //*- అంటే, ఈ జగత్తంతా అవ్యక్తరూపుడైన నాచే నిండివున్నది సర్వభూతాలూ నాలోనే వున్నాయి కాని నేనుమాత్రం వాటిలో లేను అని; *గీత 10: 39,42* లలోకూడ యిదే భావం వచ్చేటట్లు చెప్పబడింది. అలాగే విషయాసక్తిని వర్జించమని ఉపదేశించే *గీత 2:64, 3:9* శ్లోకాలుకూడ గమనార్హం *3:9*లో ముక్తసంగసమాచర అని చెప్పబడింది] **(1)**

కుర్వన్నేవేహ కర్మాణి జిజీవిషేచ్ఛతం సమాః।
ఏవం త్వయి నాన్యథేతోఽ స్తి న కర్మ లిప్యతే నరే॥

శాస్త్రనియమానుసారంగా కర్మలు చేస్తూనే ఈ ప్రపంచంలో నూరేళ్లు నిండుగా బతకాలని కోరుకోవాలి ఈ విధంగా (త్యాగభావంతో, ఈశ్వరార్థం) చేసే కర్మలు నిన్ను అంటవు, మానవ శరీరంలో లిప్తం కావు మరి యిది వినా మరో మార్గంకూడ లేదు ఈ శ్లోకాన్ని రెండు విధాలుగా అర్థం చేసుకోవచ్చు ఒకటి పూర్తిగా ఈశ్వరచింతనతో కర్మలు చేయాలని, అలాంటి కర్మఫలాలు మానవునికి అంటవని రెండవది, మనిషి తన వ్యవహారాచరణనుండి పారిపోరాదు, స్వకర్మలు చేస్తూనేవుండాలి, అయితే సద్భావనతో (ఈశ్వరోపాసనతో) చేసే కర్మలవల్ల దుష్ఫలితాలు వుండవు అని నచ్చజెప్పడం మనిషి సాంఘిక వ్యవహారాచరణ చేస్తూవుండాలని నొక్కిచెప్పే అర్థమే

సవ్యమైనదని మా అభిప్రాయం [*భగవద్గీత, **2:50-51, 5:10***లలో ఈ సారాంశమే చెప్పబడింది ముఖ్యంగా 5 10 లో - *బ్రహ్మణ్యాధాయ కర్మాణి సంగం త్యక్త్వా కరోతి యః । లిప్యతే న స పాపేన పద్మపత్రమివాంభసా ॥* - అంటే, కర్మలన్నిటిని ప్రకృతిపై లేక ఈశ్వరునిపై ఆరోపించి వ్యవహరించేవాడు నీటిలో తామరాకులా ఆ కర్మలు తన్ను అంటకుండా వుంటాడు అని స్పష్టంగా చెప్పబడింది] **(2)**

**అసుర్యా నామ తే లోకా అన్ధేన తమసాఽఽవృతాః ।**
**తాంస్తే ప్రేత్యాభిగచ్ఛన్తి యే కే చాత్మహనో జనాః ॥**

అసురుల ప్రసిద్ధ లోకాలేవైతే వున్నాయో అవన్నీ అజ్ఞానం, దుఃఖాలు, క్లేశాలతో కూడిన అంధకారంచే కప్పబడి వున్నాయి ఏ మనుష్యుడైతే ఆత్మహత్య గావించుకుంటాడో అతడు చనిపోయినతర్వాత ఆ భయంకర అంధకారమయ లోకాలకే మళ్లీ మళ్లీ వెళ్లుతుంటాడు. అంటే మనుష్య జన్మ దుర్లభమని, దీనిలోనే పరమాత్మ చింతనపైనే శ్రద్ధాసక్తులు కేంద్రీకరించి ఐహిక భోగాలకు, విషయ వాంఛలకు దూరంగావుంటూ ఉపాసన చేస్తే నేరుగా పరబ్రహ్మ సాయుజ్యం పొందే అవకాశం వుంటుందని, అలాకాక నీచమైన భోగాసక్తి, విషయవాంఛలకే పరిమితమైతే జనన మరణ చక్రంలో చిక్కుకు ని కొట్టుమిట్టాడుతూ, శూకర-కూకరాది నీచ యోనుల్లో పడి జన్మిస్తూ అసుర లోకాల్లో అంధకారమయ జీవితాలు గడుపుతూ మగ్గకతప్పదనేది దీని భావమని వేదాంతుల వ్యాఖ్య ఇక్కడ ఆత్మహత్య అంటే ఉన్నత ఆశయాలకుకాక నీచ వాంఛలకు పరిమితమై ఆత్మపతనంగావించుకోవడమే నని, అంతేగాని భౌతికంగా తమ్ముతాము నశింపజేసుకోవడం కాదనీకూడ అంటారు. [*భగవద్గీత **16 : 15-16, 19-20*** శ్లోకాలలో అహంభావం, విషయాసక్తులవల్ల మనిషి పతనమై, నీచ యోనులందు జన్మిస్తాడనే ప్రస్తావన వుంది 16వ శ్లోకంలో *అనేక చిత్త విభ్రాన్తాః మోహజాలసమావృతాః । ప్రసక్తాః కామభోగేషు పతన్తి నరకే ఽ శుచౌ ॥* - అంటే, అజ్ఞానంతో లెక్కలేనన్ని చిత్త విభ్రాంతులకు లోనై, మోహజాలమందు చిక్కుకుని, కామభోగాలందే అత్యాసక్తి కలిగి మలిన నరకమందు పతితులవుతారు అనీ, *తానహం ద్విషతః క్రూరాన్ సంసారేషు నరాధమాన్ । క్షిపామ్యజస్రమశుభాన్ ఆసురీష్వేవ యోనిషు ॥* - అంటే, ద్వేషబుద్ధితోమెలిగే

ఆ క్రూరకర్ములైన మానవాధముల్ని నేను అమంగళమైన ఆసురీయోనుల్లోనే మళ్లీ మళ్లీ పుట్టేట్లు చేస్తాను అనీ చెప్పబడింది. అంతేగాక మనిషి ఆత్మహననంకాక ఆత్మోద్ధరణ చేసుకోవాలనికూడ *గీత 6:5*లో చెప్పబడింది - *ఉద్ధరేదాత్మనాత్మానం నాత్మానమవసాదయేత్ । ఆత్మైవ హ్యాత్మనో బన్ధుః ఆత్మైవ రిపురాత్మనః ॥* - అంటే, ప్రతి మనిషీ తన్ను తానే ఉద్ధరించుకోవాలి. అంతేగాని అధోగతి పాలు కాకూడదు ఎవరికి వారే బంధువులు తమకు తామే శత్రువులు అని అర్థం]. **(3)**

**అనేజదేకం మనసో జవీయో నైనద్దేవా ఆప్నువన్ పూర్వమర్షత్।**
**తద్ధావతోఽన్యానత్యేతి తిష్ఠత్తస్మిన్నపో మాతరిశ్వా దధాతి ॥**

అది (పరబ్రహ్మ) అచలమైనది, అఖండంగా ఏకమైనది, మనోవేగాన్ని మించిన వడిగలది అన్నింటికంటె ముందుగా జ్ఞానస్వరూపమైనది, అంటే సమస్తమూ ఎరిగినది ఈ పరమాత్మను (ఇంద్రాది) దేవతలుసైతం తెలుసుకోలేక పోయారు, పొందలేకపోయారు (కేనోపనిషత్తులో ఈ వైనం వివరంగా వర్ణించబడింది) ఆ పరమాత్మ అచలంగా స్థితమైవున్నప్పటికీ ఎంత వేగంగా పరిగెత్తే వాళ్లైనా అందరినీ అధిగమించేస్తుంది ఆ పరబ్రహ్మ శక్తివల్లనే వాయువు, తదితర దేవతలంతా వానలు కురిపించడం, జీవుల్లో ప్రాణధారణ చేయడంవంటి పనులు చేసే సామర్థ్యాన్ని పొందుతారు. [*భగవద్గీత, 10:2* లో - *న మే విదుస్సుర గణాః ప్రభవం న మహర్షయః । అహమాదిర్హి దేవానాం మహర్షీణాం చ సర్వశః ॥* - అంటే, మహర్షులకు, దేవతలకుకూడ నేను ఆదిభూతాన్ని అందువల్ల దేవతలూగాని, మహర్షులూగాని నా ఆదిని ఎరుగరు అని అర్థం] **(4)**

**తదేజతి తన్నైజతి తద్దూరే తద్వన్తికే।**
**తదన్తరస్య సర్వస్య తదు సర్వస్యాస్య బాహ్యతః ॥**

అది (పరమాత్మ) నడుస్తుంది, నడవదుకూడ అది దూరాతిదూరంగా వుంటుంది; అత్యంత సమీపంగానూ వుంటుంది అది ఈ సమస్త జగత్తులోపల పరిపూర్ణంగా నిండివుంటుంది. అదేసమయంలో ఈ జగత్తుకు వెలుపలకూడ

అదే వుంటుంది. అంటే ఈ పరబ్రహ్మ అచలంగా వున్నప్పటికీ కదలుతున్నట్లు, చలనంలో వున్నట్లే కన్పట్టుతుంది అజ్ఞానులకు అతిదూరమై అప్రాప్యంగా వున్నా, జ్ఞానులకు ఆత్మలోనే విదితమవడంవల్ల అతిసమీపంగా వుంటుంది, మహాకాశంలో ఘటకాకాశంమాదిరిగా అది లోన, వెలుపల ప్రతి చోటా వుంటుంది (*ఇందుగల డందులేడని సందేహము వలదు !*) అని వేదాంతుల వ్యాఖ్య [పోతనామాత్య విరచిత **మహాభాగవతం** లో ప్రహ్లాదుడు చెప్పే *కల దంభోధి గలండు గాలి గలండు ...* అనే పద్యంకూడ దీనికి యించుమించు సమానార్థకంగానే వుంటుంది ఇక ***భగవద్గీత 7:7*** లో *మత్తః పరతరం నాన్యత్ కించిదస్తి ధనంజయ । మయి సర్వ మిదం ప్రోతం సూత్రే మణిగణా ఇవ ॥*- అంటే, ధనంజయా ! నాకంటె ఉత్కృష్టమైనది మరొకటి లేదు, మణులు దారంలోగుచ్చబడినట్లు ఈ సమస్త భూతజాలమూ నాలో గుచ్చబడివున్నవి అని చెప్పబడింది మణిహారం నిలిచివుండడానికి బయటకు కనపడకుండా లోన దాగివున్న దారం కారణమైనట్లు ఈ సమస్త చరాచర జీవకోటికి ప్రాణాధారమైన అవ్యక్తమైన పరమాత్మ అన్నిటియందు వ్యాపించివుందనేది దీని అంతరార్థం] **(5)**

**యస్తు సర్వాణి భూతాన్యాత్మన్యేవానుపశ్యతి ।**
**సర్వభూతేషు చాత్మానం తతో న విజుగుప్సతే ॥**

అయితే సర్వభూతాలను ఆ పరమాత్మలోనే నిరంతరం చూస్తూ, అలాగే సమస్త భూతాల్లోనూ ఆ పరమాత్మను కనుగొంటూవుండే మనుష్యుడు ఆ తర్వాత ఎప్పుడేగాని ఘృణ, ద్వేషాలకు లోనుగాడు [ఇదే ***భగవద్గీత 6:29-30*** లలో *సర్వభూతస్థమాత్మానం సర్వభూతాని చాత్మని । ఈక్షతే యోగయుక్తాత్మా సర్వత్ర సమదర్శనః ॥; యో మాం పశ్యతి సర్వత్ర సర్వం చ మయి పశ్యతి । తస్యాహం న ప్రణశ్యామి స చ మే న ప్రణశ్యతి ॥* - అనగా యోగసిద్ధిపొందిన మహాత్ముడు సర్వభూతాలందు ఆత్మను, ఆత్మయందు సర్వభూతాలను దర్శించుతూ, నానాత్వంలో ఏకత్వాన్ని, ఏకత్వంలో నానాత్వాన్ని వీక్షించుతూ సర్వత్రా సమదర్శనుడై వుంటాడు. అన్నిటిలోనూ నన్ను, నాలో అన్నిటినీ చూచేవానికి నేనెన్నడైనా లేకుండా పోను; నాకూ అతడు లేకుండా పోడు అని అర్థం వచ్చేట్లు చక్కగా చెప్పబడింది]. **(6)**

**యస్మిన్ సర్వాణి భూతాన్యాత్మైవాభూద్విజానతః।**
**తత్ర కో మోహః కః శోక ఏకత్వమనుపశ్యతః ॥**

పరబ్రహ్మను తెలుసుకొన్న వ్యక్తి అనుభవంలో సర్వభూతాలూ ఏకైక ఆత్మ (పరమాత్మ) స్వరూపాలుగా వ్యక్తమయ్యే స్థితిలో వుంటాడు. అలాంటప్పుడు ఆ విధంగా ఏకమాత్ర పరమాత్మను (ఏకత్వాన్ని) నిరంతరం దర్శించే ఆ జ్ఞానికి మోహంగాని, శోకంగాని ఏమి వుంటుంది ? అంటే రాగద్వేషాలనుండి, శోకమోహాలనుండి అతడు పూర్తిగా విముక్తుడై వుంటాడని అర్థం. [*భగవద్గీత* ***6:31*** లో - *సర్వభూతస్థితం యో మాం భజత్యేకత్వమాస్థితః । సర్వథా వర్తమానోఽపి స యోగీ మయి వర్తతే ॥*- అంటే నాతో తాదాత్మ్యం పొంది సర్వభూతాల్లో వసించే నన్నే ఉపాసించే యోగి లోకమందెట్లు వర్తించినను నాయందే స్థితమై వుంటాడు అని చెప్పబడింది] **(7)**

**స పర్యగాచ్ఛుక్రమకాయమవ్రణమస్నావిరం శుద్ధమపాపవిద్ధమ్।**
**కవిర్మనీషీ పరిభూః స్వయమ్భూర్యాథాతథ్యతోఽర్థాన్ వ్యదధాచ్ఛాశ్వతీభ్యః సమాభ్యః ॥**

అటువంటి జ్ఞానయోగి పరమ తేజోమయమైన, సూక్ష్మశరీరరహితమైన, అక్షతమైన, స్నాయురహితమైన (అంటే స్థూలశరీరరహితమైన), అత్యంత శుద్ధమైన (అప్రాకృత దివ్యసచ్చిదానంద స్వరూపమైన), ధర్మాధర్మరూప పాప రహితమైన పరమాత్మకు ప్రాప్తమై పోతాడు. ఆ పరమాత్మ సర్వద్రష్ట, సర్వజ్ఞుడు, సర్వాంతర్యామి, సర్వనియంత, స్వయంభువు; అనాది కాలంనుండీ సకల ప్రాణులకూ వాటి కర్మానుసారంగా యథాయోగ్యమైన సమస్త పదార్థాలూ సృష్టించి యిస్తూ వస్తున్నాడు. **(8)**

**అన్ధం తమః ప్రవిశన్తి యేఽవిద్యాముపాసతే।**
**తతో భూయ ఇవ తే తమో య ఉ విద్యాయాం రతాః ॥**

అవిద్యను ఉపాసించే మనుష్యుడు అజ్ఞానస్వరూపమైన కారుచీకట్లో ప్రవేశిస్తాడు. అయితే విద్యావ్యాపకంలోనే మునిగితేలే (అంటే విద్యాజ్ఞానంపట్ల దురభిమానం కలిగివుండే) వ్యక్తికూడ అంతకంటె ఘోరాంధకారంలో దూరిపోతాడు అంటే అజ్ఞానం ఎంత ప్రమాదకరమో, అర్ధజ్ఞానం - అంటే ఏవో శాస్త్రాలు, గీస్త్రాలు చదివి యిక తమ కన్నీ తెలుసు, తాము చెప్పిందే వేదమన్నట్లు అహంభావంతో ప్రవర్తించే మూర్ఖత్వం - కూడ అంతే, నిజానికి అంతకంటే ప్రమాదకరమని చీవాట్లు పెట్టడమన్నమాట. అందుకే (భర్తృహరి **సుభాషితాలు** తెలుగులో అనువదించిన) ఏనుగు లక్ష్మణ కవి ***"తెలిసియు దెలియని నరు దెల్ప బ్రహ్మకు వశమే !"*** అని చురకవేశాడు **(9)**

**అన్యదేవాహుర్విద్యయాన్యదాహురవిద్యయా ।**
**ఇతి శుశ్రుమ్ ధీరాణాం యే నస్తద్విచచక్షిరే ॥**

విద్యవల్ల (అంటే జ్ఞానాన్ని సరిగా అనుష్ఠించడంవల్ల) వేరే ఉత్తమ ఫలాలు వుంటాయని, అలాగే అవిద్యవల్ల (అంటే కర్మల్ని సరిగా అనుష్ఠించడంవల్ల) వేరే మెరుగైన ఫలితాలు ఒనగూడుతాయని ధీరులు, బుద్ధిమంతులైన పురుషులు చెబుతుండగా విన్నాము ఈ విషయమై వాళ్లు బాగా వ్యాఖ్యానించి మాకు చక్కగా తెలియజెప్పారు. [*భగవద్గీత* ***18: 49-55*** శ్లోకాల్లో ఈ విధమైన యధార్థ జ్ఞానానుష్ఠాన ఫలం, నిష్కామ కర్మాచరణ ఫలాలగురించి చక్కగా చెప్పబడింద ***49***లో *అసక్త బుద్ధిస్సర్వత్ర జితాత్మా విగతస్పృహః । నైష్కర్మ్యసిద్ధిం పరమాం సన్న్యాసేనాధిగచ్ఛతి ॥* - అంటే విషయాసక్తిని వదిలి, భోగవాసనలు వర్జించి, మనోనిగ్రహంతో ఆశారహితుడై కర్తృత్వ భోక్తృత్వ మిథ్యాభిమానాల్ని సన్న్యసించి కర్తవ్యాల్ని నిర్వహించడంవల్ల నైష్కర్మ్య సిద్ధి కలుగుతుందని చెప్పబడింది. అట్టి నైష్కర్మ్యసిద్ధి కలిగినవాడు జ్ఞానాతీత పరబ్రహ్మస్థితిని ఎలా పొందవచ్చో తర్వాతి శ్లోకాల్లో చెప్పబడింది. ఉదాహరణకు ***53***లో *అహంకారం బలం దర్పం కామం క్రోధం పరిగ్రహమ్ । విముచ్య నిర్మమశ్శాంతో బ్రహ్మభూయాయ కల్పతే ॥* - అంటే, అహంకారమమకారాల్ని, బలదర్పాల్ని, కామక్రోధాల్ని, భోగ్యవస్తు సేకరణను త్యజించి సదా ధ్యానమగ్నుడై, ప్రశాంతి పొందిన మహనీయుడు పరబ్రహ్మస్థితి పొందగలడని చెప్పబడింది

అలాంటి పరబ్రహ్మస్థితి పొందినవాడుసదా ప్రసన్నమనస్కుడై శోకమోహములు వీడి, సర్వభూతాలందు సమదృష్టిని కలిగివుంటాడని, పరబ్రహ్మయందు పరాభక్తిని పొందుతాడని, ఆ పరాభక్తివల్ల పరబ్రహ్మ ఉత్కృష్టతను - అంటే పరమసత్యాన్ని గ్రహించి, బ్రహ్మసాయుజ్యం పొందుతాడని తర్వాతి ***54-55*** శ్లోకాల్లో తేటతెల్లం గావించ బడింది] **(10)**

## విద్యాం చావిద్యాం చ యస్తద్వేదోభయం సహ ।
## అవిద్యయా మృత్యుం తీర్త్వా విద్యయామృతమశ్నుతే ॥

ఎవరైతే విద్యను (జ్ఞానతత్వాన్ని), అవిద్యను (కర్మతత్వాన్ని) రెంటినీకూడ యధార్థంగా తెలుసుకుంటారో వారు అవిద్యద్వారా (అంటే కర్మానుష్ఠానంద్వారా) మృత్యువును అధిగమించి, విద్యద్వారా (జ్ఞానానుష్ఠానంద్వారా) అమృతాన్ని అనుభవిస్తారు, అంటే అవ్యయ, అనశ్వర, ఆనందమయ పరబ్రహ్మను ప్రత్యక్షం గావించుకుని అందులో లీనమైపోతారు కర్మాకర్మల వాస్తవ రహస్యాన్ని మహా మేధావులుసైతం తరచూ సరిగా అర్థం చేసుకోలేక పెద్ద పొరపాట్లు చేస్తుంటారని, జ్ఞానమే గొప్పదని భావించి కర్మల్ని త్యజించడమో లేక జ్ఞానసాధనకు పరిశ్రమించకుండా ఐహిక కర్మకాండల్లో మునిగితేలడమో చేసి ఎన్నో అనర్థాలు కొనితెచ్చుకుంటారని, కనుక కర్మానుష్ఠానం, జ్ఞానానుష్ఠానాలు రెంటినీ తెలుసుకొని సవ్యంగా ఆచరించడం అతి ముఖ్యమని దీని భావం. [*భగవద్గీత* ***4: 16*** లో - *కిం కర్మ కిమ కర్మేతి కవయోஉప్యత్ర మోహితాః । తత్తే కర్మ ప్రవక్ష్యామి యద్ జ్ఞాత్వా మోక్ష్యసే உశుభాత్ ॥* - అంటే, విజ్ఞులుకూడ కర్మ అంటే ఏమిటి, అకర్మ అంటే ఏమిటి అని తెలియక భ్రమచెందుతుంటారు. కనుక నేను నీకిప్పుడు ఆ కర్మాకర్మల తత్వాన్ని ఎరిగిస్తాను; దాన్ని తెలుసుకుని నీవు అశుభమునుండి విముక్తిపొందగలవు అని చెప్పబడింది ఆ తర్వాతి శ్లోకాల్లో ఈ కర్మాకర్మలగురించి, నిష్కామకర్మల ద్వారా నిజమైన జ్ఞానప్రాప్తినిగురించి, తద్వారా బ్రహ్మసాయుజ్యం పొందడంగురించి చెప్పబడింది. అదేవిధంగా నిష్కామకర్మలు చేయాలేగాని శరీరక్లేశానికి భయపడి కర్మసన్యాసం చేసినంతమాత్రాన ఫలం దక్కదని *గీత* ***18:8***లో స్పష్టంగా చెప్పబడింది ***18:9***లో *కార్య మిత్యేవ యత్కర్మ నియతం క్రియతేஉర్జునః । సంగం త్యక్త్వా ఫలం చైవ స*

*త్యాగస్సాత్త్వికో మతః ॥* - అంటే, విషయాసక్తి, ఫలాపేక్షలు లేకుండా విధ్యుక్త కర్మల్ని కర్తవ్యతాబుద్ధితో నిర్వహించడమే సాత్త్విక త్యాగమని స్పష్టం చేయ బడింది. అలాంటి నిష్కామ కర్మజనిత త్యాగమే నిజమైన బ్రహ్మజ్ఞానానికి దారి తీయగలదని తర్వాతి శ్లోకాల్లో చెప్పబడింది]. **(11)**

**అన్ధం తమః ప్రవిశన్తి యేऽసమ్భూతిముపాసతే।**
**తతో భూయ ఇవ తే తమో య ఉ సంభూత్యాం రతాః॥**

ఎవరైతే అసంభూతిని (నశ్వరులైన దేవతలు, పితరులు ఆదిగాగలవారిని) ఉపాసించడంలో నిమగ్నమై వుంటారో వారు అజ్ఞానరూపమైన కారుచీకట్లో ప్రవేశిస్తారు. కాగా తాము సంభూతిని (అనశ్వరమైన పరబ్రహ్మను) భజిస్తూ, దానియందే సదా నిమగ్నమైవున్నామనే మిథ్యాభిమానంగలవారు (ఆ అహంభావంతో అనవసరంగా దేవతాపితరాదులను కించపరిచేవారు) కూడ అంతకంటే గాఢాంధకారంలో పడిపోతారు **(12)**

**అన్యదేవాహుః సమ్భవాదన్యదాహురసమ్భవాత్।**
**ఇతి శుశ్రుమ్ ధీరాణాం యే నస్తద్విచచక్షిరే॥**

సంభూతిని (అంటే అనశ్వర పరబ్రహ్మను) సరిగా ఉపాసించడంవల్ల వేరే ఉత్తమ ఫలాలు వుంటాయని, అలాగే అసంభూతిని (అంటే దేవ, పితరాదుల్ని) సరిగా పూజించడంవల్ల వేరే మెరుగైన ఫలితాలు ఒనగూడుతాయని ధీరులు, బుద్ధిమంతులైన పురుషులు చెబుతుండగా విన్నాము ఈ విషయమై వాళ్లు బాగా వ్యాఖ్యానించి మాకు చక్కగా తెలియజెప్పారు [*భగవద్గీత* ***9: 34*** శ్లోకంలో అనన్యభక్తిశ్రద్ధలతో తన్నుపాసించినవారికి తాను తప్పక సాక్షాత్కరిస్తానని పరమాత్మ వాగ్దానం (గ్యారంటీ) యివ్వడం గమనిస్తాము అంటే సంభూతిని సవ్యంగా ఉపాసించాలి; మనోవాక్కాయకర్మలద్వారా ఆ పరబ్రహ్మలో లగ్నమవాలిగాని మిథ్యాభిమానాలు, డంబాచారాలు పనికిరావని తాత్పర్యం. అలాగే *గీత* ***17:14***లో - *దేవద్విజగురు ప్రాజ్ఞపూజనం శౌచమార్జవమ్ । బ్రహ్మచర్య మహింసా చ శారీరం తప ఉచ్యతే ॥* -

అంటే దేవతలను, బ్రాహ్మణులను, గురువులను, జ్ఞానులను పూజించడం, శుచి-శుభ్రత, నిష్కపట ప్రవర్తన, బ్రహ్మచర్యం, అహింసలు ఆచరించడం కాయిక (శరీరసంబంధ) తపస్సని అంటారు అని చెప్పబడింది మానసిక తపస్సేకాక కాయిక తపస్సుకూడ ముఖ్యమే నన్న భావం ఇందులో యిమిడివుంది]. (13)

**సమ్భూతిం చ వినాశం చ యస్తద్వేదోభయం సహ।**
**వినాశేన మృత్యుం తీర్త్వా సమ్భూత్యామృతమశ్నుతే॥**

ఎవరైతే సంభూతిని (అనశ్వర పరబ్రహ్మను), అసంభూతిని (వినాశశీల దేవ, పితరాదులను) రెంటినీకూడ ఒకే సమయంలో యథార్థంగా తెలుసుకుంటారో వారు అసంభూతిద్వారా (అంటే నశ్వరమైన దేవ పితరాదుల ఉపాసనద్వారా) మృత్యువును అధిగమించి, సంభూతిద్వారా (అవినాశియైన పరబ్రహ్మ ఉపాసన ద్వారా) అమృతాన్ని అనుభవిస్తారు; అంటే అవ్యయ, అనశ్వర, ఆనందమయ పరబ్రహ్మను ప్రత్యక్షం గావించుకుని అందులో లీనమైపోతారు [అసంభూతి అంటే **అవ్యాకృత ప్రకృతి** అనీ, సంభూతి అంటే **కార్యబ్రహ్మ** అనీ కొందరు వేదాంతుల వ్యాఖ్య మరికొందరు అసంభూతి అంటే **సంహారకర్త** అనీ, సంభూతి అంటే సృష్టికర్త అనీ అర్థం చెబుతారు]. (14)

**హిరణ్మయేన పాత్రేణ సత్యస్యాపిహితం ముఖమ్।**
**తత్త్వం పూషన్నపావృణు సత్యధర్మాయ దృష్టయే॥**

అఖిల బ్రహ్మాండ పోషకుడైన ఓ పరమాత్మా! సత్యస్వరూపుడైన మీదివ్యముఖం ఆ హిరణ్మయ (జ్యోతిర్మయ సూర్యమండలరూప) పాత్రచే కప్పబడి వున్నది మిమ్ము భక్తితో పూజిస్తూ, తద్విధంగా సత్యధర్మాన్ని అనుష్ఠించే నాకు కనబడకుండా వున్నది. కనుక ఆ ఆవరణ(పరదా)ను తొలగించి నాకు మీ ముఖం దర్శనీయం గావించవల్సిందిగా ప్రార్థిస్తున్నాను. [మరో వ్యాఖ్య ఏమంటే భక్తుడు యిలా ప్రార్థన చేస్తున్నాడు : భగవాన్! సత్యస్వరూపివైన మీ ముఖం బంగారు మూతతో(బంగారంలా మనస్సును ప్రలోభపెట్టే విషయవాంఛారూప మాయ

పరదాతో) కప్పబడివుంది (అంటే, మేము విషయవాంఛల్లో చిక్కుకునివున్నాము అని). సత్యపరాయణ సాధకుడ్ని నాకోసం దయచేసి ఆ మూతను తొలగించండి, నన్ను మీ దివ్యమంగళ ముఖబింబం చూడనివ్వండి]. (15)

**పూషన్నేకర్షే యమ సూర్య ప్రాజాపత్య వ్యూహ రశ్మీన్ సమూహ।**
**తేజో యత్తే రూపం కల్యాణతమం తత్తే పశ్యామి యోఽసావసౌ పురుషః సోఽహమస్మి ॥**

భగవన్ ! మీరు భక్తజన పోషకులు. సమ్యక్ జ్ఞానస్వరూపులు సర్వులను యధాయోగ్యంగా నియంత్రించే మహానుభావులు. మీరే జ్ఞానులందరికీ అంతిమ లక్ష్యమైన వారు. మీరు ప్రజాపతికి ప్రియమైనవారు ఈ సూర్యమండలపు దివ్య ప్రకాశమాన కిరణాలన్నిటినీ పోగుచేసుకుని మీలో కలిపివేసుకొనండి తద్వారా మీ దివ్యస్వరూపాన్ని నాకు దర్శనం గావించండి ఆ సూర్యునికి, సమస్త విశ్వానికి ఆత్మవైన పరమ పురుషుడివి; నీ దివ్యమంగళస్వరూపాన్ని నేనిప్పుడు ధ్యానశక్తిచే (మనోచక్షువులద్వారా) దర్శిస్తున్నాను నేనుకూడ ఆ పరమ పురుషుడ్నే [తర్వాతికాలంలో ప్రసిద్ధమైన అహం బ్రహ్మోస్మి సూక్తికి యిది మూలంలా కనిపిస్తున్నది]. (16)

**వాయురనిలమమృతమథేదం భస్మాన్తం శరీరమ్।**
**ఓం క్రతో స్మరం కృతం స్మర క్రతో స్మర కృతం స్మర ॥**

ఇప్పుడు ఈ (నా) ప్రాణాలు, ఇంద్రియాలు అవినాశశీలమైన వాయుతత్వంలో విలీనమైపోనీ ఈ (స్థూల) శరీరం అగ్నిలో కాలి బూడిదైపోనీ. ఓ ప్రణవరూప (సచ్చిదానంద) యజ్ఞమయ భగవాన్ ! మీరు మీ భక్తుడైన నన్ను గుర్తుంచుకోగోరుతాను నాద్వారా జరిగిన కర్మల్ని స్మరించుకోగోరుతాను. ఓ భగవన్ ! మీరు నన్ను, నా కర్మల్ని స్మరించుకోగోరుతాను (17)

**అగ్నే నయ సుపథా రాయే అస్మాన్ విశ్వాని దేవ వయునాని విద్వాన్।**
**యుయోధ్యస్మజ్జుహురాణమేనో భూయిష్ఠాం తే నమఉక్తిం విధేమ ॥**

ఓ అగ్నిదేవా ! మమ్మల్ని పరమధనరూపుడైన ఆ పరమాత్మవద్దకు చేర్చడానికి సుందర శుభ (ఉత్తరాయణ) మార్గంగుండా తీసుకువెళ్లగోరుతాము. ఓ దేవా ! మీకు మా సమస్త కర్మలగురించీ తెలుసు కనుక మా యీ మార్గంలో ప్రతిబంధకాలేవైనా వుంటే (మా పాపాలేవైనా వుంటే) వాటన్నిటినీ దూరంచేయ ప్రార్థిస్తున్నాము మీకు పదే పదే నమస్కరిస్తున్నాము. మీకు పదే పదే మా నమస్కారాలు. [*భగవద్గీత 8:5లో - అంత్యకాలే చ మామేవ స్మరన్ ముక్త్వా కళేబరమ్ । యః ప్రయాతి స మద్భావం యాతి నాస్త్యత్ర సంశయః ॥* - అంటే అవసానకాలమందు ఎవడు నన్ను స్మరించుచూ శరీరం విడిచివేస్తాడో వాడు తప్పక నా స్థితిని పొందుతాడు, యిది నిస్సందేహ మని చెప్పబడింది ఈ శ్లోకభావం యిక్కడా, దీనికిముందరి 17వ మంత్రానికీ వర్తిస్తుందని వేదాంతుల వ్యాఖ్య. అందుకే 17వ మంత్రంలో ప్రాణాలు విసర్జించడం, శరీరం త్యాగం చేయడం, పరమాత్మను స్మరించుకుంటూ తన్ను గుర్తుంచుకోవల్సిందిగా భక్తుడు ఆయన్ను పదే పదే కోరడం, అలాగే యిక్కడకూడ పరమాత్మవద్దకు తీసుకుపోవడానికి సాధనంగా తాను భావించే అగ్నికి పదే పదే నమస్కారాలు చేయడం గమనిస్తాము ] **(18)**

# యజుర్వేదీయ ఈశావాస్యోపనిషత్తు సమాప్తం.

★★★

## శాంతి పాఠం

**ఓం పూర్ణమదః పూర్ణమిదం పూర్ణాత్ పూర్ణముదచ్యతే ।**

**పూర్ణస్య పూర్ణమాదాయ పూర్ణమేవావశిష్యతే ॥**

**ఓం శాంతిః శాంతిః శాంతిః**

దీని అర్థం ఈ ఉపనిషత్తు ప్రారంభంలోనే చెప్పబడింది.

* * * * *

# కేనోపనిషత్తు

ఈ ఉపనిషత్తు సామవేదంలోని తలవకార బ్రాహ్మణం లో భాగం. దీన్నే జైమినీయ ఉపనిషత్తు అనికూడ అంటారు ఇది కేన (= దేని లేక ఎవరి ద్వారా?) అనే పదంతో మొదలవుతుందిగనుక దీనికి **కేనోపనిషద్** అని పేరు వచ్చింది ఇంకా దీన్ని **తలవకార ఉపనిషద్, బ్రాహ్మణోపనిషద్** అని కూడ పేర్కొనడం కద్దు. ఇది తలవకార బ్రాహ్మణంలో 9వ అధ్యాయం అంతకుముందలి 8 అధ్యాయాల్లోనూ అంతఃకరణ శుద్ధి సాధించడానికి వలసిన అనేక కర్మకాండలు, ఉపాసనలనుగురించిన చర్చ వుంటుంది. దీనిలో ప్రతిపాదించిన తత్వవిషయం అతి గహనమైనది కావడంచేత యిందులో గురు శిష్య సంవాదరూపంలో - శిష్యుని ప్రశ్నలకు గురువు సమాధానాల రూపంలో - తత్వవివేచన చేయబడింది

## శాంతి పాఠం

**ఓం ఆప్యాయన్తు మమాఙ్గాని వాక్ ప్రాణశ్చక్షుః శ్రోత్రమథో బల మింద్రియాణి చ సర్వాణి । సర్వ బ్రహ్మోపనిషదం మాహం బ్రహ్మ నిరాకుర్యామ్ మా మా బ్రహ్మ నిరాకరోత్, అనిరాకరణ మస్త్వనిరాకరణం మేఽస్తు । తదాత్మని నిరతే య ఉపనిషత్సు ధర్మాస్తే మయి సన్తు, తే మయి సన్తు ॥ ఓం శాన్తిః శాన్తిః శాన్తిః**

ఓ పరమాత్మా ! నా సకల అంగాలు - వాక్, చక్షు(కన్ను), శ్రోత్రమ్ (చెవి), యింకా ప్రాణం, మొదలైన సర్వేంద్రియాలు, శక్తులు, అంటే నా శారీరక, మానసిక శక్తులన్నీ, పరిపుష్టం చేయుము. సమస్తమూ ఉపనిషత్తులలో ప్రతిపాదించబడిన బ్రహ్మరూపమే. నేను ఈ బ్రహ్మను నిరాకరించకుండుదును గాక. బ్రహ్మకూడ నన్ను పరిత్యజించకుండును గాక అనిరాకరణమే వుండుగాక

(అంటే బ్రహ్మకు, నాకు నిత్యసంబంధం వుండుగాక). ఉపనిషత్తులలో ప్రతిపాదించబడిన సకల ధర్మాలూ ఆ పరబ్రహ్మలోనే ఉపలక్షితమై, నిరంతరం అందులోనే లీనమైవుంటూ, అవే నాలోపలకూడ ప్రకాశమై, నిత్యనిరంతరంగా వుండుగాక. ఓం శాంతిః శాంతిః శాంతిః (అంటే నా త్రివిధ తపస్సులకు నివృత్తి చేకూరు గాత).

**ఓం కేనేషితం పతతి ప్రేషితం మనః కేన ప్రాణః ప్రథమః ప్రైతి యుక్తః ।**
**కేనేషితాం వాచమిమాం వదన్తి చక్షుః శ్రోత్రం క ఉ దేవో యునక్తి ॥**

ఈ మంత్రంలో శిష్యుడు గురువును నాలుగు ప్రశ్నలు అడుగుతున్నాడు దేని (లేక ఎవరి) ద్వారా శక్తిని, స్ఫూర్తిని పొంది, ప్రేరణ పొంది, ఈ మనస్సు తన లక్ష్యవిషయాలను పట్టించుకుంటుంది? దేనిద్వారా చేతనపొంది అన్నింటిలోకీ శ్రేష్ఠమైన ఈ ప్రాణం సంచలిస్తున్నది ? దేనిద్వారా క్రియాశీలమై ఈ వాక్కు ప్రసరిస్తున్నది, అంటే జనులు మాటలాడుతున్నారు? ఏ ప్రఖ్యాత దైవం ఆదేశంవల్ల ఈ కన్నులు, ఈ చెవి తమ పనులు చేసుకుపోతున్నాయి ? **(1)**

**శ్రోత్రస్య శ్రోత్రం మనసో మనో యద్వాచో హ వాచమ్‌సఉ ప్రాణస్య ప్రాణః।**
**చక్షుషశ్చక్షురతిముచ్య ధీరాః ప్రేత్యాస్మాల్లోకాదమృతా భవన్తి ॥**

ఈ ప్రశ్నలకు గురువు యిలా జవాబిస్తున్నాడు. ఏదైతే మనస్సుకు మనసో, వాక్కుకు వాక్కో, ప్రాణానికి ప్రాణమో, కన్నుకు కన్నో, చెవికి చెవో అదే. అంటే శిష్యుని ప్రశ్నకు సూటిగా జవాబివ్వకుండా, సంకేతపరంగా ఈ మనస్సుకు, ప్రాణానికి, పంచేంద్రియాలకు కారణభూతమైనదేదో అదే నంటూ బ్రహ్మ పదార్థంగురించి అంతరార్థంగా ప్రస్తావిస్తున్నాడు ఆ పరబ్రహ్మను పొందిన, అంటే దాన్నిగురించి జ్ఞానం పొందిన జ్ఞానులు ఈ లోకాలనుండి నిష్క్రమించిన తర్వాత అమరులౌతారు అంటే జీవన్ముక్తి పొందుతారు అనికూడ గురువు చెబుతున్నాడు. **(2)**

**న తత్ర చక్షుర్గచ్ఛతి న వాగ్గచ్ఛతి నో మనో న విద్మో న విజానీమో యథైతదనుశిష్యాదన్యదేవ తద్విదితాదథో అవిదితాదధి । ఇతి శుశ్రుమ పూర్వేషాం యే నస్తద్వ్యాచచక్షిరే ॥**

అక్కడికి (అంటే ఆ బ్రహ్మ వద్దకు) కన్నులు పోలేవు. వాక్కు పోలేదు. లేక మనస్సైనా చేరలేదు. అంటే మనం దాన్ని కన్నులతో చూడలేము. వాక్కులతో వివరించలేము. మనస్సుతో అవగాహన చేసుకోలేము అది ఇలాంటిది, అలాంటి దని స్వయంగా మన బుద్ధితో తెలుసుకోలేము. లేదా ఇతరుల వద్దనుండి విని అయినా తెలుసుకోలేము అది మనకు తెలిసిన సమస్త పదార్థాలకూ భిన్నమైనది; అంతేకాదు, మనకు తెలియని వాటికన్నింటికీకూడ అతీతమైనది. మరి ఇదిలాగని మేము పూర్వ ఆచార్యుల నుండి విన్నాము వారు మాకు ఆ బ్రహ్మ తత్వాన్ని ఈ విధంగా చక్కగా వ్యాఖ్యానించి, బోధపర్చివున్నారు **(3)**

**యద్వాచానభ్యుదితం యేన వాగభ్యుద్యతే ।**
**తదేవ బ్రహ్మ త్వం విద్ధి నేదం యదిదముపాసతే ॥**

అదే బ్రహ్మను గురువు యిప్పుడు పైన (1) లో అడిగిన ప్రశ్నలను అనుసరించి ఐదు మంత్రాల్లో వివరిస్తున్నాడు. ఈ మొదటి మంత్రంలో వాక్కు దేనిద్వారా ప్రసరిస్తున్నదనే ప్రశ్నకు జవాబిస్తున్నాడు. ఏదైతే వాక్కుద్వారా తెలపబడలేదో, అయితే దేనివల్ల వాణి ఉద్భవించి, ప్రసరిస్తుందో అదే బ్రహ్మ అని తెలుసుకో, అంతేగాని వాణిద్వారా వివరించబడి, పూజించబడేది బ్రహ్మకాదని గుర్తించుకో అని యిక్కడ గురువు శిష్యునికి బోధిస్తున్నాడు. అంటే దేనిద్వారా వాక్కు ప్రసరిస్తున్నదంటే, అది వాక్కులద్వారా వివరింపబడలేని బ్రహ్మపదార్థంద్వారా అని సమాధానమిస్తున్నాడన్నమాట. **(4)**

**యన్మనసా న మనుతే యేనాహుర్మనో మతమ్ ।**
**తదేవ బ్రహ్మ త్వం విద్ధి నేదం యదిదముపాసతే ॥**

దేనిని మనస్సుచేత తెలుసుకోలేమో, అయితే ఏది మనస్సునే తెలుసుకోగలదో అదిమాత్రమే బ్రహ్మ. అంతేకాని, అంతఃకరణంద్వారా తెలుసుకొనబడగలదని భావించి, మనం పూజించే తత్వమైతే బ్రహ్మ కాదు. **(5)**

**యచ్చక్షుషా న పశ్యతి యేన చక్షూంషి పశ్యతి ।**
**తదేవ బ్రహ్మ త్వం విద్ధి నేదం యదిదముపాసతే ॥**

దేనిని కళ్లతో చూడలేమో, కాని ఏదైతే కళ్లకే చూపు ప్రసాదిస్తుందో అదే బ్రహ్మ అంతేగాని, కళ్లతో చూడగలమని తలచి, పూజించే తత్వం బ్రహ్మ కాదు **(6)**

**యచ్ఛ్రోత్రేణ న శృణోతి యేన శ్రోత్రమిదం శ్రుతమ్ ।**
**తదేవ బ్రహ్మ త్వం విద్ధి నేదం యదిదముపాసతే ॥**

దేనిని చెవిద్వారా వినలేమో, అయితే ఏదైతే చెవులకే వినికిడి ప్రసాదిస్తుందో అది మాత్రమే బ్రహ్మ అంతేగాని చెవులతో వినగలమని భావించి, మనం ఉపాసించే తత్వమైతే బ్రహ్మ కాదు. **(7)**

**యత్ప్రాణేన న ప్రాణితి యేన ప్రాణః ప్రణీయతే ।**
**తదేవ బ్రహ్మ త్వం విద్ధి నేదం యదిదముపాసతే ॥**

దేనిని ప్రాణంద్వారా చైతన్యశీలం చేయలేమో, అయితే ఏదైతే ప్రాణాన్నే చైతన్యయుతం చేస్తుందో అదే బ్రహ్మ గాని, ప్రాణంద్వారా ప్రణీతం చేయగలమని భావించి, మనం పూజించే తత్వమైతే బ్రహ్మ కాదు. **(8)**

**ప్రథమ ఖండం సమాప్తం.**

* * *

# ద్వితీయ ఖండం

**యది మన్యసే సువేదేతి దభ్రమేవాపి నూనం త్వం వేత్థ బ్రహ్మణో రూపమ్ ।**
**యదస్య త్వం యదస్య దేవేష్వథ ను మీమాంస్యమేవ తే మన్యే విదితమ్ ॥**

లేదు, నాకు బ్రహ్మగురించి చక్కగా తెలుసు అంటావా, అది సరికాదు. నీకు తెలిసింది తక్కువే. ఆ బ్రహ్మ అంశం ఏ కొద్దిమాత్రం నీలో వున్నదో, లేదా ఏ కొంత దేవతలలో వుందో అంతమట్టుకే నీకు తెలిసివుంటుందంతే. కనుక నాకు అంతా తెలుసంటున్నావు చూడు, అది ఎంతవరకు సరియైనదో నిస్సందేహంగా పరిశీలన చేయవల్సిందే నని నా అభిప్రాయం. (1)

**నాహం మన్యే సువేదేతి నో న వేదేతి వేద చ ।**
**యో నస్తద్వేద తద్వేద నో న వేదేతి వేద చ ॥**

గురువు చేసిన పై ఉపదేశంపై గంభీరంగా ఆలోచన చేసిన పిమ్మట శిష్యుడు యిలా అంటున్నాడు నేను దానిని (బ్రహ్మను) చక్కగా ఎరుగుదును అనైతే చెప్పలేను. అయితే దాన్నిగురించి నా కేమీ తెలవదు అనికూడ చెప్పలేను. నాకు తెలుసు, లేదా నాకు తెలియదు అనేవి రెండూ లేనివే (సరికావు) ఎందుకంటే నాకు తెలుసు అనేటప్పుడు ఎవ్వరైనా జ్ఞాత, జ్ఞేయాన్ని తెలుసుకునే అర్థంలోకాక ఒక అలౌకిక, విలక్షణ అర్థంలో నాకు తెలుసు అంటున్నానుగనుక ఇక్కడి మా శిష్యవర్గంలో బ్రహ్మగురించి తెలిసినవాడే నేను చెప్పేదాన్ని సరిగ్గా అవగతం చేసుకోగలడు. (2)

**యస్యామతం తస్య మతం మతం యస్య న వేద సః ।**
**అవిజ్ఞాతం విజానతాం విజ్ఞాతమవిజానతామ్ ॥**

ఈ గురు శిష్య సంవాదంవిని స్వయంగా శ్రుతి (వేదం) జోక్యం చేసుకుని యిలా నిష్కర్షగా చెప్పిందట : ఎవ్వరైతే బ్రహ్మను తెలుసుకోలేము అనుకుంటారో వారే నిజానికి బ్రహ్మను తెలిసివున్నవారు. ఎవ్వరైతే బ్రహ్మ మాకు తెలుసనుకుంటారో నిజానికి వారికి అది తెలవదు. ఎందుకంటే తెలుసు అనే అహంభావంగలవారికి (విజానతామ్) అది అవిజ్ఞాతం (ఎరుక కానిది). కాని ఆ అహంభావం లేనివారికి (అవిజానతామ్) ఆ బ్రహ్మతత్త్వం విజ్ఞాతం (అంటే అపరోక్షంగా తెలిసినది) (3)

**ప్రతిబోధవిదితమ్ మతమమృతత్వం హి విన్దతే।**
**ఆత్మనా విన్దతే వీర్యం విద్యయా విన్దతేఽమృతమ్ ॥**

శ్రుతి యింకా యిలా చెబుతున్నది . పైన చెప్పిన సంకేతపరంగా ఉత్పన్నమైన జ్ఞానమే నిజమైన జ్ఞానం, ఎందుకంటే దానిద్వారామాత్రమే అమృత స్వరూపమైన పరమాత్మ జ్ఞానాన్ని మనిషి పొందగలడు. పరమాత్మను తెలుసుకునే శక్తి ఆత్మనుండి లభిస్తుంది. ఈ ఆత్మజ్ఞానంనుండి అమృతస్వరూప బ్రహ్మను తెలుసుకోగలం అంటే మనలో అంతర్యామిగా వున్న పరమాత్మనుండే జ్ఞానాన్నికలగజేసే శక్తియుక్తులు ప్రసాదించే అమృతస్వరూప బ్రహ్మ ప్రాప్తమవుతుంది. "విద్య ద్వారా అమృతరూప బ్రహ్మ లభిస్తుంది " అంటే అది బ్రహ్మ యథార్థ స్వరూపం తెలుసుకోవాలనే అభిరుచి, ఉత్సాహం మనుష్యుల్లో వృద్ధి కావడానికని అన్నమాట. **(4)**

**ఇహా చేదవేదీదథ సత్యమస్తి న చేదిహావేదీన్మహతీ వినష్టిః।**
**భూతేషు భూతేషు విచిత్య ధీరాః ప్రేత్యాస్మాల్లోకాదమృతా భవన్తి ॥**

ఒకవేళ ఈ మనుష్యశరీరంతోనే ఆ బ్రహ్మను తెలుసుకోగలిగితే అదే అత్యుత్తమం మరి ఈ మనుష్య శరీరం వుండగానే దాన్ని తెలుసుకోలేకపోతే అది మహావినాశమే అందుకే బుద్ధిమంతులు ప్రతి ప్రాణిలోనూ ఆ పరబ్రహ్మ అస్తిత్వాన్ని యోచించుకుని ఈ లోకంనుండి ప్రయాణంచేసి వెళ్ళిపోయి అమరులవుతారు, అంటే ఆ పరబ్రహ్మ సన్నిధికి చేరుకుంటారు. అంటే ఈ మానవ జన్మ దుర్లభం, దీనిలో మాత్రమే పరబ్రహ్మగురించి చింతనచేసి అవగతం చేసుకోగల శక్తి, అవకాశం వుంటాయిగాని మరే యితర జన్మల్లోను వుండవు. ఒక్క మానవ జాతిలో మినహా మిగతా ఏ జీవజాతిలో జన్మించినా అది కేవలం (పూర్వజన్మ) కర్మఫలాల్ని అనుభవించడానికి తప్పితే దానివల్ల బ్రహ్మజ్ఞానం లభించడం కల్ల కనుక మనుష్యశరీరం వుండగానే బ్రహ్మజ్ఞానం బడయడానికి సర్వప్రయత్నాలు చేయాలనేది దీని అంతరార్థం **(5)**

## రెండవ ఖండం సమాప్తం.

* * *

# తృతీయ ఖండం

బ్రహ్మతత్వాన్ని అర్థంచేసుకోవడానికిగాను మొదటి ఖండంలో ఆ బ్రహ్మశక్తిని సాంకేతిక భాషలో విభిన్న ప్రకారాలుగా అభివర్ణించడం జరిగింది అయితే అలా అభివర్ణించబడిన బ్రహ్మస్వరూపంకూడ నిజానికి బ్రహ్మతత్వపు పూర్ణస్వరూపమైతేకాదని, జీవాత్మ, మనస్సు, ప్రాణం, ఇంద్రియాలు అన్నీకూడ బ్రహ్మతత్వంతో ఉత్ప్రేరితమౌతాయి, అనుప్రాణితమౌతాయి, దానినుండి శక్తియుక్తులు పొందుతాయని, అవన్నీకూడ బ్రహ్మతత్వంలో వివిధ అంశాలుమాత్రమేనని రెండవ ఖండంలో స్పష్టం చేయబడింది ఇక ఈ మూడవ ఖండంలో అనేక ఉదాహరణలద్వారా ఈ విశ్వంలో ఏ పదార్థం లేక ఏ ప్రాణి అయినా శక్తివంతం, సుందరం, ప్రియతమం అయివుంటే అదంతా ఆ పరబ్రహ్మలో ఒక అంశమైవున్న మహిమవల్లనే కాని, వాటంతటవిగా ఈ ఔన్నత్యం చేరుకున్నాయని అభిమానం చెందడం పెద్ద పొరపాటుకాగలదని వివరించబడుతున్నది.

**బ్రహ్మ హ దేవేభ్యో విజిగ్యే తస్య హ బ్రహ్మణో విజయే దేవా అమహీయన్త త ఐక్షన్తాస్మాకమేవాయం విజయోऽస్మాకమేవాయం మహిమేతి ।**

దేవతలు విజయం సాధించడానికి అవసరమైన శక్తియుక్తులు ప్రదానంచేసింది ఈ పరబ్రహ్మనే. కనుక అసురులపై దేవతలు సాధించిన విజయం నిజానికి బ్రహ్మ తత్వపు గెలుపే కాని ఇంద్రాది దేవతలు అదంతా తమ స్వీయ శక్తిసామర్థ్యాలవల్ల తాముగా సాధించిన గెలుపంటూ, అదంతా తమ సొంత మహిమేననుకుంటూ విజయగర్వం ప్రదర్శించుతూండినారు. (1)

**తద్ధైషాం విజజ్ఞౌ తేభ్యో హ ప్రాదుర్బభూవ తన్న వ్యజానత కిమిదం యక్షమితి ।**

దేవతల మిథ్యాభిమానపూరిత ప్రేలాపనల్ని ఆ పరబ్రహ్మ గ్రహించి, వారి మిథ్యాదర్పాన్ని పారద్రోలడానికిగాను వారిపై దయయుంచి వారి ఎదుట దివ్య యక్షునిగా సాకారరూపంలో సాక్షాత్కరించడం జరిగింది ఆ దివ్య మంగళ స్వరూపాన్నిగాంచి దేవతలు నిర్విణ్ణులైనారు; అది ఏమిటో ఎరుగక ఆశ్చర్యంతో దాన్నిగురించి యోచించసాగారు (2)

**తే గ్నిమబ్రువఞ్జాతవేద ఏతద్విజానీహి కిమిదం యక్షమితి తథేతి ।**

ఆ ఇంద్రాది దేవతలంతా ఆ దివ్యయక్షస్వరూపం ఏమిటో తెలుసుకోగోరి, అగ్ని దేవునితో, "ఓ జాతవేదా ! ఈ దివ్య యక్షుడెవరో మీరు తెలుసుకుని రావల్సింది " అని కోరారు. అగ్ని దేవుడు పరమ తేజస్వి, వేదార్థజ్ఞాత, సర్వ జాతపదార్థాల వివరాలు తెలిసినవాడు, "జాతవేదుడు" గా, సర్వజ్ఞుడుగా ప్రఖ్యాతిగాంచినవాడు కనుక దేవతలంతా ఆయన్ను యిలా కోరారు; అగ్ని దేవుడుకూడ తన బుద్ధిబలంపై ఎంతో గర్వమున్న కారణంగా "మంచిది, యిప్పుడే తెలుసుకుని వస్తాను " అంటూ బయలుదేరాడు. (3)

**తదభ్యద్రవత్ తమభ్యవదత్ కోऽసీత్యగ్నిర్వా అహమస్మీత్యబ్రవీజ్జాతవేదా వా అహమస్మీతి ।**

అని అగ్ని ఆ యక్షుని సమీపానికి పరుగెత్తుకుంటూ వెళ్లాడు. అలా తనవద్దకు వచ్చిన అగ్నినిచూచి యక్షుడు "నీ వెవరు?" అని ప్రశ్నించాడు. "నేనే అగ్నిని, జాతవేదునిగా ప్రసిద్ధి చెందినవాడ్ని," అని అగ్ని (ఖంగు తింటూ) జవాబు చెప్పాడు (4)

**తస్మింస్త్వయి కిం వీర్యమితి । అపీదం సర్వం దహేయమ్, యదిదం పృథివ్యామితి ॥**

అప్పుడు యక్షరూపంలోని బ్రహ్మ అగ్నిని, "అలాగా, మరి ఈ పేరుగల నీకున్న శక్తిసామర్థ్యాలేమిటో చెప్పు," అని అడుగుతాడు. దానికి అగ్ని గర్వంగా, "నేను తలచుకుంటే ఈ భూమిపైవున్న సర్వస్వాన్నీ కాల్చి బూడిద చేసేయగలను" అని జవాబు చెబుతాడు. **(5)**

**తస్మై తృణం నిదధావేతద్దహేతి । తదుపప్రేయాయ సర్వజవేన తన్న శశాక దగ్ధుం స తత ఏవ నివవృతే, నైతదశకం విజ్ఞాతుం యదేతద్యక్షమితి ॥**

అగ్ని గర్వోక్తులు విన్న యక్షరూప బ్రహ్మ అతనిముందు ఒక గడ్డిపోచను పడేసి, నీవు సర్వస్వమూ దహించగలనంటున్నావుగదా మరి ఈ గడ్డిపోచను కాల్చి చూపమని అడిగాడు. ఇదెంత పనిలే అనుకుని దాన్ని కాల్చబోయిన అగ్నికి శృంగభంగమైంది; తన యావచ్ఛక్తులూ వినియోగించినా ఆ చిన్న గడ్డిపోచను ఏ మాత్రం కాల్చలేకపోయాడు అవమానంతో తలదించుకుని, తిరిగి వెళ్లి, ఆ యక్షస్వరూపమేమిటో తెలుసుకోవడం తనవల్ల కాలేదని దేవతలకు విన్నవించుకున్నాడు **(6)**

**అథ వాయుమబ్రువన్ వాయువేతద్ విజానీహి కిమేతద్ యక్షమితి తథేతి ।**

అప్పుడు దేవతలంతా వాయువును సమీపించి, "ఓ వాయుదేవా ! ఈ విషయం మీరు తెలుసుకుని రావల్సింది " అని కోరారు. గాలిదేవునికికూడ తన శక్తిసామర్థ్యాలపట్ల అమిత గర్వం. కనుక వెంటనే "అదెంత పని, ఇప్పుడే వెళ్లి తెలుసుకు వస్తా " నంటూ బయలుదేరాడు. **(7)**

**తదభ్యద్రవత్ తమభ్యవదత్ కోஉసీతి। వాయుర్వా అహమస్మీత్యబ్రవీన్మాతరిశ్వా వా అహమస్మీతి ॥**

అని వాయువు ఆ యక్షునివద్దకు పరుగెత్తుకు వెళ్లాడు. యక్షరూప బ్రహ్మ అతడ్నికూడ "నీవెవరవు?" అని ప్రశ్నించాడు. " నేనే వాయువును మాతరిశ్వుడనే పేరుతో ప్రఖ్యాతిగాంచినవాడ్ని ," అని గాలిదేవుడు జంబంగా బదులు పలికాడు **(8)**

**తస్మింస్త్వయి కిం వీర్యమితి ? అపీదం సర్వమాదదీయమ్, యదిదం పృథివ్యామితి ॥**

"అలాగా, అయితే మాతరిశ్వుడనే పేరుగల తమరి శక్తిసామర్థ్యాలేమిటి?" అని యక్షరూప బ్రహ్మ ప్రశ్నించాడు "నేను తలచుకుంటే ఈ భూమి మీద సర్వస్వాన్నీ ఆకాశానికి ఎగురగొట్టేయగలను," అని బీరాలు పలికాడు వాయుదేవుడు **(9)**

**తస్మై తృణం నిదధావేతదాదత్స్వేతి। తదుపప్రేయాయ సర్వజవేన తన్న శశాకాదాతుం స తత ఏవ నివవృతే, నైతదశకం విజ్ఞాతుం యదేతద్ యక్షమితి ॥**

అప్పుడా దివ్యయక్షుడు గాలిదేవుని ఎదుట ఒక ఎండు గడ్డిపోచను వుంచి,"ఏదీ, దీన్ని ఆకాశానికి ఎగురగొట్టు చూద్దాం," అని అడిగాడు. ఆపై వాయువు తన సర్వ శక్తులూ వినియోగించినా ఆ గడ్డిపోచను ఎగరగొట్టలేకపోయాడు. సిగ్గుతో తలదించుకుని అక్కడినుండి తిరిగివచ్చి ఆ యక్షస్వరూపాన్ని తెలుసుకోవడం తనవల్ల కాలేదని దేవతలకు విన్నవించుకున్నాడు **(10)**

**అథేన్ద్రమబ్రువన్ మఘవన్నేతద్ విజానీహి కిమేతద్ యక్షమితి । తథేతి । తదభ్యద్రవత్। తస్మాత్ తిరోదధే ॥**

తదనంతరం దేవతలంతా కలిసి దేవరాజు ఇంద్రుడిని సమీపించి, "ఓ ఇంద్రదేవా ! ఈ విషయం మీరే బాగా తెలుసుకుని రండి !" అని కోరారు అందరికంటే ఇంద్రునికే స్వాతిశయం మిన్న. కనుక అతడుకూడ అదెంత పనిలే అంటూ యక్షునివద్దకు పరుగెత్తుకు వెళ్లాడు. అయితే యక్షరూప బ్రహ్మ ఇంద్రునికి మాట్లాడే అవకాశం యివ్వకుండా అంతర్ధానమైపోయాడు. **(11)**

**స తస్మిన్నేవాకాశే స్త్రియమాజగామ బహుశోభమానాముమాం హైమవతీం తాం హోవాచ కిమేతద్ యక్షమితి ।**

యక్షుడు అదృశ్యమైపోయినా ఇంద్రుడు అక్కడినుండి తిరుగుముఖం పట్టక అక్కడే నిలుచుని నిరీక్షించసాగాడు అంతలో యక్షుడు అంతర్ధానమైన స్థానంలోనే అత్యంత శోభామయ రూపిణి అయిన హిమాచలకుమారి ఉమా దేవి ప్రత్యక్షమైంది. పరబ్రహ్మనే ఇంద్రునిపై కరుణించి, పార్వతి రూపంలో దర్శనమిచ్చినట్లు అర్థం చేసుకోవాలి. ఇంద్రుడు ఆ గిరిజాదేవి వద్దకు వెళ్లి "దేవీ! ఈ దివ్య యక్షుడు ఎవరు?" అని సాదరంగా ప్రశ్నిస్తాడు. **(12)**

**మూడవ ఖండం సమాప్తం.**

* * *

# చతుర్థ ఖండం

**సా బ్రహ్మేతి హోవాచ। బ్రహ్మణో వా ఏతద్విజయే మహీయధ్వమితి, తతో హైవ విదాఞ్చకార బ్రహ్మేతి ॥**

అప్పుడా ఉమాదేవి, "ఆ యక్షుడే పరబ్రహ్మ ; ఆ బ్రహ్మవల్ల కలిగిన విజయాన్నే మీరు మీ సొంత మహిమగా భావించుకుంటున్నారు," అని స్పష్టంగా జవాబు నిచ్చింది ఆమె అలా చెప్పడంమూలంగా దివ్యయక్షుని రూపంలో తమ ఎదుట సాక్షాత్కరించింది ఆ పరబ్రహ్మనని ఇంద్రునికి బోధపడింది. (1)

**తస్మాద్వా ఏతే దేవా అతితరామివాన్యాన్ దేవాన్ యదగ్నిర్వాయురిన్ద్రస్తే హ్యేనన్నేదిష్ఠం పస్పృశుస్తే హ్యేనత్ ప్రథమో విదాఞ్చకార బ్రహ్మేతి ॥**

ఈ విధంగా, అత్యంత ప్రియము, సమీపస్థము అయిన బ్రహ్మను (చూపుల ద్వారా) స్పృశించారు, ఆ విధంగా అదే పరబ్రహ్మ అని ఇతర దేవతలందరి కంటె ముందుగా తెలుసుకున్నారుగనుకనే ఈ ముగ్గురు దేవతలు - అగ్ని, వాయువు, ఇంద్రుడు - తక్కిన దేవతలందరికంటె శ్రేష్ఠులయినారు. (2)

**తస్మాద్ వా ఇంద్రోऽతితరామివాన్యాన్ దేవాన్ స హ్యేనన్నేదిష్ఠం పస్పర్శ, స హ్యేనత్ ప్రథమో విదాఞ్చకార బ్రహ్మేతి ॥**

అలాగే మొదటగా (ఉమాదేవి చెప్పడంవల్ల) ఈ అతిప్రియము, సమీపస్థము అయిన బ్రహ్మనుగురించి విని, చక్కగా అవగతం చేసుకున్నాడుగనుక, ఈ ముగ్గురిలోకూడ ఇంద్రుడే అతిశ్రేష్ఠుడని గ్రహించాలి. (3)

**తస్యైష ఆదేశో యదేతద్ విద్యుతో వ్యద్యుతదా ఇతీన్న్యమీమిషదా ఇత్యధిదైవతమ్ ॥**

ఒక్క క్షణంపాటు మెరుపు మెరిసిన రీతిలో, కనురెప్పపాటు సాక్షాత్కరించి అదృశ్యం కావడంలోనే ఆ పరబ్రహ్మ దివ్యమంగళ ఆదేశం ఇమిడివుందని తెలియాలి (4)

**అథాధ్యాత్మం యదేతదచ్ఛతీవ చ మనోऽనేన చైతదుపస్మరత్యభీక్ష్ణం సంకల్పః ॥**

కనుక మన మనస్సు ఆ పరమాత్మకు సమీపంగా పోయినట్లనిపించినప్పుడు, దాన్ని సదా ధ్యానం చేస్తున్నప్పుడు మన మనస్సులో పరబ్రహ్మను (రెప్పపాటైనా) వీక్షించాలనే ప్రబల సంకల్పం కలుగుతుందని ఆధ్యాత్మిక పరిభాషలో అర్థంచేసుకోవాలి **(5)**

**తద్ధ తద్వనం నామ తద్వనమిత్యుపాసితవ్యం స య ఏతదేవం వేదాభి హైనం సర్వాణి భూతాని సంవాఞ్ఛన్తి ॥**

ఆ పరబ్రహ్మ ప్రాణకోటికంతటికీ అత్యంత ప్రియపాత్రమైనందువల్ల తద్వనమ్ పేరిట ప్రసిద్ధమైనది తదనుగుణంగా ఆ పరబ్రహ్మను అత్యంత ప్రేమపాత్రంగా భావించి ఉపాసించాలి. ఈ సంగతి ఎరిగి, తన ఉపాసనద్వారా బ్రహ్మతత్వాన్ని దర్శించే వ్యక్తి కూడ ప్రాణకోటికంతటికీ అత్యంత ప్రియపాత్రుడౌతాడని తెలుసుకోవాలి. **(6)**

**ఉపనిషదం భో బ్రూహీత్యుక్తా త ఉపనిషద్ బ్రాహ్మీం వావ త ఉపనిషదమబ్రూమేతి ॥**

ఇదంతా వినికూడ శిష్యునికి బ్రహ్మ అంటే ఏమిటో బోధపడక, "ఓ గురుదేవా ! నాకు ఈ బ్రహ్మసంబంధమైన రహస్యవిద్యను బోధించండి !" అని అడుగుతున్నాడు. దానికి గురువు,"నాయనా ! నీ కిప్పుడే బ్రహ్మసంబంధమైన దివ్యవిద్య బోధించానుగదా నిశ్చయంగా (యిప్పటిదాకా శ్రోత్రస్య శ్రోత్రమ్ నుండి పై మంత్రందాకా) నీకు బ్రహ్మవిద్యనే బోధించివున్నాను," అని జవాబిస్తున్నాడు **(7)**

**తస్యై తపో దమః కర్మేతి ప్రతిష్ఠా వేదాః సర్వాఙ్గాని సత్యమాయతనమ్ ॥**

ఇంకా ఆ బ్రహ్మవిద్యను విన్నంతమాత్రంలో అవగాహన చేసుకోవడం సాధ్యపడదని, ఆ బ్రహ్మస్వరూపాన్ని అర్థంచేసుకోవడానికి కొన్ని విశేష సాధనాలు అవసరం పడుతాయని గురువు యిలా వివరిస్తున్నాడు : ఆ పరబ్రహ్మ స్వరూపాన్ని అవగాహన చేసుకోవడానికి **తపస్సు, దమం** (మనో, ఇంద్రియ నిగ్రహం), **కర్మ** (నిష్కామ కర్మ) అనేవి మూడు ముఖ్య ఆధారాలు. వేదాలు ఆ పరబ్రహ్మయొక్క సంపూర్ణ అంగాలు -

అంటే ఆ బ్రహ్మతత్త్వపు అంగప్రత్యంగాల వివరణ వేదాలలో వున్నది ఈ బ్రహ్మ విద్యకు పరమ లక్ష్యం, అధిష్ఠానం సాక్షాత్తూ ఆ పరబ్రహ్మేనని తెలుసుకుని ఉపాసించాలి. అంటే కేవలం గురూపదేశం వినడంవల్ల లాభంలేదు, వేద వేదాంగాలు చక్కగా అధ్యయనం చేస్తూ, స్వచ్ఛమైన అంతః కరణంతో, మనో, ఇంద్రియ నిగ్రహంతో, తపస్సు, నిష్కామ కర్మలు చేసినప్పుడే ఆ బ్రహ్మను దర్శించే అవకాశం వుంటుందని తాత్పర్యం. **(8)**

**యో వా ఏతమేవం వేదాపహత్య పాప్మానమనన్తే స్వర్గే లోకే జ్యేయే ప్రతితిష్ఠతి ప్రతితిష్ఠతి ॥**

ఎవరైతే పైన చెప్పిన ప్రకారంగా వర్తించి ఈ ప్రసిద్ధ బ్రహ్మవిద్యను చక్కగా అవగతం చేసుకొంటారో, వారు సకలపాపాలనుండి నివృత్తిపొంది (పాప సమూహాన్నంతటినీ నిర్మూలించి), అనంతమైన, సర్వశ్రేష్ఠమైన స్వర్గ ధామాన్ని చేరుకుంటారు. శాశ్వతంగా ఆ స్వర్గంలో ప్రతిష్ఠితులౌతారు. **(9)**

## నాల్గవ ఖండం సమాప్తం.

## // సామవేదీయ కేనోపనిషద్ సమాప్తమ్ //

* * * * *

## శాంతి పాఠం

**ఓం ఆప్యాయన్తు మమాఙ్గాని వాక్ ప్రాణశ్చక్షుః శ్రోత్రమథో బల మింద్రియాణి చ సర్వాణి । సర్వ బ్రహ్మౌపనిషదం మాహం బ్రహ్మ నిరాకుర్యామ్ మా మా బ్రహ్మ నిరాకరోత్, అనిరాకరణ మస్త్వనిరాకరణం మేస్తు । తదాత్మని నిరతే య ఉపనిషత్సు ధర్మాస్తే మయి సన్తు, తే మయి సన్తు ॥**

ఓం శాన్తిః శాన్తిః శాన్తిః

* * * * *

# కఠోపనిషత్తు

ఉపనిషత్తులలో కఠోపనిషత్తు అతి ప్రసిద్ధమైనది. ఇది కృష్ణ యజుర్వేదం లోని కఠశాఖలో చెప్పబడివుంది ఇందులో పరబ్రహ్మ రహస్యమయ తత్వాన్ని నాచికేతునికి, యమునికి జరిగిన సంవాద రూపంలో అత్యంత విశదంగా, ఉపయోగకరంగా వర్ణించడం జరిగింది ఇందులో రెండు అధ్యాయాలు, ప్రతి అధ్యాయంలో మూడు వల్లులు వున్నాయి

## శాంతి పాఠం

**ఓం సహ నావవతు । సహ నౌ భునక్తు । సహ వీర్యం కరవావహై ।**
**తేజస్వి నావధీతమస్తు । మా విద్విషావహై ॥**

**ఓం శాంతిః శాంతిః శాంతిః**

ఓ పరమాత్మా ! మా ఇరువురినీ (గురుశిష్యులిద్దరినీ) తోడ్తోడుగా రక్షించేది. మా ఇద్దరినీ తోడ్తోడుగా సముచితరీతిలో పాలించి పోషించేది. మా యిరువురికీ తగు శక్తియుక్తులు ప్రసాదించమని, మే మిరువురమూ చదివే విద్య ప్రభావంతంగా వుండేట్లు చేయమని, మే ముభయులం ఒకరి నొకరు పరస్పరం ద్వేషించుకోకుండా సద్బుద్ధి ప్రసాదించమని ప్రార్థన. ఓ పరబ్రహ్మ ! మా మూడు తపస్సులూ నివృత్తి అయేట్లు చేయవల్సిందిగా ప్రార్థన

# ప్రథమ అధ్యాయం

**ఓం ఉశన్ హ వై వాజశ్రవసః సర్వవేదసం దదౌ। తస్య హ నచికేతా నామ పుత్ర ఆస॥**

ఓం (పరబ్రహ్మ సంబోధక నామం)!(వాజ = అన్నం; శ్రవ = దాని దానమువల్ల కలిగిన కీర్తి - కనుక వాజశ్రవ అంటే అన్నదానయశస్సు పొందినవాడని అర్థం) వాజశ్రవసుడు (అన్నదానంచే ప్రసిద్ధికెక్కిన మహర్షి అరుణుని కొడుకైన ఉద్దాలకుడు) తన ధనసర్వస్వమూ (విశ్వజిత్‌నామ మహాయజ్ఞంలో) దానం చేసి వేశాడు. ఆ ఉద్దాలకునికి నచికేతుడనే ఒక కొడుకు ఉండేవాడని ప్రతీతి. **(1)**

**తంహ కుమారం సన్తం దక్షిణాసు నీయమానాసు శ్రద్ధాऽऽవివేశ సోऽమన్యత్।**

ఉద్దాలకుడు ఆ యజ్ఞం చేసేటప్పుడు నచికేతుడు చాల చిన్న పిల్లవాడు ఆ రోజుల్లో గోధనమే ప్రధానంగా వుండేది యజ్ఞంలో బ్రాహ్మణులకు ఆవులే దానం చేసేవారు యజ్ఞంలో హోత, అధ్వర్యు, బ్రహ్మ, ఉద్గాత - ఈ నలుగురు ప్రధాన ఋత్విజులు వీరికే అత్యధిక గోవులు దానం చేయబడుతుండేవి తర్వాత వచ్చేవారు - ప్రశాస్తా, ప్రతిప్రస్థాతా, బ్రాహ్మణాచ్ఛంసీ, ప్రస్తోతా అనే రెండవ ప్రాధాన్యంగల మరో నలుగురు రుత్విజులు. వీరికి ముఖ్య రుత్విజుల కిచ్చేదాంట్లో సగం సంఖ్యలో గోవులు దానం చేసేవారు. ఆ తర్వాతివారు - అచ్ఛావాక్, నేష్టా, ఆగ్నీధ్ర, ప్రతిహర్తా - వీరికి ముఖ్యరుత్విజులకు యిచ్చేదాంట్లో మూడో వంతు, ఆ తర్వాతి శ్రేణిలోని గ్రావస్తుత్, నేతా, హోతా, సుబ్రహ్మణ్య అనే నలుగురు రుత్విజులకు ముఖ్య రుత్విజులకు యిచ్చేదాంట్లో నాలుగో వంతు దానం చేసేవారు ఆ ప్రకారంగానే యజ్ఞంలో దక్షిణగా యివ్వడానికి తమ గోవుల్ని తీసుకొచ్చి తన తండ్రి దానంచేస్తూండగా చూచిన నచికేతుడు, పసివాడైనప్పటికీ శ్రద్ధాభక్తులు ఆవరించగా ఆలోచనలో పడిపోయాడు **(2)**

**పీతోదకా జగ్ధతృణా దుగ్ధదోహా నిరిన్ద్రియాః।**
**అనన్దా నామ తే లోకాస్తాన్ స గచ్ఛతి తా దదత్॥**

ఆ గోవులేమో బాగా ముసలివై బక్క-చిక్కి-నవిగా వుండినాయి చివరిసారిగా నీళ్లు తాగి వచ్చినట్లు (అంటే మరణాసన్నమై) వుండినాయి. అవి గడ్డితినడమూ సమాప్తమైనట్లుండింది, అంటే గడ్డిమేయడానికి తగిన పళ్లుగాని, శక్తిగాని లేకుండినాయి వాటి పాలు పిండివేయబడివుండింది, పొదుగుల్లో పాలే లేక క్షీణించివుండినాయి. వాటి ఇంద్రియాలు నష్టమై వుండినాయి, అంటే వాటిలో మళ్లీ ఎదకట్టే, సంతానం కలిగే శక్తి, సూచన లేకుండినాయి మరి యిలాంటి ఎందుకూ కొరగాని శుష్కించిన ముసలి గోవుల్ని దానం చేసి ప్రయోజన మేమిటి? అందువల్ల అనందానామ, అంటే అన్నిరకాల సుఖాలూ శూన్యమై వుంటాయని చెప్పబడే ఆ అధోలోకాలే (శూకర, కూకరాది నీచజన్మలు, నరకాది లోకాలే) ప్రాప్తిస్తాయిగదా, కనుక తండ్రిని హెచ్చరించాలనే యోచన ఆ పిల్లవానికి కలిగింది **(3)**

**స హోవాచ పితరం తత కస్మై మాం దాస్యసీతి। ద్వితీయం తృతీయం తం హోవాచ మృత్యవే త్వా దదామీతి॥**

పైవిధంగా ఆలోచించిన నచికేతుడు తండ్రిని, "నాన్నగారూ ! మరి నన్నెవరికి దానం చేస్తారు? " అని అడిగాడు మొదటిసారి అడిగితే తండ్రి జవాబివ్వలేదు అయితే పిల్లవాడు ఊరుకోకుండా రెండో సారి, మూడో సారికూడ అదే ప్రశ్న అడిగాడు. దానితో తండ్రికి విసిగిపోయి, ఒళ్లు మండిపోయి, " [వెధవాయ్ !] నిన్ను ఆ మృత్యువుకు (యమునికి) దానం చేస్తా" నని కసురుకుంటూ అన్నాడు. **(4)**

ఏదైనా దానం చేయదలిస్తే మనం ప్రశస్తమైన వస్తువునే, మనకు ప్రియమైనది, ఉపయోగకరమైనది, లాభదాయకమైనదై, దానంపొందేవానికికూడ ఉపయోగం, లాభం చేకూర్చేదిగా వుండే వస్తువునే దానం చేయాలి. దానివల్లనే సద్గతి

ప్రాప్తిస్తుంది. అంతేగాని నిరుపయోగం, శుష్కం, లాభహీనమైన వస్తువును దానం చేస్తే దుర్గతే దక్కుతుంది మరి మా నాన్న ఏమిటి, తనకెంతో ప్రియమైన, విలువైన ఆస్తిగా నేనుండగా, ఈ ముసలి, బక్కచిక్కిన ఆవుల్ని దానం చేసి అధోలోకాలు పొందాల్నా ? అనే యోచన ఆ కుర్రవానికి కలిగినందునే, తండ్రి సద్గతి పొందాలనే తపనతోనే యిలా అడిగాడని తాత్పర్యం

**బహూనామేమి ప్రథమో బహూనామేమి మాధ్యమః।**
**కిం ఖిద్యమస్య కర్తవ్యం యన్మయాద్య కరిష్యతి ॥**

పుత్రులు, శిష్యులలో మూడు శ్రేణులకుచెందినవారుంటారు మొదటి శ్రేణి వారు తండ్రి/గురువు మాట చెప్పకుండానే, ఇంకా వారి ఆజ్ఞకోసం నిరీక్షించకుండానే వారి మనసులోని మాట గ్రహించి చకచక పనులు చేసేస్తుంటారు; కాబట్టి వారు ఉత్తములట. పోతే అంత ప్రతిభలేకున్నా, ఇచ్చిన ఆజ్ఞలను తు చ తప్పకుండా నిర్వర్తించేవారు మధ్యములు. మరి స్పష్టంగా ఆజ్ఞలు పొందినా అలసత్వంవల్లో, అర్థంకాకో, నిర్లక్ష్యంవల్లో వాటిని పాటించనివారు అధములట ఇక్కడ తండ్రి కటువచనాలు విన్న నచికేతుడు ఆలోచించుకుంటున్నాడుగదా నేను సాధారణంగా ప్రథమ శ్రేణికి చెందిన వాడినే కొన్ని కొన్ని సార్లు మధ్యమ శ్రేణిలోకూడ వుండివుండవచ్చు. అయితే అధమ శ్రేణిలోనైతే ఎన్నడూ లేనే మరి నాన్నగారు ఎందుకిలా అన్నారు ? అని. ఆ చిన్ని బుర్రకు ఒక సమాధానంకూడ తట్టింది మరి నా ద్వారా నిర్వర్తింప బడాల్సిన కర్తవ్యం ఏదైనా యమధర్మరాజు(మృత్యుదేవత)కు వుందేమో , అందుకనే నేడు నాన్నగారు నన్ను యమునికి దానం చేస్తానంటున్నాడేమో అని ఆలోచించసాగాడు. (5)

**అనుపశ్య యథా పూర్వే ప్రతిపశ్య తథాపరే ।**
**సస్యమివ మర్త్యః పచ్యతే సస్యమివజాయతే పునః ॥**

ఏదో విసిగిపోయి, కోపంతో కసురుకున్నాడే గాని ఉద్దాలకునికి నచికేతునిపై ఎంతో ప్రేమ. అయితే బ్రాహ్మణుని శాపం/మాట తప్పరానిది అయ్యో, నోరుజారి అన్నానే, మరి ఏం కీడు మూడుతుందో ఏమో నని ఉద్దాలకుడు పశ్చాత్తాపంతో కుమిలిపోతున్నట్లున్నది తండ్రి పడే ఆ వేదన గమనించి నట్లున్నాడు నచికేతుడు. ఆయన్ను సమీపించి, యిలా సాంత్వన వాక్యాలు పలకసాగాడు నాన్నగారూ ! చింతించకండి ! మీ పూర్వీకులు (పితరులు) ఎలాంటి సన్మార్గంలో విచరించారో యోచన చేయండి అలాగే సమ కాలీనుల్లోకూడ శ్రేష్ఠులైనవారు ఎలాంటి సత్కార్యాలు చేస్తున్నారో పరికించండి. మృత్యువుకు నన్నప్పగిస్తామన్నందుకు చింతించడ మెందుకు? మానవ జన్మ సహజంగానే పరిణామశీలమైనదిగదా మానవులు మర్త్యులు; పంటచేనులా పండి నశించిపోవడం (జరాజీర్ణమై మరణించడం), తిరిగి ధాన్యంలా మొలకెత్తుకురావడం (పునర్జన్మ నెత్తడం) సహజమేగదా దీనికి మీరు యింతగా చింతించడమెందుకు ? అంటున్నాడా ముద్దులపట్టి **(6)**

ఇలాంటి ఈ అనిత్య జీవితంకోసమని మానవుడు కర్తవ్యవిముఖుడవడం తగని పని. కనుక మీరు శోకం మాని మీ మాటప్రకారమే నన్ను యమధర్మరాజు వద్దకు పోనివ్వండి అని కోరుతాడు నచికేతుడు. దానితో ఉద్దాలకునికి ఎంతో దుఃఖం ముంచుకొచ్చిందిగాని కొడుకు పితృభక్తిని, సత్యపరాయణతను చూచి, చివరికి అతడ్ని యమునివద్దకు పంపిస్తాడు నచికేతుడు యమసదనానికి వెళ్లి చూస్తే అక్కడ ఆయన వుండడు. ఏదో పనిమీద బయటికి వెళ్లాడు, రావడానికి కొన్ని రోజులు పట్టవచ్చు అని తెలుస్తుంది. యమపత్ని అతడికి అన్నజలాలు యివ్వజూచినా వాటిని ముట్టకుండా మూడు రోజులపాటు నిరశనదీక్షతో యమధర్మరాజు రాకడ నిరీక్షిస్తూ వుండిపోయాడు నచికేతుడు. ఎట్టకేలకు మూడు రోజులతర్వాత యముడు ఇంటికి తిరిగి వస్తాడు అప్పుడు యమపత్ని భర్తతో యిలా అంటున్నది :

**వైశ్వానరః ప్రవిశత్యతిథిర్బ్రాహ్మణో గృహాన్।**
**తస్యైతాం శాన్తి కుర్వన్తి హర వైవస్వతోదకమ్ ॥**

హే వైవస్వతా(సూర్యపుత్రా)! స్వయంగా అగ్నిదేవుడే బ్రాహ్మణ అతిథి రూపంలో గృహస్థుల ఇళ్లకు వస్తుంటాడని, వారు అలాంటి బ్రాహ్మణ అతిధికి అర్ఘ్య పాదాసనాదులు సమర్పించి, శాంతి చేస్తుంటారని అంటారు ఈ బ్రాహ్మణ బాలుడేమో మన ఇంటికి వచ్చి మూడు రోజులుగా మంచినీళ్లయినా ముట్టకుండా మీకోసం వేచిచూస్తున్నాడు. కనుక యిప్పుడు మీరు స్వయంగా అతడికి కాళ్లు కడుక్కోవడానికి నీళ్లిచ్చి సత్కరించండి మీరు స్వయంగా సేవచేస్తే అతడికి శాంతి లభిస్తుంది **(7)**

**ఆశా ప్రతీక్షే సంగతం సూనృతాం చ ఇష్టాపూర్తే పుత్రపశూంశ్చ సర్వాన్।**
**ఏతద్ వృఙ్క్తే పురుషస్యాల్పమేధసో యస్యానశ్నన్ వసతి బ్రాహ్మణో గృహే ॥**

ఎవరి ఇంటిలోనైతే బ్రాహ్మణ అతిధి అన్నపానాదులు గ్రహించకుండా అనశనం పూనివుంటాడో అలాంటి మందబుద్ధి మానవునియొక్క నానావిధాల ఆశలు, అపేక్షలు, వాటి పరిపూర్తివల్ల కలిగే సర్వవిధాల సుఖాలు, తీయని పలుకుల ఫలాలు, యజ్ఞదానాది శుభకర్మలవల్ల, బావులు, చెరువులు తవ్వించడం, తోటలు పెంచడం, సత్రాలు నిర్మించడం మొదలైన సత్కార్యాలవల్ల కలిగే పుణ్యాలు, ఇంకా సమస్త పశు, పుత్ర సంపదలు సర్వనాశనమైపోతాయి. (కనుక మీరు వెంటనే మన ఇంటిలో మూడురోజులుగా తిండి, నీళ్లు ముట్టకుండా వున్న ఈ బ్రాహ్మణ బాలకుడ్ని తగు రీతిలో సత్కరించి, శాంతి చేసుకోండి అని యమపత్ని భర్తకు చెబుతున్నది) **(8)**

**తిస్రో రాత్రీర్యదవాత్సీర్గృహే మే అనశ్నన్ బ్రహ్మన్నతిథిర్నమస్యః।**
**నమస్తేఽస్తు బ్రహ్మన్ స్వస్తి మేఽస్తు తస్మాత్ప్రతి త్రీన్ వరాన్ వృణీష్వ ॥**

భార్యమాటలు ఆలకించి యమధర్మరాజు వెంటనే ఆ బ్రాహ్మణ బాలకుని వద్దకు వెళ్లి, అర్ఘ్యపాద్యాదులతో పూజించి, యిలా అంటున్నాడు . ఓ బ్రాహ్మణ

దేవతా ! నమస్కారయోగ్యులైన అతిథి మీరు. మీకు నమస్కారం. ఓ బ్రాహ్మణ బాలకా ! నాకుకూడ కళ్యాణమగుగాక మీరు మూడు రాత్రులపాటు అన్న పానాదులు ముట్టకుండా మా ఇంట్లో నాకోసం నిరీక్షిస్తూ వుండినారు (ఇది నావల్ల పెద్ద అపరాధమే జరిగిపోయింది) అందుకు గాను మీరు నావద్దనుండి ప్రతి రాత్రికి ఒకటి చొప్పున మూడు వరాలు అడిగి తీసుకోండి **(9)**

**శాంతసంకల్పః సుమనా యథా స్యాద్వీతమన్యుర్గౌతమో మాభి మృత్యో ।**
**త్వత్ప్రసృష్టం మాభివదేత్ప్రతీత ఏతత్త్రయాణాం ప్రథమం వరం వృణే ॥**

ఓ మృత్యుదేవా ! మా నాన్నగారైన గౌతముడు (గౌతమవంశీయుడైన ఉద్దాలకుడు) నాపట్ల క్రోధము, ఖేదము లేకుండా, శాంతసంకల్పంకలిగి, ప్రసన్నచిత్తుడైవుండేట్లు, మీరు నన్ను మా ఇంటికి తిరిగిపంపినప్పుడు నాపై విశ్వాసముంచి (వీడు నా కొడుకు నచికేతుడే నని గుర్తుపట్టి) నాతో ప్రేమగా ప్రవర్తించేట్లు చేయవల్సింది ఇదే నేను నిన్ను కోరే మొదటి వరం **(10)**

దీనికి యమధర్మరాజు యిలా జవాబు పలుకుతున్నాడు

**యథా పురస్తాద్భవితా ప్రతీత ఔద్దాలికిరారుణిర్మత్ప్రసృష్టః ।**
**సుఖం రాత్రీః శయితా వీతమన్యుస్త్వాందదృశివాన్మృత్యుముఖాత్ప్రముక్తమ్ ॥**

మంచిది అటులనే కానిమ్ము మృత్యుముఖంనుండి విముక్తమైన (తప్పించుకువచ్చిన) నిన్ను చూచిన ఆరుణి (అరుణపుత్రుడు ఉద్దాలకుడు) నా ప్రేరణవల్ల నిన్ను తన కొడుకు నచికేతుడిగా గుర్తించి, యథాపూర్వంగా క్రోధము, ఖేదము లేక ప్రేమతో వర్తించుగాక దుఃఖం వీడి రాత్రులందు నిశ్చింతగా శయనించుగాక ! **(11)**

ఆపై నచికేతుడు రెండో వరం అడుగుతున్నాడు

**స్వర్గే లోకే న భయం కించనాస్తి న తత్ర త్వం న జరయా బిభేతి ।**
**ఉభే తీర్త్వాశనాయాపిపాసే శోకాతిగో మోదతే స్వర్గలోకే ॥**

స్వర్గలోకంలో భయమనేది కొంచెమైనా వుండదు అక్కడ మృత్యుభయం (మీరు అక్కడ వుండరుగనుక) వుండదు వృద్ధాప్యభయంకూడ వుండదు. స్వర్లోకవాసులు ఆకలి, దప్పులు అసలు లేకుండా, చింత చీకు లేకుండా సకలానందాలు పొందుతుంటారు. **(12)**

**స త్వమాగ్నిం స్వర్గ్యమధ్యేషి మృత్యో ప్రబ్రూహి త్వం శ్రద్ధధానాయ మహ్యామ్ ।**
**స్వర్గలోకా అమృతత్వం భజన్త ఏతద్ ద్వితీయేన వృణే వరేణ ॥**

(కాని ఆ స్వర్గం అగ్నివిద్య రానిదే సంప్రాప్తమవదు). ఓ మృత్యుదేవా ! ఈ స్వర్గప్రాప్తికి సాధనమైన అగ్ని (విద్య) మీకు బాగా తెలుసు మీపట్ల, అగ్ని(విద్య) పట్ల శ్రద్ధగల నాకు మీరు దాన్ని (అగ్నివిద్యను) చక్కగా బోధించవల్సింది. స్వర్గలోకవాసులు అమృతత్వం పొందివుంటారు. కనుక (ఆ ప్రాప్తం నాకు దక్కాలంటే అందుకు సాధనమైన) అగ్నివిద్య నాకు బోధించండి ఇదే నేను కోరుకునే రెండో వరం **(13)**

**ప్ర తే బ్రవీమి తదు మే నిబోధ స్వర్గ్యమాగ్నిం నచికేతః ప్రజానన్ ।**
**అనన్తలోకాప్తిమథో ప్రతిష్ఠాం విద్ధి త్వమేతం నిహితం గుహాయామ్ ॥**

అప్పుడు యముడు యిలా అంటున్నాడు ఓ నచికేతా ! స్వర్గదాయిని అగ్నివిద్య బాగా తెలిసిన నేను నీకు దాన్ని చక్కగా బోధించగలను నీవు నాదగ్గర ఆ విద్య చక్కగా నేర్చుకోవల్సింది. అనశ్వరమైన, అనంతలోకాలు ప్రాప్తింపజేసే, వాటికి ఆధారస్వరూపమైన ఈ అగ్నివిద్య అత్యంత గుప్తమైనదని, ఏదో దుర్గమమైన గుహలో నిక్షిప్తమైవున్నట్లు పరమజ్ఞానుల హృదయాల్లో దాగివుంటుందని గ్రహించవల్సింది **(14)**

**లోకాదిమాగ్నిం తమువాచ తస్మై యా ఇష్టకా యావతీర్వా యథా వా ।**
**స చాపి తత్ప్రత్యవదద్యథోక్తమథాస్య మృత్యుః పునరేవాహ తుష్టః ॥**

ఇలా వరదానం చేసిన యముడు ఆ స్వర్గలోకానికే కారణభూతమైన అగ్నివిద్యను నచికేతునికి ఉపదేశిస్తాడు అగ్నిసృష్టికి వలసిన హోమకుండ నిర్మాణానికి ఎలాంటి, ఎన్ని యిటుకలు అవసరం పడుతాయి, వాటిని ఎలా ఎంపికచేస్తారనే దగ్గరనుండి ఆ అగ్నివిద్య సమస్తమూ చక్కగా బోధిస్తాడు. మరి (కుశాగ్రబుద్ధియైన) నచికేతుడుకూడ యమధర్మరాజు చెప్పిందంతా శ్రద్ధగా ఆలకించి, విన్నది విన్నట్లు కంఠస్తంచేసి అదంతా గురువు(యమధర్మరాజు)కు అప్పజెప్పుతాడు ఆపై మృత్యుదేవుడు(యముడు) సంతృప్తిచెంది ప్రసన్నుడై నచికేతునితో యిలా అంటాడు. **(15)**

**తమబ్రవీత్ప్రీయమాణో మహాత్మా వరం తవేహాద్య దదామి భూయః ।**
**తవైవ నామ్నా భవితాయమగ్నిః సృఙ్కాం చేమామనేకరూపాం గృహాణ ॥**

(నచికేతుని అలౌకిక బుద్ధికుశలత చూచి) ఎంతో ప్రసన్నుడైన మహాత్మ యమధర్మరాజు ఆ నచికేతునితో యిలా అంటాడు ఇప్పుడిక్కడ నీకు మరో వరం అదనంగా యిస్తున్నాను ఈ అగ్నివిద్య నీ పేరుతోనే ప్రసిద్ధమగుగాక ఇంకా ఈ వివిధ రకాల రత్నాలు గల ఈ మాలనుకూడ నీకు (బహుమతిగా) యిస్తున్నాను తీసుకో **(16)**

**త్రిణాచికేతస్త్రిభిరేత్య సంధిం త్రికర్మకృత్తరతి జన్మమృత్యూ ।**
**బ్రహ్మజజ్ఞం దేవమీడ్యం విదిత్వా నిచాయ్యేమాం శాన్తిమత్యన్తమేతి ॥**

ఈ అగ్నిని ముమ్మారు అనుష్టానం చేసే వ్యక్తి ఋక్, యజుః, సామ వేదాలు మూడింటితోనూ సంబంధం కలిగివుండి,వాటి తత్వ రహస్యాలలో నిష్ణాతుడై, యజ్ఞ, దాన, తపోరూప త్రికర్మలను చేస్తూ, వాటి ఫలాన్ని పొందుతూ జన్మమృత్యువునుండి తరించగల్గుతాడు. బ్రహ్మనుండి ఉత్పన్నమైన

ఈ సృష్టి రహస్యం అగ్నిదేవునికి ఎరుక. అలాంటి స్తవనీయుడైన అగ్నిదేవుడిని తెలుసుకొని, ఆయనను నిష్కామ భావంతో ఎంపికచేసి పూజించిన ఫలితంగా బ్రహ్మయందే అనంత శాంతి యైతే నెలకొనివుందో, దాన్ని (ఆ అనంత శాంతిని) పొందగలము. (17)

**త్రిణాచికేతస్త్రయమేతాద్విదిత్వా య ఏవం విద్వాంశ్చినుతే నాచికేతమ్ ।**
**స మృత్యుపాశాన్ పురతః ప్రణోద్య శోకాతిగో మోదతే స్వర్గలోకే ॥**

ఈ మూడు విద్యలను, అంటే ఇటుకల స్వరూపవిశేషాలు, సంఖ్య, అగ్నిని ఎంపికచేసే విధి అనే మూడు అంశాలను, తెలుసుకుని, ముమ్మారు నాచికేత అగ్నివిద్యను అనుష్ఠానం చేసేవారు ఎవరైనాగాని, అలాంటి విద్వాంసులు మృత్యుపాశాన్ని తమ ఎదుటే ఖండించివేసి, అంటే జన్మమృత్యువునుండి విముక్తులై, శోకరహితులై, స్వర్గలోకసుఖాలు పొందగల్గుతారు. (18)

**ఏష తేఽగ్నిర్నచికేతః స్వర్గ్యో యమవృణీథా ద్వితీయేన వరేణ ।**
**ఏతమాగ్నిం తవైవ ప్రవక్ష్యన్తి జనాస్తృతీయం వరం నచికేతో వృణీష్వ ॥**

తర్వాత యమధర్మరాజు యిలా అంటున్నాడు : ఓ నచికేతా ! ఇదే నేను నీకు తెలిపిన స్వర్గప్రదాయిని అయిన అగ్నివిద్య. దీనిని నీవు రెండవ వరంగా పొంది వున్నావు. ఈ అగ్నిని ప్రజలంతా నీ పేరిటే తెలుసుకుందురుగాక ఓ నచికేతా ! మరిప్పుడు మూడో వరం కోరుకో (19)

**యేయం ప్రేతే విచికిత్సా మనుష్యేఽస్తీత్యేకే నాయమస్తీతి చైకే ।**
**ఏతద్విద్యామనుశిష్టస్త్వయాహం వరాణామేష వరస్తృతీయః ॥**

తండ్రికి తనపట్ల కోపం పోయి ప్రసన్నుడు కావాలని మొదటి వరంగా, స్వర్గలోక సుఖాలు ప్రాప్తం కావాలని రెండవ వరంగా కోరి,పొందిన నచికేతుడు యిప్పుడు ఆత్మవిద్య బోధించమంటూ మూడో వరం యిలా అడుగుతున్నాడు .

చనిపోయిన మనిషికి సంబంధించి, అంటే మృత్యువుకు సంబంధించి, ఒక సంశయం వుంది చనిపోయినా ఆత్మవుంటుందని, అంటే మనిషి శరీరం నశించిపోవచ్చుగాని అతడి ఆత్మ అనశ్వరంగా వుంటుందని కొందరంటారు అయితే చనిపోయినతర్వాత యింకేమివుంటుంది బూడిద! ఆత్మలేదు, గీత్మలేదు అని మరికొందరు అంటారు. కనుక మీరు నాకీ రహస్యం విడమర్చిచెప్పాలని, మీద్వారా ఈ ఆత్మవిద్యను నేను చక్కగా తెలుసుకోవాలని మూడో వరంగా కోరుకుంటున్నాను. [తైత్తిరీయ బ్రాహ్మణంలోకూడ ఒక నాచికేతోపాఖ్యానం వుంది. అందులో నచికేతుడు మూడో వరంగా పునర్మరణంపట్ల విజయం సాధించడమెలాగో, అంటే ముక్తిసాధనాన్ని, బోధించమని యముడ్ని వేడుకుంటాడు ]. **(20)**

**దేవైరత్రాపి విచికిత్సితం పురా న హి సువిజ్ఞేయమణురేష ధర్మః ।**
**అన్యం వరం నాచికేతో వృణీష్వ మా మోపరోత్సీరతి మా సృజైనమ్ ॥**

మూడో వరంగా నచికేతుడు అడిగిన గహనమైన ప్రశ్న విని యమధర్మరాజు మనసులో చాల సంతోషించాడు కాని ఆత్మతత్వం అల్లాటప్పాదేమీకాదు ఎవరికంటే వారికి బోధించడానికి, ఎవరికంటె వారికి అవగాహన కావడానికి. యోగ్యులైన వారికే దాన్ని బోధించాల్సివుంటుంది. అందువల్ల నచికేతుని అర్హతను తెలుసుకొనేందుకుగాను యముడు యిలా అంటున్నాడు . ఓ నచికేతా ! మునుపు దేవతలుకూడ యీ విషయం విచికిత్సచేసారు అయితే ఈ విషయం బహు సూక్ష్మమైనది, దుర్గ్రాహ్యమైనది కనుక వాళ్లకుకూడ యిది అంతుబట్టలేదు. కనుక నీవు నన్ను వత్తిడి చేయకుండా, ఈ ఆత్మతత్వంగురించి అడిగిన వరాన్ని వెనక్కుతీసుకుని, మరో వరమేదైనా కోరుకో **(21)**

**దేవైరత్రాపి విచికిత్సితం కిల త్వం చ మృత్యో యన్న సువిజ్ఞేయమాత్థ।**
**వక్తా చాస్య త్వాదృగన్యో న లభ్యో నాన్యో వరస్తుల్య ఏతస్య కశ్చిత్॥**

ఓ యమధర్మరాజా ! పూర్వకాలంలో ఈ విషయమై దేవతలుకూడ తలలు పగులగొట్టుకుని యోచించారుగాని వాళ్లకూ ఈ ఆత్మతత్వం ఏమీ ఒంటబట్టలేదని చెప్పారుగదా ఇది చాల సూక్ష్మమైనది, దుర్గ్రాహ్యమైనదనికూడ చెబుతున్నారే మరి ఇంత స్పష్టంగా విడమర్చి చెప్పేవాళ్లు నాకు మరెవరు దొరుకుతారు ? అలాగే ఇది ఎంత ముఖ్యవిషయమోకూడ విస్పష్టమేగదా కనుక దీనికి దీటైన వరం మరొకటి ఏదీ వుండజాలదు. (22)

**శతాయుషః పుత్రపౌత్రాన్ వృణీష్వ బహూన్ పశూన్ హస్తిహిరణ్యమశ్వాన్।**
**భూమేర్మహదాయతనం వృణీష్వ స్వయం చ జీవ శరదో యావదిచ్ఛసి॥**

విషయకాఠిన్యం సంగతి విని నాచికేతుడేమీ చలించలేదు అతడి దృఢదీక్ష సడలలేదు కనుక యముడు పెట్టిన మొదటి పరీక్షలో అతడు నెగ్గాడు. కాని యముడు అంత త్వరగా వదిలిపెట్టదల్చలేదు వివిధ ప్రలోభాలకు అతడిని గురిచేసేవిధంగా మరో రెండో పరీక్ష పెట్టదల్చాడు కనుక యిలా అంటున్నాడు ఏమయ్యా, నీవు భలే అమాయకుడిలా వున్నావే ఈ కఠినాతి కఠినమైన వరమెందుకు నీకు? ఇందుకు బదులు శతాయుష్మంతులైన కొడుకులు, మనుమళ్లను (సంతతిని) కోరుకోరాదా కావలిసినన్ని గోవులు, గుర్రాలు, ఏనుగులు, వలసినంత బంగారం కోరుకో. నీవు కోరుకునేంత విస్తారమైన భూభాగం యిస్తాను, ఏలుకో అంతేకాదు ఇచ్ఛాజీవితం (నీవు కోరుకున్నంత కాలం బతికివుండేట్లు) ప్రసాదిస్తాను, తీసుకో (23)

**ఏతత్తుల్యం యది మన్యసే వరం వృణీష్వ విత్తం చిరజీవికాం చ।**
**మహాభూమౌ నాచికేతస్త్వమేధి కామనాం త్వా కామభాజం కరోమి॥**

ఓ నచికేతా ! చిరకాల జీవనం, అపార సిరిసంపదలు ఈ ఆత్మతత్వ వరదానంతో సమమనుకుంటే కోరుకో ఇస్తాను. ఇంకా అలాంటివేవైనా కోరుకో సువిశాల పృథ్వికి సామ్రాట్టువి కాగోరితే నేనలాగే చేస్తాను. నిన్ను సకలవిధాల ప్రసన్నం చేస్తాను. సమస్త భోగాలకు నిన్ను అర్హుడ్నిగావిస్తాను. కనుక నీకేం కావాలన్నా కోరుకో (24)

**యే యే కామా దుర్లభా మర్త్యలోకే సర్వాన్ కామాంశ్ఛన్దతః ప్రార్థయస్వ।**
**ఇమా రామాః సరథాః సతూర్యా న హీదృశా లంభనీయా మనుష్యైః ।**
**ఆభిర్మత్ప్రత్తాభిః పరిచారయస్వ నచికేతో మరణం మానుప్రాక్షీః ॥**

ఇంకా మానవలోకంలో దుర్లభమైన సకల స్వర్గసుఖాలనూ కోరుకో, యిస్తాను. నీ యిష్టం వచ్చినట్లు, యిష్టం వచ్చినంత కోరుకో, యిస్తాను అసంఖ్యాక రథాలు, నానావిధాల వాద్యతూర్యాలతోబాటు ఈ అతిలోకసుందరీమణులైన అప్సరసల్ని నీవెంట తీసుకువెళ్ళు మానవమాత్రులకు ఎట్టి పరిస్థితుల్లోనూ లభ్యంకాని ఈ అందగత్తెలను నేను నీకిస్తాను. తీసుకువెళ్లి సకల పరిచర్యలు చేయించుకో అంతేగాని ఓ నచికేతా ! చనిపోయిన తర్వాత ఆత్మకు ఏమౌతుందంటూ గడ్డుప్రశ్న అడగవద్దు. (25)

**శ్వోభావా మర్త్యస్య యదన్తకైతత్సర్వేన్ద్రియాణాం జరయన్తి తేజః ।**
**అపి సర్వం జీవితమల్పమేవ తవైవ వాహాస్తవ నృత్యగీతే ॥**

ఓ యమరాజా ! మీరు వర్ణించిచెప్పిన భోగవిలాసాలన్నీ క్షణభంగురాలే జీవితం అదెంత దీర్ఘమైనదైనా నిజానికి అల్పమైనదే ఈ భోగాలు, దీర్ఘజీవనం వగైరాలన్నీ మనిషి అంతఃకరణంతోసహా సర్వేంద్రియాల తేజస్సును హరించివేసి, దాన్ని క్షీణింపజేస్తుంటాయి కనుక మీరు యివ్వజూపుతున్న ధనకనకవస్తువాహనా లన్నిటినీ, నృత్యగీతాదిసహితంగా వెంట పంపిస్తామంటున్న ఈ అందగత్తెలైన అప్సరసలను మీవద్దనే వుంచుకోండి నా కేమీ అక్కర లేదు. (26)

**న విత్తేన తర్పణీయో మనుష్యో లప్స్యామహే విత్తమద్రాక్ష్మ చేత్త్వా ।**
**జీవిష్యామో యావదీశిష్యసి త్వం వరస్తు మే వరణీయః స ఏవ ॥**

మనిషి ఎన్నడేగాని సిరిసంపదలతో సంతృప్తిచెందగలగడం కల్ల పోతే మీ దర్శన భాగ్యం లభించాక యిక ధనం ఎలాగూ లభిస్తుందికూడానూ అలాగే మీరు పాలించేంతవరకు (నా) జీవితం కొనసాగుతూనే వుంటుంది. కనుక ఇవేవీ కోర నవసరమే లేదు. కనుక నేను అడగదగిన వరం- ఆత్మజ్ఞానం బోధించమనేదొకటి మాత్రమే. (27)

**అజీర్యతామమృతానాముపేత్య జీర్యన్మర్త్యః క్వధఃస్థః ప్రజానన్।**
**అభిధ్యాయన్ వర్ణరతిప్రమోదానతిదీర్ఘే జీవితే కో రమేత ॥**

పైవిధంగా వివిధ భోగాల తుచ్ఛతను వర్ణించిన తర్వాత నాచికేతుడు తాను కోరే మూడో వరం మహత్తునుగురించి యిలా తెలుపుతున్నాడు . ఓ యమధర్మ రాజా ! మానవలోకంలో అందరూ జరామరణశీలురే ఈ సత్యాన్ని చక్కగా తెలిసిన బుద్ధిమంతులెవరేగాని మీవంటి అజరామరులైన మహాత్ముల సాంగత్య సౌభాగ్యం లభించిన పిదపకూడ యింకా కాంతాకనకాలపై, రతిక్రీడలు,తదితర ప్రమోదలీలలపై పదే పదే దృష్టి నిలిపి దీర్ఘకాల జీవితాన్ని కోరుకుంటారా ? ముమ్మాటికీ కాదనే నా అభిప్రాయం **(28)**

**యస్మిన్నిదం విచికిత్సన్తి మృత్యో యత్సాంపరాయే మహతి బ్రూహి నస్తత్।**
**యోఽయం వరో గూఢమనుప్రవిష్టో నాన్యం తస్మాన్నాచికేతా వృణీతే ॥**

ఓ యమధర్మరాజా ! ఆత్మజ్ఞానం మహాద్భుతమైన, పరలోకసంబంధితమైన మహాతత్వం దీన్నిగురించి చనిపోయినతర్వాత ఆత్మ వుంటుందా, వుండదా అంటూ మానవులు విచికిత్స చేస్తూవుంటారు. కనుక దీనిపై సరియైన నిర్ణయమేమిటో మీరే మాకు తెలపండి ఇదే అత్యంత గంభీరము, నిగూఢమైన వరం ఇది తప్ప నచికేతునికి మరో వరమేదీ అవసరం లేదు. **(29)**

## ప్రథమ వల్లీ సమాప్తము.

# ద్వితీయ వల్లీ

ఈ విధంగా పరీక్షించిన పిదప నాచికేతుడు దృఢ నిశ్చయంగలవాడు, పరమ విరాగి, నిర్భయుడు అని, కనుక బ్రహ్మవిద్య పొందడానికి ఉత్తమ యోగ్యత గలవాడని తెలుసుకున్న యమధర్మరాజు ఆ విద్య బోధించడానికిముందు దాని మహత్తును వివరిస్తూ యిలా అంటున్నాడు ·

**అన్యచ్ఛ్రేయోఽన్యదుతైవ ప్రేయస్తే ఉభే నానార్థే పురుషం సినీతః ।**
**తయోః శ్రేయ ఆదదానస్య సాధు భవతి హీయతేఽర్థాద్య ఉ ప్రేయో వృణీతే ॥**

మానవ జీవనం కేవలం కర్మఫలాలు అనుభవించడానికిమాత్రమే కాదు భవిష్యత్ సుఖాలు పొందే సాధనాలనుకూడ మానవుడు తన జీవితంలో ఉపయోగించ గల్గుతాడు ఇవి రెండు రకాలు . 1 శ్రేయాలు - అంటే నిత్యము, శాశ్వతమైన ఆధ్యాత్మిక సుఖాన్ని సాధించిపెట్టే పరబ్రహ్మవిద్యాసంబంధిత కళ్యాణదాయక సాధనాలు 2 ప్రేయాలు - అంటే ఐహిక జీవితంలో అభ్యున్నతిని అంటే స్త్రీసుఖం, పుత్రపౌత్రాది సంతానప్రాప్తిఫలం, సిరిసంపదల అతిశయం, కీర్తిప్రతిష్టల పెంపు మొదలైన సాంసారిక భోగాలు వీటిలో నిత్యము, శాశ్వతమైన బ్రహ్మతత్వాన్ని అన్వేషించే ఆధ్యాత్మిక సాధనాలే మనశ్శాంతిని, అలౌకిక ఆనందాన్ని ప్రసాదించగలవు నిజమైన దివ్యసుఖాలకు దారితీయగలవు కాగా ఇహలోక భోగాలను, క్షణికసుఖాలు, ఆనందాలను కోరుకునే, తెచ్చిపెట్టే సాధనాలు నిజానికి యధార్థప్రయోజనాలను చేకూర్చలేక, దుఃఖకారకాలే అవుతాయి. **(1)**

**శ్రేయశ్చ ప్రేయశ్చ మనుష్యమేతస్తౌ సంపరీత్య వివినక్తి ధీరః ।**
**శ్రేయో హి ధీరోఽభి ప్రేయసో వృణీతే ప్రేయో మన్దో యోగక్షేమాద్ వృణీతే ॥**

శ్రేయాలు, ప్రేయాలు రెండూకూడ మానవుల ఎదుట తటస్థిస్తుంటాయి ధీరులు, అంటే బుద్ధిమంతులైనవారు, ఈ రెండురకాల సాధనాలగురించి

చక్కగా విచారణ చేసి, అవి రెండూ వేరువేరువని గుర్తెరుగుతారు తుదకు వారు - ధీరులు - పరమ కళ్యాణదాయకమైన ఆధ్యాత్మిక సాధనాలనే ఎంపిక చేసుకుంటారు కాగా మందమతులుమాత్రం లౌకిక సుఖసంక్షేమాలనే కాంక్షించి, ఐహిక భోగసాధనాలనే ఎన్నుకుంటారు (2)

**స త్వం ప్రియాన్ ప్రియరూపాంశ్చ కామనభిధ్యాయన్నచికేతోఽత్యస్రాక్షీః ।**
**నైతాం సృఙ్కాం విత్తమయీమవాప్తో యస్యాం మజ్జన్తి బహవో మనుష్యాః ॥**

ఓ నచికేతా ! నీవు బాగా ఆలోచించి, అత్యంత మనోహర రూపంగల, ప్రియఫలాలు చేకూర్చిపెట్టే ఐహిక, పారలౌకిక భోగసాధనాలను విసర్జించావు. ఈ విధంగా అనేకమంది మానవులు సులభంగా చిక్కుకుపోయేవిధంగా నీవైతే సిరిసంపదల సంకెళ్లలో చిక్కుకు పోలేదు. (3)

**దూరమేతే విపరీతే విషూచీ అవిద్యా యా చ విద్యేతి జ్ఞాతా ।**
**విద్యాభీప్సినం నాచికేతసం మన్యే న త్వా కామా బహవోఽలోలుపన్త ॥**

అవిద్య, విద్య అన్న పేర్లతో విఖ్యాతమైన అంశాలు రెండూ పరస్పరం ఎంతో విరుద్ధమైనవి. అంతేకాక అవి భిన్న భిన్న ఫలాలు యిచ్చేవి. అయితే నచికేతా, నీవైతే అవిద్యను కోరుకునేవాడివి కావని, విద్యాభిలాషివేనని నేను నమ్ముతున్నాను. ఎందుకంటే నేనెన్ని భోగాలు యివ్వజూపినా అవేవీ నిన్ను ప్రలోభపెట్టలేకపోయాయి గదా. (4)

**అవిద్యాయామన్తరే వర్తమానాః స్వయం ధీరాః పణ్డితమ్మన్యమానాః ।**
**దన్ద్రమ్యమాణాః పరియన్తి మూఢా అన్ధేనైవ నీయమానా యథాన్ధాః ॥**

అవిద్యాంధకారంలో మగ్గుతూకూడ తమ్ము తాము బుద్ధిమంతులుగానూ, పండితమ్మన్యులుగానూ భావించుకునే మూర్ఖజనులు నానావిధ యోనుల్లో జన్మిస్తూ (అంటే అనేక నీచ జన్మలు పొందుతూ), గుడ్డివాని

మార్గదర్శకత్వంలో దారితప్పి, ఇటూ అటూ చెదిరి తిరుగుతూండే గుడ్డివాళ్లలాగ, తమ దారిలో రకరకాల టోకర్లు తింటూ గమ్యం చేరలేక వృథాగా సంచరిస్తూంటారు (5)

**న సాంపరాయః ప్రతిభాతి బాలం ప్రమాద్యన్తం విత్తమోహేన మూఢమ్।**
**అయం లోకో నాస్తి పర ఇతి మానీ పునః పునర్వశమాపద్యతే మే॥**

ఈ విధమైన సిరిసంపదల వ్యామోహంచే విమూఢుడై, నిర్లక్ష్యంతో నిరంతరం తప్పులు చేసే అజ్ఞానికి పరలోకాలగురించిన యోచన వుండదు ప్రత్యక్షంగా కనిపించే ఈ లోకంమాత్రమే యథార్థం, యిది తప్ప స్వర్గ నరకాలంటూ మరే లోకాలేవీ లేవు అని భావిస్తుంటాడు. కనుక ఐహిక సుఖాలకే జీవితమంతా కేంద్రీకరించి, వెచ్చిస్తుంటాడు ఈ విధంగా భావించే దురభిమాని మాటిమాటికీ నా పాశంలో చిక్కుతుంటాడు. అంటే నానావిధ యోనుల్లో పడి పునర్జన్మలెత్తుతూ, రకరకాల కష్టనష్టాలు పడుతూ జనన మరణ చక్రంలో సదా చిక్కుకునేవుంటాడు. (6)

**శ్రవణాయాపి బహుభిర్యో న లభ్యః శృణ్వన్తోఽపి బహవో యం న విద్యుః।**
**ఆశ్చర్యో వక్తా కుశలోఽస్య లబ్ధాఽఽశ్చర్యో జ్ఞాతా కుశలానుశిష్టః॥**

ఆత్మతత్త్వం ఎంత దుర్లభమో యమధర్మరాజు యిలా వివరిస్తున్నాడు · ఓ నచికేతా ! ఈ ఆత్మతత్త్వం అనేకులకు వినడానికికూడ దుర్లభమే ఇంకా అనేకులు దీన్నిగురించి విన్నా అవగాహనమాత్రం చేసుకోలేకుంటారు మరి యిలాంటి నిగూఢమైన ఆత్మతత్త్వంగురించి వివరించి చెప్పే ఒక వక్త లభించడమే ఆశ్చర్యం అంటే అలాంటి వ్యక్తి దొరకడం బహుదుర్లభం ఇక ఈ ఆత్మతత్త్వాన్ని పొందగలిగే అతికుశలుడైన వ్యక్తికూడ అరుదుగామాత్రమే తటస్థ పడుతుంటాడు. పోతే కుశలుడైన ఆత్మతత్త్వజ్ఞానివద్దనుండి దాన్ని గ్రహించే జ్ఞాతకూడ బహు అరుదుగానే లభిస్తాడు (7)

న నరేణావరేణ ప్రోక్త ఏష సువిజ్ఞేయో బహుధా చిన్త్యమానః।
అనన్య ప్రోక్తే గతిరత్ర నాస్తి అణీయాన్ హ్యతర్క్యమణుప్రమాణాత్॥

అల్పజ్ఞుడైన వ్యక్తి బోధిస్తే విని, తదనుగుణంగా బహువిధమైన చింతనలు చేసినా ఈ ఆత్మతత్వం ఏ మాత్రం అవగతం కాదు. లేక మరో వ్యక్తితో నిమిత్తం లేకుండా ఎవరైనా తనంత తానుగానే బహువిధాలుగా తర్క-వితర్కాలుచేసి యోచించడంద్వారానైనా ఈ ఆత్మతత్వం కొరుకుడు పడదు ఎందుకంటే ఇది అత్యంత సూక్ష్మము, గహనమైన విషయం ఈ ఆత్మతత్వం అణువుకంటే అతిసూక్ష్మమైనది; తర్కానికే అతీతమైనది. అంటే, సరియైన, అతికుశలుడైన ఆత్మతత్వజ్ఞాని గురువుగా లభించడం అత్యావశ్యకమని యముడు విశదం చేస్తున్నాడన్నమాట. **(8)**

నైషా తర్కేణ మతిరాపనేయా ప్రోక్తాన్యేనైవ సుజ్ఞానాయ ప్రేష్ఠ।
యాం త్వమాపః సత్యధృతిర్బతాసి త్వాదృఙ్నో భూయాన్నచికేతః ప్రష్టా॥

ప్రియతమా ! నీవు పొందివున్న ఈ సద్బుద్ధి తర్కంతోనైతే లభించజాలదు. యోగ్యులైన ఇతరులచే (పరమ జ్ఞానులచే) చెప్పబడినప్పుడే, ఆత్మజ్ఞానంతో సంబంధితమైనప్పుడే యిలాంటి సద్బుద్ధి లభించివుంటుంది కనుక నచికేతా ! నీవు నిజంగా సుధీరుడివి కనుక నేనుసైతం నీలాంటి పృచ్ఛకులే శిష్యులుగా లభించాలనే కోరుకుంటాను. **(9)**

జానామ్యహం శేవధిరిత్యనిత్యం న హ్యధ్రువైః ప్రాప్యతే హి ధ్రువం తత్।
తతో మయా నాచికేతశ్చితోఽగ్నిరనిత్యైర్ద్రవ్యైః ప్రాప్తవానస్మి నిత్యమ్॥

నచికేతా ! మరి అనిత్యవస్తువులద్వారా నాచికేతనామాగ్నిని నేను చయనం చేసానుగదా మరి నిత్య ఆత్మజ్ఞానతత్వాన్ని నేనెలా పొందానని నీవు అడగవచ్చు. ఔను, అనిత్యవస్తువులద్వారా ఆ నిత్య పదార్థం, అంటే పరమాత్మ, లభించ జాలదు, కనుక కర్మఫలరూపమైన నిధి ఏదైనా అనిత్యమేనని నేనెరుగుదును.

అయితే నేను అనేక అనిత్య పదార్థాలద్వారా ఈ నాచికేతాగ్నిని చయనంచేసి, ప్రజ్వలనం చేసినా, అదంతా నిష్కామభావంతో చేసివుండడంవల్ల ఆ నిష్కామకర్మ యొక్క అద్భుత ప్రభావంవల్ల నేనీ ఆత్మజ్ఞానాన్ని పొందగలిగానని గ్రహించుకో **(10)**

**కామస్యాప్తిం జగతః ప్రతిష్ఠాం క్రతోరనన్త్యమభయస్య పారమ్।**
**స్తోమమహదురుగాయం ప్రతిష్ఠాం దృష్ట్వా ధృత్యా నచికేతోऽత్యస్రాక్షీః ॥**

ఓ నచికేతా ! సకలవిధాలైన సుఖభోగాలతో పరిపూర్ణమైన, ఈ జగత్తుకే ఆధార స్వరూపమైన, యజ్ఞయాగాదులవల్ల లభించే అంతిమ, నిత్య శాశ్వత ఫలమైన, సమస్తరకాలైన దుఃఖాలు, భయాలకు దూరమైన, అపార స్తుతియోగ్యమైన, మహత్వపూర్ణమైన, వేదాలలో రకరకాలుగా గుణగానాలు చేయబడిన, దీర్ఘకాలంపాటు మనివుండే స్వర్గలోకాన్నే యివ్వజూపినా, నీవు దాని మహత్తును అవగతంచేసుకునికూడ, దాని ప్రలోభానికికూడ లొంగక, తనికమైనా చలించకుండా దాన్నికూడ వద్దని తోసివేసావు ఆత్మజ్ఞానమే కావాలనే దృఢ నిశ్చయం వ్యక్తపరిచావు. ఇదేమీ చిన్న విషయం కాదు. అందుకే నీవు చాల బుద్ధిమంతుడివని, అనాసక్తుడివని, కనుక ఆత్మతత్వ జ్ఞానం పొందడానికి నిజంగా యోగ్యుడవని నేను భావిస్తున్నాను. **(11)**

**తం దుర్దర్శం గూఢమనుప్రవిష్టం గుహాహితం గహ్వరేష్ఠం పురాణమ్।**
**అధ్యాత్మయోగాధిగమేన దేవం మత్వా ధీరో హర్షశోకౌ జహాతి ॥**

గూఢమైనది (యోగమాయ ముసుగులో దాగివున్నది), సర్వవ్యాప్తమైనది, అందరి హృదయాల్లో (హృదయమనే గుహలో) అంతర్నిహితమై వుండేది, సంసారరూప గహనవనంలో ప్రతిష్టితమైవుండేది, అతి సనాతనమైనది (చిరంతన, పురాతనమైనది) అయిన ఆ అతికష్టంపై దర్శింపబడగలిగే (గ్రహింపబడగలిగే ) పరమాత్మను శ్రద్ధాబుద్ధులుగల సాధకుడు అధ్యాత్మయోగ

ప్రాప్తిద్వారా అవగతం చేసుకుని, ఆ అపూర్వజ్ఞాన సాధనమూలంగా హర్షశోకాలు రెండూ లుప్తమైవుండే నిర్వికారస్థితిని అందుకుంటాడు (12)

**ఏతచ్ఛ్రుత్వా సంపరిగృహ్య మర్త్యః ప్రవృహ్య ధర్మ్యమణుమేతమాప్య ।**
**స మోదతే మోదనీయం హి లబ్ధ్వా వివృతం సద్మ నచికేతసం మన్యే ॥**

ఈ ధర్మమయమైన ఉపదేశం విని, విన్నదానిని చక్కగా గ్రహించుకుని, గ్రహించుకున్నదానిపై వివేకబుద్ధితో వితర్కించుకుని, తద్వారా ఈ సూక్ష్మాతి సూక్ష్మమైన ఆత్మజ్ఞానాన్ని బాగా తెలుసుకుని, అనుభవసిద్ధం చేసుకున్న మనుష్యుడు ఈ సచ్చిదానందస్వరూపుడైన పరబ్రహ్మ జ్ఞానంద్వారా సదా ఆనందంలోనే మగ్నమైవుంటాడు నచికేతా ! నీవుకూడ అలాంటి మనిషి కావడానికి అర్హుడవని, ఆ పరమధామ ద్వారాలు నీకోసం తెరిచివున్నాయని నేను భావిస్తున్నాను. (13)

**అన్యత్ర ధర్మాదన్యత్రాధర్మాదన్యత్రాస్మాత్కృతాకృతాత్ ।**
**అన్యత్ర భూతాచ్చ భవ్యాచ్చ యత్తత్పశ్యసి తద్వద ॥**

యమధర్మరాజు నోట తన ప్రశంస విని పొంగిపోలెదు నచికేతుడు. ఆత్మతత్త్వ జ్ఞానం పొందడానికి తాను యోగ్యుడినని గ్రహించిన నచికేతుని మనస్సులో బ్రహ్మ జిజ్ఞాస తీవ్రంగా చెలరేగగా సాధుసహజమైన సంకోచంతో యిలా అడుగుతున్నాడు : మహానుభావా ! ధర్మానికి, అధర్మానికి రెంటికీ అతీతమైన, ఈ కార్యకారణ స్వరూపమైన సమస్త జగత్తుకూ భిన్నమైన, భూత భవిష్యద్ వర్తమాన కాలాలు మూడింటికీ, వాటి సంబంధిత పదార్థాలన్నింటికీ కూడ వేరైవుండేటటువంటిదిగా మీరు ఎరిగివుండే ఆ పరమాత్మతత్త్వాన్ని నాకు వివరించి చెప్పండి. (14)

**సర్వే వేదా యత్పదమామనన్తి తపాంసి సర్వాణి చ యద్వదన్తి ।**
**యదిచ్ఛన్తో బ్రహ్మచర్యం చరన్తి తత్తే పదం సంగ్రహేణ బ్రవీమ్యోమిత్యేతత్ ॥**

అది విని యమధర్మరాజు యిలా జవాబిస్తున్నాడు ఓ నచికేతా ! సకల వేదాలు ఏ పరమపదాన్ని పదే పదే ప్రతిపాదించి చెబుతున్నాయో, సర్వ జపతపాలు ఏ పరమపదంకోసం ఉపలక్షించబడుతాయో, ఏ పరమపదాన్ని కాంక్షించి సాధకులు బ్రహ్మచర్యం అనుష్టిస్తారో, ఆ పరమపదంగురించి నీకు సంక్షేపంగా చెబుతాను వినుకో. 'ఓం ' అనే ఏకాక్షరమే అది **(15)**

**ఏతద్ధ్యేవాక్షరం బ్రహ్మ ఏతద్ధ్యేవాక్షరం పరమ్ ।**
**ఏతద్ధ్యేవాక్షరం జ్ఞాత్వా యో యదిచ్ఛతి తస్య తత్ ॥**

నామరహితమైనా పరబ్రహ్మను అనేక పేర్లతో పిలుస్తూనేవుంటారు. ఆ పేరులన్నింటిలోకీ **ఓం** కార నామం అతిశ్రేష్ఠమైనదని భావిస్తుంటారు. కనుక ఈ **ప్రణవ** నాదమే పరబ్రహ్మ నామము, నామముకాని అస్తిత్వమూనూ అని యముని అంతరార్థం యమధర్మరాజు యిలా అంటున్నాడు : ఈ (**ఓం** అనే) అక్షరమే బ్రహ్మ ఈ అక్షరమే పరబ్రహ్మ. (అంటే బ్రహ్మ, పరబ్రహ్మల రెంటి పేరూ **ఓం** అనేదే. ఇక్కడ బ్రహ్మ అంటే సగుణ, పురుషోత్తమ బ్రహ్మ అని, పరబ్రహ్మ అంటే నిర్గుణ, నిర్విశేష బ్రహ్మ అని విజ్ఞుల వ్యాఖ్య). కనుక ఈ **ఓం** అనే అక్షరాన్ని గ్రహిస్తే అప్పుడు ఈ రెంటిలో (అపర, పర బ్రహ్మలలో) ఏది కోరుకుంటే అదే లభించగలదు **(16)**

**ఏతదాలంబనం శ్రేష్ఠం ఏతదాలంబనం పరం ।**
**ఏతదాలంబనం జ్ఞాత్వా బ్రహ్మలోకే మహీయతే ॥**

ఇదే (అంటే ఈ ఓంకారమే) [పరబ్రహ్మ ప్రాప్తికోసం] అత్యుత్తమ ఆలంబనం ఇదే చరమ ఆలంబనం (అంతిమ ఆశ్రయం) కూడ కనుక ఈ ఆలంబనాన్ని చక్కగా గ్రహించిన సాధకుడు బ్రహ్మలోకంచేరి మహిమాన్వితుడౌతాడు. అంటే అతనికి పరమాత్మ ప్రాప్తి లభిస్తుంది **(17)**

న జాయతే మ్రియతే వా విపశ్చిన్నాయం కుతశ్చిన్న బభూవ కశ్చిత్।
అజో నిత్యః శాశ్వతోఽయం పురాణో న హన్యతే హన్యమానే శరీరే ॥

నిత్యజ్ఞానస్వరూపమైన ఆత్మకు పుట్టుక లేదు, గిట్టుటా లేదు. ఇది మరేదో ఒక దాన్నుండి రూపొందిందికాదు, లేదా దీనినుండి మరేదైనా రూపొందడమూ లేదు అంటే యిది కార్యమూకాదు, కారణమూ కాదు. ఇది అజము(పుట్టుక లేనిది), నిత్యము, శాశ్వతము, పురాతనము అంటే వృద్ధిక్షయాలు లేనిది. శరీరం నాశనమైపోయినా దీనికి నాశనం లేదు (ఇది నాశనం చేయబడజాలదు)

[ భగవద్గీత, రెండవ అధ్యాయం (సాంఖ్య యోగం) లోని **20**వ శ్లోకం ఇంచుమించు దీనికి కాపీ అని చెప్పవచ్చు. అది యిలా వుంటుంది : న *జాయతే మ్రియతే వా కదాచిన్నాయం భూత్వా భవితా వా న భూయః। అజో నిత్యః శాశ్వతోఽయం పురాణో న హన్యతే హన్యమానే శరీరే ॥* - అనగా ఈ ఆత్మ పుట్టదు, ఎప్పుడూ చావదు. ఒకప్పుడుండి, మరొకప్పుడు లేకుండా పోదు. ఇది అజము, నిత్యము, శాశ్వతము, పురాతనము; శరీరం చంపబడినా, యిది మాత్రం చావదు ]. **(18)**

హన్తా చేన్మన్యతే హన్తుం హతశ్చేన్మన్యతే హతమ్।
ఉభౌ తౌ న విజానీతో నాయం హన్తి న హన్యతే ॥

ఒకవేళ ఎవరైనా హంత (చంపేవ్యక్తి) తాను చంపడానికి సమర్థుడ్నని భావించినా, లేదా ఎవరైనా హతుడు(చంపబడే వ్యక్తి) తాను చంపబడినట్లు భావించినా ఆ ఇద్దరిదీ పొరపాటే వారుభయులూ ఇది (ఈ ఆత్మ) (ఎవరినీ లేక దేనినీ) చంపదు లేదా చంపబడదని ఎరుగరు. [ ఈ భావాన్నే భగవద్గీత, **2**వ అధ్యాయం, **19**వ శ్లోకం లో యిలా వ్యక్తీకరించబడింది : *య ఏనం వేత్తి హన్తారమ్ యశ్చైనం మన్యతే హతమ్। ఉభౌ తౌ న విజానీతో నాయం హన్తి న హన్యతే ॥* - ఈ ఆత్మ చంపుతుందని భావించేవాడు, లేక చంపబడుతుందని ఎంచేవాడు ఉభయులూ అజ్ఞానులే. ఎందుకంటే ఈ ఆత్మ ఒకరిని చంపేదిగాని, లేక ఒకరిచే చంపబడేదిగాని కాదు. ఈ శ్లోకంలో రెండో పాదం, ఈపైనవున్న కఠోపనిషత్తులోని శ్లోకంలోని రెండో పాదం పూర్తిగా ఒకటేననికూడ గమనిస్తాము ] **(19)**

అణోరణీయాన్మహతో మహీయానాత్మాస్య జన్తోర్నిహితో గుహాయామ్ ।
తమక్రతుః పశ్యతి వీతశోకో ధాతుప్రసాదాన్మహిమానమాత్మనః ॥

ఈ జీవాత్మ(జంతువు) హృదయగుహలో నిహితమైవుండే పరమాత్మ అణువుకంటె అతిసూక్ష్మమైనది, మహత్తమమైనది. మరి ఈ పరమాత్మ మహిమను కామనారహితుడు, చింతారహితుడైన ఎవరైనా సాధకుడు ఆ పరబ్రహ్మ కృపవల్లే చూడగల్గుతాడు (ఇంద్రియ నైర్మల్యం వల్ల చూడగల్గుతాడని మరో పాఠం) (20)

ఆసీనో దూరం వ్రజతి శయనో యాతి సర్వతః ।
కస్తం మదామదం దేవం మదన్యో జ్ఞాతుమర్హతి ॥

ఆ పరబ్రహ్మ అచలుడై (కూర్చుని) వుండీ అదే సమయంలో బహుదూరాలకు పయనిస్తూకూడ వుంటాడు శయనిస్తూవుండీ అదే సమయంలో సర్వత్రా తానుగా సంచరిస్తూకూడ వుంటాడు అంతులేని ఐశ్వర్యమదం వున్నా దానితో ఉన్మత్తుడైవుండడు అలాంటి ఆ పరమాత్మను తెలుసుకోగల సమర్థులు నేను తప్ప మరెవరున్నారు ? అంటే ఆ భగవానుని కృపాపాత్రుడైన యమధర్మ రాజు తప్ప మరెవరూ ఆయన్ను తెలుసుకోగల సమర్థులు కారని అర్థం (21)

అశరీరం శరీరేష్వనవస్థేష్వవస్థితమ్ ।
మహాన్తం విభుమాత్మానం మత్వా ధీరో న శోచతి ॥

స్థిరంగా వుండలేని, అంటే వినాశశీలమైన, శరీరాల్లో అశరీరంగా, అవిచల భావంతో స్థితమైవుండే, మహత్తరము, సర్వవ్యాప్తమునైన పరమాత్మను తెలుసుకున్న బుద్ధిమంతుడైన పురుషుడు మరెప్పుడూకూడ కించిన్మాత్రమైనా శోకానికి లోనుకాడు (22)

**నాయమాత్మా ప్రవచనేన లభ్యో న మేధయా న బహునా శ్రుతేన ।**
**యమేవైష వృణుతే తేన లభ్యస్తస్యైష ఆత్మా వివృణుతే తనూం స్వామ్ ॥**

ఈ ఆత్మ (పరబ్రహ్మ) ప్రవచనాలతోగాని, లేక బుద్ధిబలంచేగాని, లేదా బహుళంగా సూక్తులు వినడంవల్లగాని ప్రాప్తమయ్యేదికాదు. కాగా ఆ ఆత్మ తానుగానే ఎవరిని వరిస్తుందో వారికే అది ప్రాప్తిస్తుంది అలాంటి వారిద్వారానే ఆ పరమాత్మను దర్శించడం సాధ్యం కనుక అలా తాను ఏరి కోరినవారికే ఆ పరమాత్మ తన నిజస్వరూపాన్ని ప్రకటంచేస్తుందని గ్రహించాలి **(23)**

**నావిరతో దుశ్చరితాన్నాశాన్తో నాసమాహితః /**
**నాశాన్తమానసో వాపి ప్రజ్ఞానేనైనమాప్నుయాత్ //**

అంతేకాదు కుకర్మలనుండి నివృత్తులుకానివారు, అశాంతిగా వుండేవాళ్లు, మనోనిగ్రహం, ఇంద్రియ సంయమనం లేనివాళ్లు,చంచల మనస్కులు ఎంత బుద్ధికుశలతవున్నా ఆ పరమాత్మను పొందలేకపోతారు **(24)**

**యస్య బ్రహ్మ చ క్షత్రం చ ఉభే భవత ఓదనః ।**
**మృత్యుర్యస్యోపసేచనం క ఇత్థా వేద యత్ర సః ॥**

మనుష్యశరీరుల్లో బ్రాహ్మణులు ధర్మశీలురుగా, క్షత్రియులు ధర్మరక్షకులుగా పేరుపొందివుంటారుగనుక పరమాత్మప్రాప్తికోసం వారు అధిక యోగ్యులని భావించబడుతుంది. కాని వారుసైతం కాలస్వరూపుడైన పరబ్రహ్మ పరమేశ్వరునికి భోజనంగా వుంటారు. అలాంటప్పుడు తక్కిన సాధారణ మానవులదేముంది ? పోతే అందరినీ సంహరించే మృత్యుదేవుడుకూడ ఆ పరమేశ్వరుని భోజనంలో ఒక కూరగాయలా హరించుకుపోతుంటాడు కనుక అంతటి అమేయ శక్తిసంపన్నుడైన పరమాత్మ ఎప్పుడు, ఎక్కడ, ఎలా వుంటాడో సరిగ్గా తెలుసుకోవడం ఎవరికి తరం ? **(25)**

## ద్వితీయ వల్లీ సమాప్తం.

* * * * *

# తృతీయ వల్లీ

రెండో వల్లీలో జీవాత్మ, పరమాత్మ స్వరూపాలను వేరు వేరుగా వర్ణించడం, వాటిని తెలుసుకోవడంద్వారా కలిగే పరబ్రహ్మప్రాప్తి ఫలితంగురించి చెప్పడం జరిగింది అంతేగాక ఆ పరమాత్మ ఏరికోరి ఎంపికచేసుకున్నవారికే ఆ బ్రహ్మజ్ఞానం ప్రాప్తి కాగలదనికూడ స్పష్టంచేయడం జరిగింది. అయితే ఇందుకు వలసిన సాధనాలగురించిన చర్చ లేదు అదే ఈ మూడవ వల్లీ సారాంశం

**ఋతం పిబన్తౌ సుకృతస్య లోకే గుహాం ప్రవిష్టౌ పరమే పరార్ధే।**
**ఛాయాతపౌ బ్రహ్మవిదో వదన్తి పఞ్చాగ్నయో యే చ త్రిణాచికేతాః॥**

ఇక్కడ యమధర్మరాజు పరమాత్మ, జీవాత్మల నిత్యసంబంధాన్ని, నివాస స్థానాలను వివరిస్తున్నాడు ఈ మానవ జన్మ దుర్లభమైనది. సుకృతాలు (శుభ కర్మలు) చేసుకున్న ఫలస్వరూపంగానే మానవ శరీరం లభ్యమౌతుంది అలాంటి మానవ శరీరంలో పరబ్రహ్మ నివాసస్థానం హృదయాకాశమే అందు లోనే బుద్ధిరూపమైన గుహలో దాగి జీవాత్మకూడ నెలకొనివుంటుంది. ఈ పరమాత్మ, జీవాత్మలు రెండూ ఎండా నీడల్లా పరస్పర భిన్నంగానూ, అదే సమయంలో పరస్పరం పెనవేసుకునీనూ, సత్యరసాన్ని తాగుతూ వుంటాయి బ్రహ్మజ్ఞానులైన మహాపురుషులు, అలాగే ముమ్మారు నాచికేతాగ్నిని చయనం చేసే పంచాగ్నిసంపన్నులైన గృహస్థులుకూడ ఈ సత్యాన్నే పలుకుతుంటారు అంటే పరమాత్మ ఎండవంటిదని, సంపూర్ణ ప్రకాశం దానిదని, దాని మూలంగానే నీడవంటి జీవాత్మకు కూడ కొంత వెలుగు లభ్యమౌతుందని విజ్ఞులు వ్యాఖ్యానిస్తారు. **(1)**

**యః సేతురీజానానామక్షరం బ్రహ్మ యత్పరమ్ ।**
**అభయం తితీర్షతాం పారం నాచికేతం శకేమహి ॥**

మరి ఈ పరమాత్మను తెలుసుకోవడానికి, పొందడానికి అత్యుత్తమ సాధనం ఏమిటి ? అందుకోసం పరమాత్మనే ప్రార్థించడమేనట కనుక యము డిలా ప్రార్థిస్తున్నాడు : యజ్ఞయాగాదులు చేసే గృహస్థులకు దుఃఖసముద్రం దాటించే సేతువు(వంతెన) వంటి ఆ నాచికేతాగ్నిని, అలాగే సంసారసముద్రాన్నే దాటాలనుకునే ముముక్షువులకు ఆ అక్షరమైన (అనశ్వరమైన) పరబ్రహ్మ పరమాత్మను తెలుసుకోవడానికి, ప్రాప్తంచేసుకోవడానికి తగిన సమర్థుల మవుదుము గాక అంటే ఆ సామర్థ్యాన్ని మనకు ఆ పరబ్రహ్మ పరమేశ్వరుడే ప్రసాదించు గాక అని అర్థం **(2)**

**ఆత్మానం రథినం విద్ధి శరీరం రథమేవ తు ।**
**బుద్ధిం తు సారథిం విద్ధి మనః ప్రగ్రహమేవ చ ॥**

ఓ నచికేతా ! జీవాత్మను రథి(రథమెక్కి ప్రయాణంచేసే వ్యక్తి)గా భావించు ఇంకా ఈ శరీరమే రథం, బుద్ధి సారథి, మనస్సు పగ్గమని తెలుసుకో **(3)**

**ఇంద్రియాణి హయానాహుర్విషయాంస్తేషు గోచరాన్ ।**
**ఆత్మేంద్రియమనోయుక్తమ్ భోక్తేత్యాహుర్మనీషినః ॥**

ఇంకా ఇంద్రియాలు గుర్రాలని, విషయాలు అవి (ఇంద్రియాలు) చరించే మార్గాలని, మరి ఈ ఆత్మ, ఇంద్రియాలు, మనస్సు - మూడింటితోనూ కూడుకునివుండే జీవాత్మయే భోక్త అనికూడ విజ్ఞులు చెబుతుంటారు. **(4)**

**యస్త్వవిజ్ఞానవాన్ భవత్యయుక్తేన మనసా సదా ।**
**తస్యేంద్రియాణ్యవశ్యాని దుష్టాశ్వా ఇవ సారథేః ॥**

ఎవరైతే ఎల్లప్పుడూ వివేకహీన బుద్ధితోనూ, వశంకాని(చంచల) మనస్సుతోనూ వుంటారో, వారి ఇంద్రియాలు పరాకు సారధి యొక్క దుష్టాశ్వాల (మకురు గుర్రాల) మాదిరిగా అదుపులోలేకుండా(వశంకాకుండా) పోతాయి **(5)**

**యస్తు విజ్ఞానవాన్ భవతి యుక్తేన మనసా సదా।**
**తస్యేన్ద్రియాణి వశ్యాని సదశ్వా ఇవ సారథేః ॥**

అయితే ఎవరైతే ఎల్లప్పుడూ వివేకబుద్ధికలిగి, మనస్సును వశంచేసుకుని వుంటారో అలాంటివారి ఇంద్రియాలు జాగరూకతగల మంచి సారథి చేతికింద వుండే మంచి గుర్రాల్లా అదుపులో వుంటాయి. (6)

**యస్త్వవిజ్ఞానవాన్ భవత్యమనస్కః సదాశుచిః।**
**న స తత్పదమాప్నోతి సంసారం చాధిగచ్ఛతి ॥**

ఎవరైతే సదా వివేకహీన బుద్ధితో, అసంయతచిత్తం (అదుపులోలేని మనస్సు)తో, అశుభ్రంగా (అపవిత్రంగా) వుంటారో వారెన్నడూ ఆ పరమ పదాన్ని పొందజాలరు కాకపోగా (దారితప్పి) (జనన-మరణ) సంసారచక్రంలో సదా భ్రమిస్తూ వుంటారు. (7)

**యస్తు విజ్ఞానవాన్ భవతి సమనస్కః సదా శుచిః।**
**స తు తత్పదమాప్నోతి యస్మాద్ భూయో న జాయతే ॥**

కాని ఎవరైతే సదా వివేకబుద్ధితో, సంయతచిత్తంతో, శుచిగా వుంటారో వారైతే ఆ పరమపదాన్ని చేరుకుంటారు ఇక అక్కడినుండి తిరిగిరారు. మళ్లీ జన్మ ధరించరు (8)

**విజ్ఞానసారథిర్యస్తు మనఃప్రగ్రహవాన్నరః।**
**సోఽధ్వనః పారమాప్నోతి తద్విష్ణోః పరమం పదమ్ ॥**

ఎవరైతే వివేకబుద్ధి అనే సారథిని కలిగి, మనస్సనే పగ్గాన్ని గట్టిగా తన అదుపులో పట్టుకుని వుంటాడో అతడు సంసార సముద్రం దాటి, ఆవలిదరి చేరగల్గుతాడు. పరబ్రహ్మ పరమేశ్వరుని ఆ ప్రసిద్ధ పరమపదాన్ని చేరుకో గల్గుతాడు (9)

3 నుండి 9 శ్లోకాలదాకా - ఈ ఏడు మంత్రాలలో రథం పరిబాషలో తత్వరహస్యాలు వెల్లడించడం జరిగింది మానవశరీరమనే సువ్యవస్థిత రథం జీవాత్మకు అతికష్టంమీద లభిస్తుంది. మరి ఇటువంటి రథంలో సరియైన సారధి (బుద్ధి)తో, (మనస్సు అనే) పగ్గంపై చక్కని అదుపుతో సంచరించకుంటే ఈ మానవ జన్మకు నిష్కృతి లేదు సదా అవివేక బుద్ధిరూపంలోని అసమర్థ సారధివేలి పగ్గాలకు లొంబడక అదుపుతప్పి చరించే దుష్టాశ్వాలమాదిరిగా దారి తప్పి ఇటూ అటూ దిక్కుతోచక తిరుగుతూ వుండాల్సివస్తుందంతే గాని జీవాత్మ ఎప్పుడూ ఆ పరమ పదాన్ని చేరుకోలేదు కనుక ఈ జనన మరణ చక్రం అంతంకాదు అందువల్ల బుద్ధివివేకంతో, మనస్సనే పగ్గాన్ని సరిగ్గా, గట్టిగా పట్టుకుని ఇంద్రియాలనే అశ్వాలను అదుపులోవుంచుకుంటేనే విమోచన సాధ్యం. అప్పుడే ఆ పరబ్రహ్మ పరమసన్నిధిని చేరుకోవడం సాధ్యమని చెప్పబడింది

**ఇంద్రియేభ్యః పరా హ్యర్థా అర్థేభ్యశ్చ పరం మనః ।**
**మనసస్తు పరా బుద్ధిర్బుద్ధేరాత్మా మహాన్ పరః ॥**

ఎందుకంటే ఇంద్రియాలకంటె అర్థాలు (శబ్దాది విషయాలు) బలవత్తరమైనవి శబ్దాది విషయాలకంటె మనస్సు ప్రబలమైనది మరి మనస్సుకంటె కూడ బుద్ధి శక్తివంతమైనది బుద్ధికంటెకూడ జీవాత్మ అత్యంత శ్రేష్ఠము, బలవత్తరమునైనది **(10)**

**మహతః పరమవ్యక్తమవ్యక్తాత్పురుషః పరః ।**
**పురుషాన్న పరం కించిత్సా కాష్ఠా సా పరా గతిః ॥**

ఆ జీవాత్మకంటె భగవంతుని మాయ (అవ్యక్తం) బలీయమైనది ఆ అవ్యక్త మాయకంటె పరమ పురుషుడు (స్వయంగా పరమేశ్వరుడు) అతి బలీయుడు, శ్రేష్ఠుడు ఆ పరమపురుషునికంటె శ్రేష్ఠము, బలవత్తరమైనది ఇంకేదీ లేదు. అదే (అతడే) అన్నింటికీ పరమావధి; అతడే అన్నింటికీ చరమగతి ఇక్కడ మాయ అంటే భగవద్గీతలో పేర్కొన్న త్రిగుణసంపన్న దైవిక మాయ అని గ్రహించాలి గీత,

7వ అధ్యాయమైన విజ్ఞాన యోగంలోని 13, 14 శ్లోకాలు ఈ దైవిక మాయగురించి యిలా చెబుతున్నాయి · *త్రిభిర్గుణమయైర్భావై రేభిస్సర్వమిదం జగత్ । మోహితం నాభిజానాతి మామేభ్యః పరమవ్యయమ్ ॥ – దైవీ హ్యేషా గుణమయీ మమ మాయా దురత్యయా । మామేవ యే ప్రపద్యంతే మాయామేతాం తరంతి తే ॥* అంటే, ఈ ప్రపంచ మంతా సాత్విక, రాజస, తామస భావాల భ్రమలో(మాయలో) వుండడం వలన వీటికి అతీతంగా, అవ్యయంగా వుండే నన్ను ప్రజలు తెలుసుకోలేరు నా యోగ మాయ త్రిగుణాత్మకమైనది, దివ్యమైనది, దాట శక్యంకానిది నన్ను శరణు వేడి, నన్నాశ్రయించే వారే ఈ నా మాయను అతిక్రమించగలరు **(11)**

ఈ 10-11 మంత్రాలకు కొందరు ఈ కింది విధంగాకూడ భాష్యం చెబుతారు ఇంద్రియాలకు అధిష్టాన దేవతలు సోముడు, కుబేరుడు, సూర్యుడు, వరుణుడు, అశ్వినీ దేవతలు, అగ్ని, ఇంద్రుడు, జయంతుడు, యముడు, దక్షుడు. మరి ఈ అర్ధాలకు (విషయాలకు) అధిష్టాన దేవతలు సౌపర్ణి (శబ్దం, స్పర్శలకు), వారుణీ(రూప, రసాలకు) మరియు ఉమ (గంధానికి అంటే వాసనకు)లు ఈ అర్థాధిష్టాత్రీ దేవతలు ఇంద్రియాధిష్టాత్రీ దేవతలకంటె శ్రేష్టులు. వీరికంటె మనస్సుకు అధిష్టాన దేవతలైన రుద్రుడు, వీంద్రుడు (పక్షిరాజైన గరుడుడు), (ఆది) శేషుడు శ్రేష్టులు ఈ మనోదేవతలకంటె బుద్ధికి అధిష్టానదేవియైన సరస్వతి శ్రేష్ఠమైనది సరస్వతికంటెకూడ మహత్తత్వానికి అధిష్టాన దేవుడైన బ్రహ్మ శ్రేష్టుడు బ్రహ్మకంటెకూడ అవ్యక్త (మాయ)యొక్క అధిష్టానదేవి అయిన శ్రీ లేక రమ శ్రేష్ఠమైనది ఆమెకంటె పురుషశబ్దవాచ్యుడైన విష్ణువు శ్రేష్టుడు. శ్రీవిష్ణువు పరిపూర్ణుడు, ఆయనకు సాటి ఎవరూ లేరు అలాంటప్పుడు ఆయనకంటె శ్రేష్టుడు అనే ప్రసక్తే రాదుగదా ఇది తర్వాతి కాలంలో శ్రీవైష్ణవులు పనిగట్టుకుని అల్లిన భాష్యమని భావించాల్సి వస్తున్నది

ఏష సర్వేషు భూతేషు గూఢోత్మా న ప్రకాశతే ।
దృశ్యతే త్వగ్ర్యయా బుద్ధయా సూక్ష్మయా సూక్ష్మదర్శిభిః ॥

ఈ ఆత్మ (ఈ అన్నింటిలో ఆత్మస్వరూపంలోవుండే పరమపురుషుడు) సమస్త ప్రాణుల్లోనూ నిహితమైవుండేటప్పటికీ, తన యోగమాయ తెరవెనుక దాగివుండడంవల్ల, అందరికీ ప్రత్యక్షంకాదు కేవలం సూక్ష్మవిషయాలను అర్థం

వేసుకోగల (దైవకృపచే) తమ బుద్ధిని అతిసూక్ష్మము, తీక్ష్ణంగా మలుచుకున్న వారు మాత్రమే ఈ (పరమ)ఆత్మను దర్శించగలుగుతారు **(12)**

**యచ్ఛేద్వాఙ్మనసీ ప్రాజ్ఞస్తద్యచ్ఛేజ్జ్ఞాన ఆత్మని ।**
**జ్ఞానమాత్మని మహతి నియచ్ఛేత్తద్యచ్ఛేచ్ఛాన్త ఆత్మని ॥**

ప్రాజ్ఞులైనవారు వాక్కు, మొదలైన సమస్త ఇంద్రియాలను మనస్సుకు అధీనంగా చేసుకోవాలి. మరి ఆ మనస్సును జ్ఞానస్వరూప బుద్ధిలో విలీనం చేయాలి. ఆ జ్ఞానస్వరూప బుద్ధిని మహత్తరమైన ఆత్మలో విలీనంగావించాలి. ఆ జీవాత్మను శాంతస్వరూప పరబ్రహ్మ పరమాత్మలో విలీనం గావించాలి. **(13)**

**ఉత్తిష్ఠత జాగ్రత ప్రాప్య వరాన్నిబోధత ।**
**క్షురస్య ధారా నిశితా దురత్యయా దుర్గం పథస్తత్కవయో వదన్తి ॥**

ఓ మానవుడా ! (జన్మజన్మాంతర అజ్ఞాన నిద్రనుండి) లెమ్ము ! మేల్కొనుము ! ఈ పరబ్రహ్మ తత్వజ్ఞానమార్గం అతి తీక్ష్ణము, దుస్తరమని, ఆ ప్రయత్నం అసిధార వ్రతంవంటిదని త్రికాలజ్ఞులైన మహాపురుషులు చెబుతుంటారు. ఇంతటి దుర్గమ జ్ఞానసాధనకోసం నీవు బ్రహ్మజ్ఞానం పొందివున్న మహానుభావులవద్దకు వెళ్లి వారిద్వారా ఆ పరబ్రహ్మతత్వాన్ని తెలుసుకొమ్ము **(14)**

**అశబ్దమస్పర్శమరూపమవ్యయం తథారసం నిత్యమగన్ధవచ్చ యత్ ।**
**అనాద్యనన్తం మహతః పరం ధ్రువం నిచాయ్య తన్మృత్యుముఖాత్ప్రముచ్యతే ॥**

బ్రహ్మజ్ఞాన ప్రాప్తి ఎందుకంత దుస్తరమో ఈ శ్లోకంలో సంకేతమాత్రంగా చెప్పబడింది. ఏదైతే శబ్ద, స్పర్శ, రూప, రస, గంధ రహితమో, ఏదైతే అనశ్వరము, నిత్యము, అనాది, అనంతము, మహత్తరమైన ఆత్మ (జీవాత్మ)కంటెకూడ శ్రేష్ఠము, సర్వదా సత్యతత్వమో ఆ పరమాత్మను తెలుసుకొనడంద్వారా మనుషులు శాశ్వతంగా మృత్యుముఖంనుండి బయటపడిపోతారు అంటే ప్రాపంచిక విషయాలను గ్రహించే ఇంద్రియాలకు అతీతమైన, నిత్యసత్యతత్వమైన బ్రహ్మజ్ఞానప్రాప్తివల్ల మానవుడు జనన మరణ చక్రంనుండి తప్పించుకొని మోక్షం సాధించగలుగుతాడని అర్థం. **(15)**

**నాచికేతముపాఖ్యానం మృత్యుప్రోక్తం సనాతనమ్ ।**
**ఉక్త్వా శ్రుత్వా చ మేధావీ బ్రహ్మలోకే మహీయతే ॥**

ఇలా యమధర్మరాజు ఉపదేశించిన సనాతనమైన నాచికేతోపాఖ్యానాన్ని చెప్పడంవల్ల లేక వినడంద్వారా, బుద్ధిమంతులు బ్రహ్మలోకం పొంది మహిమాన్వితులౌతారు **(16)**

**య ఇమం పరమం గుహ్యం శ్రావయేద్ బ్రహ్మసంసది ।**
**ప్రయతః శ్రాద్ధకాలే వా తదానన్త్యాయ కల్పతే**
**తదానన్త్యాయ కల్పత ఇతి ॥**

ఈ పరమగుహ్యమైన (నిగూఢమైన) తాత్త్విక ప్రసంగాన్ని ఏ మనుష్యుడైతే సర్వదా విశుద్ధుడై, వివేచనాత్మక దృష్టిగల బ్రాహ్మణుల సభలో వినిపిస్తాడో, లేదా శ్రాద్ధకాలంలో (తద్దినాలలో) భోజనాలుచేసే బ్రాహ్మణులకు వినిపిస్తాడో అతనికి ఈ ఉపాఖ్యాన వర్ణనా కార్యంవల్ల అనంత శుభఫలాలు లభిస్తాయి నిశ్చయంగా ఇలాంటి ఉపాఖ్యాన వివరణ అనంత ఫలాలు చేకూర్చే సామర్థ్యం కలిగివుంటుంది **(17)**

## తృతీయ వల్లీ సమాప్తం.

# ప్రథమ అధ్యాయం సమాప్తం.

* * *

# ద్వితీయ అధ్యాయం

## ప్రథమ వల్లీ

పరబ్రహ్మ సకల ప్రాణుల్లోనూ నిహితమైవుంటాడుగాని అందరికీ అయితే కనపడడు. అరుదుగా ఎవరో కొంతమంది విలక్షణ వ్యక్తులకు మాత్రమే ఆ పరబ్రహ్మ దర్శనం సాధ్యం అని ప్రథమాధ్యాయం, తృతీయ వల్లీలో చెప్పబడింది మరి అందరి హృదయాల్లోనూ బ్రహ్మ వుండేటప్పుడు యిలా అరుదుగా ఎవరో కొందరు విలక్షణ వ్యక్తులకుమాత్రమే దర్శనభాగ్యం లభిస్తుంది ఎందుచేత, బుద్ధిరూప నేత్రాలద్వారా అందరూ వీక్షించలేకపోవడం ఎందుచేత అనే ప్రశ్నలకు సమాధానాలు యిచ్చే ప్రయత్నం ఈ వల్లీలో మనకు అగుపిస్తుంది

**పరాఞ్చి ఖాని వ్యతృణత్స్వయంభూస్తస్మాత్పరాఙ్పశ్యతి నాన్తరాత్మన్।**
**కశ్చిద్ధీరః ప్రత్యగాత్మనమైక్షదావృత్తచక్షురమృతత్వమిచ్ఛన్॥**

స్వయంభువు అయిన పరబ్రహ్మ సమస్త ఇంద్రియాలను బాహ్యముఖంగా చేసివున్నాడు. కనుక మనిషి తన ఇంద్రియాలద్వారా సర్వసాధారణంగా బాహ్యవస్తువులనే చూచి/ అనుభూతిచెంది వాటిగురించి తెలుసుకుంటాడుగాని వాటిని లోనికి మరల్చి అంతరాత్మను వీక్షించి, తెలుసుకొనడమనేది సర్వసాధారణంగా జరగదు. అరుదుగా ఎవరో కొందరు అదృష్టవంతులు, బుద్ధిమంతులైన వ్యక్తులుమాత్రమే అమృతత్వం( అమర పదం) పొందే కోరికతో తన కళ్లు, చెవులు మొదలైన ఇంద్రియాల లక్ష్యాన్ని బాహ్యవస్తువులనుండి తప్పించి, లోనికి మరల్చి, అంతరాత్మపై కేంద్రీకరించి, దాన్ని తెలుసుకొన గలిగారు. (1)

**పరాచః కామాననుయన్తి బాలస్తే మృత్యోర్యన్తి వితతస్య పాశమ్।**
**అథ ధీరా అమృతత్వం విదిత్వా ధ్రువమధ్రువేష్విహ న ప్రార్థయన్తే॥**

అయితే ఎవరైతే మూర్ఖులు కేవలం బాహ్యవిషయాలపైనే, అంటే ఐహిక సుఖభోగాలపైనే, వ్యామోహంకలిగి, వాటిలోనే నిమగ్నమైవుంటారో, వారు ఎల్లెడలా వ్యాపించివున్న మృత్యుపాశంలో చిక్కుకుని వెలువడలేకుండా సతమత మౌతుంటారు. కాని వివేకవంతులైతే నిత్యసత్యమైన ఆ అమరపదాన్నే తమ వివేక బుద్ధిద్వారా కాంక్షిస్తూ, దానికోసమే కృషి చేస్తూ, ఈ ప్రపంచంలోని అనిత్యమైన సుఖభోగాలను కాంక్షించకుండా, వాటిపట్ల విరక్తులై వుంటారు (2)

**యేన రూపం రసం గన్ధం శబ్దాన్స్పర్శాంశ్చ మైథునాన్।**
**ఏతేనైవ విజానాతి కిమత్ర పరిశిష్యతే। ఏతద్వై తత్ ॥**

ఎవరి (దేని) (అనుగ్రహం) వల్ల మనిషి శబ్ద, స్పర్శ, రూప, రస, గంధాది ఇంద్రియగ్రాహ్య విషయాలను, భోగాలను, యింకా స్త్రీసహవాస సంజనిత లైంగిక సుఖాలను పొందుతాడో, వారి (దాని) (అనుగ్రహం) వల్లే తిరిగి యివన్నీ క్షణభంగురాలేగదా, నశ్వరాలేగదా, మరి యివన్నీ నశించినా యింకా మిగిలి వుండేదేమిటి అనే యోచనలో పడుతాడు వీటన్నిటికీ కారణభూతమైన బ్రహ్మతత్వంమాత్రమే నిత్యము, అనశ్వరము, అజరామరమని, ఈ అన్నింటిలోనూ నశించకుండా మిగిలివుండేది, అన్నింటి పర్యవసానం, అన్నింటికీ పరమావధి, అన్నింటికీ పరమగతి ఈ పరబ్రహ్మతత్వమేనని తెలుసుకోవాలి (3)

**స్వప్నాన్తం జాగరితాన్తం చోభౌ యేనానుపశ్యతి।**
**మహాన్తం విభుమాత్మానం మత్వా ధీరో న శోచతి॥**

కలల్లోనూ, మేల్కొనివున్నప్పుడూ వివిధ దృశ్యాలను (స్వప్నదృశ్యాలు, వాస్తవ దృశ్యాలు రెంటినీ) దేని (అనుగ్రహం) ద్వారా మనిషి పదే పదే చూస్తుంటాడో,

ఆ సర్వశ్రేష్ఠమైన, సర్వవ్యాప్తమైన, సర్వాంతర్యామి పరమాత్మను తెలుసు కున్నప్పుడు బుద్ధిమంతులు ఏ కారణంగానే గాని, కించిన్మాత్రమైనా శోకం లేకుండా ధీరులై వుంటారు [ కొందరు దీనికి మరొకవిధమైన వివరణకూడ యిస్తారు నిద్ర, జాగ్రదవస్థల అంతాలలో, అంటే నిద్ర మేల్కొన్నతర్వాత, అలాగే నిద్రపోయేముందు ఎవరైతే సర్వబాధ్యతలు ఆ పరమాత్మపైనే వుంచి, సర్వాంతర్యామి అయిన ఆ పరమాత్మనే ధ్యానంచేసి, తెలుసుకోగోరుతారో అలాంటి ధీరులకు శోకమనేదే వుండదు] **(4)**

**య ఇమం మధ్వదం వేద ఆత్మానం జీవమన్తికాత్ ।**
**ఈశానం భూతభవ్యస్య న తతో విజుగుప్సతే । ఏతద్వై తత్ ॥**

కర్మఫలదాత, సర్వులకు జీవనప్రదాత, భూత భవిష్యద్ వర్తమానాలను శాసించే కర్త అయిన ఈ పరమాత్మ తనకు అతిసమీపంలో (అంటే అంతర్యామిగా తనలోనే) వున్నట్లు ఎవరైతే తెలుసుకుంటారో వారికి యితరులపై ఘృణ వుండదు, పరులను నిందించబోరు కనుక, ఓ నచికేతా ! నీవు తెలుసుకోగోరిన బ్రహ్మతత్వం యిదేనని గ్రహించవల్సింది **(5)**

**యః పూర్వం తపసో జాతమద్భ్యః పూర్వమజాయత ।**
**గృహాం ప్రవిశ్య తిష్ఠన్తం యో భూతేభిర్వ్యపశ్యత ॥ ఏతద్వై తత్ ॥**

ఎవరైతే నీటినుండి పంచభూతాలు ఉద్భవించడానికిముందే (హిరణ్యగర్భుని రూపంలో) ప్రకటమయ్యాడో, సమస్తచరాచర వస్తుజాలానికంటె పూర్వమే ఎవరైతే స్వయంసంకల్పంచే తనంత తానుగా ప్రకటమయ్యాడో, అలా ప్రకటమయి ఎవరైతే జీవాత్మలతోబాటుగా హృదయగుహల్లో నిహితమై వుంటున్నాడో ఆ పరమాత్మను అలా ఉత్పన్నమైనట్లు ఎరిగి, ఎవరైతే వీక్షిస్తారో వారే ఆ బ్రహ్మను నిజంగా తెలిసినవారు. అలా తెలుసుకోబడ్డ తత్వమే నీవు తెలుసుకోగోరే పరబ్రహ్మతత్వం. **(6)**

**యా ప్రాణేన సంభవత్యదితిర్దేవతామయీ।**
**గుహాం ప్రవిశ్యతిష్ఠన్తీం యా భూతేభిర్వ్యజాయత॥ ఏతద్వై తత్॥**

ఏదైతే దేవతామయి అదితి ప్రాణాలతోబాటుగా ఉత్పన్నమవుతుందో, ఏదైతే సకల ప్రాణులతోబాటుగా ఉత్పన్నమయిందో, అలా ఉత్పన్నమయి హృదయ గుహలో ప్రవేశించి నెలకొనివుంటుందో, ఆ పరబ్రహ్మను చూచినవాడే యథార్థంగా బ్రహ్మతత్వం ఎరిగినవాడు (జననిలా సర్వదేవతలను సృష్టించడం వల్ల సర్వదేవతామయిగాను, శబ్దాది సమస్త భోగవిషయాలను అదనం - భక్షణం - చేయడంద్వారా అదితిగాను పేరుగాంచిన బ్రహ్మతత్వమని ఒక వ్యాఖ్య) నీవు తెలుసుకోగోరే బ్రహ్మతత్వమదే **(7)**

**అరణ్యోర్నిహితో జాతవేదా గర్భ ఇవ సుభృతో గర్భిణీభిః।**
**దివే దివ ఈడ్యో జాగృవద్భిర్హవిష్మద్భిర్మనుష్యేభిరగ్నిః॥ ఏతద్వై తత్॥**

ఒక గర్భిణీ స్త్రీ గర్భంలో నిక్షిప్తమై, ఆమెచే అవసరమైన అన్నపానాది పదార్థాలచే పరిపుష్టమై, ప్రసవకాలపు క్లేశంద్వారామాత్రమే ప్రకటమయ్యే (పిండరూప) శిశువులా (అధర, ఉత్తర అనే మీది, కింది) అరణుల్లో (నిప్పురాజేసే కట్టెముక్కల్లో) నిక్షిప్తమై, ఉపాసకుడు జాగరూకతతో, శ్రద్ధగా స్తుతిస్తూ మంధనం చేసినప్పుడు మాత్రమే ప్రకటమయ్యే జాతవేదుడైన (సర్వజ్ఞుడైన) అగ్ని, తదనంతరం ఆజ్యము మొదలైన వివిధ హవనవస్తువులచే అనుదినమూ సంతృప్తిపర్చబడే ఆ అగ్నియే అది (పరబ్రహ్మ) అని తెలుసుకోవాలి. ఓ నచికేతా! నీవు తెలుసుకోగోరే బ్రహ్మతత్వమదే. **(8)**

**యతశ్చోదేతి సూర్యోఽస్తం యత్ర చ గచ్ఛతి।**
**తం దేవాః సర్వే అర్పితాస్తదు నాత్యేతి కశ్చన॥ ఏతద్వై తత్॥**

ఎక్కడనుండైతే సూర్యుడు ఉదయిస్తాడో, తిరిగి ఎక్కడైతే సూర్యుడు అస్తమిస్తాడో అదే బ్రహ్మ దేవతలంతా ఈ బ్రహ్మలోనే వుంటారు. ఈ పరబ్రహ్మను ఎవరో గాని ఎప్పుడోగాని దాట లేరు ఓ నచికేతా! నీవు తెలుసుకోగోరే బ్రహ్మతత్వమిదే. **(9)**

**యదేవేహ తదముత్ర యదముత్ర తదన్విహ।**
**మృత్యోః స మృత్యుమాప్నోతి య ఇహ నానేవ పశ్యతి ॥**

ఏదైతే ఇక్కడ (ఈ లోకంలో) వుందో అదే (అంటే ఆ పరబ్రహ్మ) అక్కడ (పరలోకంలో - దేవగంధర్వాదుల లోకంలో) కూడ వుంది. అక్కడ ఏదైతే (ఏ బ్రహ్మయితే) వుందో అదే యిక్కడ (ఇహలోకంలో) కూడ వుంది. కనుక యిక్కడా అక్కడా ప్రతిచోటా ఒకే పరబ్రహ్మ అంతర్యామిగా వ్యాపించివుందని తెలుసుకోవాలి ఇది గ్రహించలేక దానిని నానావిధమైనదిగా, అనేకంగా భావించి భ్రమించే మానవుడు మృత్యువునుండి మృత్యువుకూగా సాగిపోతూనే వుంటాడు (అంటే జనన మరణ చక్రం నుండి బయటపడలేక కొట్టుమిట్టాడుతుంటాడని అర్థం). **(10)**

**మనసైవేదమాప్తవ్యం నేహ నానాస్తి కించన।**
**మృత్యోః స మృత్యుం గచ్ఛతి య ఇహ నానేవ పశ్యతి ॥**

మనస్సుతోమాత్రమే యిది ఆప్తం (ప్రాప్తయోగ్యం) కాగలదు. ఈ లోకంలో పరమాత్మకు భిన్నంగా నానాత్వమేదీ లేదు కనుక ఎవరైతే ఈ ప్రపంచంలో నానాత్వాన్ని మాత్రమే చూచి అందులోని ఏకత్వాన్ని (బ్రహ్మను) గ్రహించలేకపోతారో అలాంటివారు మాటిమాటికీ మృత్యువునుండి మృత్యువుకూగా సాగిపోతుంటారు, అంటే, జనన మరణ చక్రం నుండి బయటపడలేక కొట్టుమిట్టాడుతుంటారు. **(11)**

**అఙ్గుష్ఠమాత్రః పురుషో మధ్య ఆత్మని తిష్ఠతి।**
**ఈశానో భూతభవ్యస్య న తతో విజుగుప్సతే ॥ ఏతద్వై తత్ ॥**

బొటనవేలంతమాత్రం పరిమాణంలో పరమ పురుషుడు (పరబ్రహ్మ) జీవాత్మ మధ్యభాగంలో (అంటే హృదయప్రదేశంలో) నెలకొనివుంటాడు. ఇలాంటి భూత భవిష్యద్ వర్తమానాలను శాసించే ఆ పరబ్రహ్మను తెలుసుకున్నవాడు యిక ఎవరినీ నిందించడు(ఎందుకంటే అందరి హృదయప్రదేశాల్లోనూ పరబ్రహ్మ నెలకొని వుంటాడనే గ్రహింపు వుంటుంది గనుక). ఓ నచికేతా! నీవు తెలుసుకోగోరే బ్రహ్మ తత్వమిదే. **(12)**

**అఙ్గుష్ఠమాత్రః పురుషో జ్యోతిరివాధూమకః।**
**ఈశానో భూతభవ్యస్య స ఏవాద్య స ఉ శ్వః॥ ఏతద్వై తత్॥**

అంగుష్ఠమాత్ర పరిమాణంగల ఆ పరమపురుషుడు( పరబ్రహ్మ) పొగలేని దీపంలా వెలిగిపోతూంటాడు. భూత భవిష్యద్ వర్తమానాలను శాసించే ఈ పరబ్రహ్మ నిన్న, నేడు, రేపు ఎల్లప్పుడూకూడ వున్నాడు అంటే, పర బ్రహ్మ నిత్యము, సనాతనము, శాశ్వతము నని అర్థం ఓ నచికేతా! నీవు తెలుసుకోగోరే బ్రహ్మతత్వమిదే. **(13)**

**యథోదకం దుర్గే వృష్టం పర్వతేషు విధావతి।**
**ఏవం ధర్మాన్ పృథక్పశ్యంస్తానేవానువిధావతి॥**

పర్వతశిఖరంపై కురిసిన వాననీళ్లు అక్కడనుండి కిందకు పారి నలుదిక్కులా పాయలు పాయలుగా చెదిరి ప్రవహిస్తాయి అలాగే ఒక్కడే అయిన పరబ్రహ్మ కూడ దేవతలు, అసురులు, మనుష్యులు యిలా వివిధ జాతులుగా విడివడి కనిపిస్తుంటాడు అయితే ఈ నానారూప జాతులే పరమావధిగా భావించి, ఏకము, నిత్యమైన పరబ్రహ్మను తెలుసుకోలేనివారు చెదిరిన నీటిపాయల వెంబడి పరుగెత్తే వ్యక్తులలాగే వివిధ జాతుల్లో భ్రమిస్తూ వుంటారు, అంటే వివిధ జన్మలెత్తుతూ జనన మరణ చక్రంలో చిక్కుకునే వుంటారుగాని శిఖరాగ్రాన్ని (పరబ్రహ్మను) ఎరుగలేరు; చేరుకోలేరు. **(14)**

**యథోదకం శుద్ధే శుద్ధమాసిక్తం తాదృగేవ భవతి।**
**ఏవం మునేర్విజానత ఆత్మా భవతి గౌతమ॥**

అయితే అదే నీరు నిర్మల జలాల్లో కురిస్తే అది అటూ యిటూ చెదిరి పారడమంటూ వుండదు. అది వెంటనే నిర్మల జలమై పూర్వప్రవాహంలోనే కలిసి పారుతుంది అదేవిధంగా, గౌతమవంశజుడైన ఓ నచికేతా ! ఈ సర్వ లోకాల్లో వున్నది ఒకే పరబ్రహ్మ అని తెలుసుకున్న ముని (ప్రాపంచిక విషయాలకు అతీతంగా ఎదిగిన ధ్యానశీలి) ఆత్మ కూడ వెంటనే పరబ్రహ్మను ప్రాప్తం చేసుకుంటుంది. **(15)**

**ప్రథమ వల్లీ సమాప్తం.**

* * * * *

# ద్వితీయ వల్లీ

**పురమేకాదశద్వారమజస్యావక్రచేతసః।**
**అనుష్ఠాయ న శోచతి విముక్తశ్చ విముచ్యతే॥ ఏతద్వై తత్॥**

ఏకాదశద్వారాలుగల ఈ మనుష్యశరీరం సర్వవ్యాపి, అవినాశి, అజన్ముడైన సరళ, విశుద్ధజ్ఞానస్వరూపుడైన ఆ పరబ్రహ్మ వసించే నగరంవంటిది. రెండు కళ్ళు, రెండు చెవులు, రెండు ముక్కుపుటాలు, ఒక నోరు, బ్రహ్మరంధ్రం, బొడ్డు, గుదద్వారం, శిశ్నం అనే పదకొండు రంధ్రాలుగల మానవశరీరం పరబ్రహ్మ నివసించే రాజధానీనగరం వంటిదని భావించాలి ఈ రహస్యాన్ని తెలుసుకుని మానవశరీరంలోవుంటూనే ఐహిక సుఖభోగాలు త్యజించి ఆ పరబ్రహ్మను ఉపాసించే మనిషి (జీవాత్మ) ఎన్నడూ శోకపీడితుడు కాడు శోకకారకమైన సంసార బంధనాల నుండి విముక్తుడై మోక్షం పొందుతాడు. ఓ నచికేతా! నీవు తెలుసుకోగోరిన బ్రహ్మతత్త్వమిదే **(1)**

**హంసః శుచిషద్వసురన్తరిక్షసద్ధోతా వేదిషదతిథిర్దురోణసత్।**
**నృషద్వరసదృతసద్వ్యోమసదబ్జా గోజా ఋతజా అద్రిజా ఋతం బృహత్॥**

ఎవరైతే ప్రాకృతిక గుణాలకన్నిటికీ అతీతంగా విశుద్ధ పరమధామంలో స్వయంప్రకాశంతో విరాజిల్లుతుంటాడో ఆ పరబ్రహ్మయే అంతరిక్షంలో చరించే వసువు (అనే పేరుగల దేవుడు); ఆ పరబ్రహ్మే ఇళ్ళకు విచ్చేసే అతిథిస్వరూపుడు, అతడే యజ్ఞంలో రగిలే జ్యోతిర్మయమైన అగ్ని; అతడే యజ్ఞవేదిపై కూర్చొని, ఆ అగ్నిలో ఆజ్యం, యితర హవనసామగ్రి వేస్తూ యజ్ఞంచేసే హోత; సమస్తమానవుల్లో వసించేవాడు, మానవులకంటె శ్రేష్ఠులైన దేవతల్లోకూడ వసించేవాడు, సత్యంలో వసించేవాడు, ఆకాశంలో నెలకొని వుండేవాడు, నీటిలో చేపలు, తాబేళ్లు, శంఖులు తదాదిరూపాల్లో వసించేవాడు, భూమిపై చెట్లుచేమలు, జంతువులు, తదితర రూపాల్లో వసించేవాడు, పర్వతాల్లోనూ, నదీనదాలరూపంలోనూ వసించేవాడు, యజ్ఞాది సత్కర్మల ఫలాలరూపంలో వసించేవాడు ఆ పరబ్రహ్మే ఏ దృష్టితోచూచినా ఈ సృష్టిలోని సకల చరాచర వస్తుజాలంకంటె, తక్కిన అన్ని అస్తిత్వాలకంటె శ్రేష్ఠమైన, మహత్తరమైన, పరమసత్యమైన తత్త్వమదే **(2)**

**ఊర్ధ్వం ప్రాణమున్నయత్యపానం ప్రత్యగస్యతి।**
**మధ్యే వామనమాసీనం విశ్వే దేవా ఉపాసతే॥**

ఎవరైతే ప్రాణాన్ని పైభాగానికి ఎత్తిపంపుతూ, అపానాన్ని కిందిభాగానికి పడనెట్టుతూ, తాను వామనరూపంలో శరీరమధ్యభాగంలో కూర్చునివుంటాడో, అనగా మానవశరీరంలోని హృదయస్థలంలో పీఠంవేసుకుని శరీర కర్మక్రియ లన్నింటినీ చక్కగా నిర్వహింపజేసే - ప్రాణాన్ని పైభాగానికి సరఫరాచేసి, అపానాన్ని కిందిభాగానికి పడదోసే - ఆ అంగుష్ఠమాత్ర పరబ్రహ్మను సర్వ దేవతలూ ఉపాసిస్తారు (3)

**అస్య విస్రంసమానస్య శరీరస్థస్య దేహినః।**
**దేహాద్విముచ్యమానస్య కిమత్ర పరిశిష్యతే॥ ఏతద్వై తత్॥**

ఒక శరీరంనుండి యింకొక శరీరానికి వెళ్ళిపోతూండే జీవాత్మ ఈ శరీరంలో కొంతకాలం వున్నపిదప ఈ దేహాన్ని వీడి వెళ్ళిపోతే ఆ తర్వాత ఈ మృత కళేబరంలో ఏమి మిగిలివుంటుంది ? అదే పరబ్రహ్మ అంటే పరబ్రహ్మ ఒక్కటే ఏ పక్షపాతమూ లేకుండా జీవుల్లోనూ, నిర్జీవుల్లోనూ, జడ పదార్థాల్లోనూ, చేతనాల్లోనూ అన్నింటిలోనూ వసిస్తుందని అర్థం. కనుక ఓ నచికేతా! నీవు తెలుసుకోగోరిన బ్రహ్మతత్వమిదే (4)

**న ప్రాణేన నాపానేన మర్త్యో జీవతి కశ్చన।**
**ఇతరేణ తు జీవన్తి యస్మిన్నేతావుపాశ్రితౌ॥**

**హన్త త ఇదం ప్రవక్ష్యామి గుహ్యం బ్రహ్మ సనాతనమ్।**
**యథా చ మరణం ప్రాప్య ఆత్మా భవతి గౌతమ॥**

మర్త్యులు (మృత్యువుకుగురయ్యే ప్రాణులు) ఎవరైనా ఇటు ప్రాణంతోగాని లేక అటు అపానం(పిత్తు)చేగాని జీవించివుండడంలేదు. కాగా ఈ ప్రాణం, అపానం

రెండూకూడ దేనిని ఆశ్రయించివున్నాయో ఆ తత్వం వల్ల (అంటే జీవాత్మ మూలంగా) జీవించివుంటున్నారు. కనుక ఓ గౌతమా ! (గౌతమవంశజుడైన ఓ నచికేతా!) మరి ఆ రహస్యమయ, సనాతన బ్రహ్మ ఎలాంటిదో, యింకా మనిషి చనిపోయినా జీవాత్మ ఎలా నాశనంకాకుండా నిలిచివుంటుందో ఈ విషయాలు నేను నీకు మరోమారు విశదపరుస్తాను. **(5 & 6)**

**యోనిమన్యే ప్రపద్యన్తే శరీరత్వాయ దేహినః।**
**స్థాణుమన్యేఽనుసంయన్తి యథాకర్మ యథాశ్రుతమ్ ॥**

ఓ నచికేతా ! స్వీయకర్మఫలాల్నిబట్టి, అలాగే శాస్త్రాది జ్ఞానదాయకవిషయాల శ్రవణం, ఆచరణలనుబట్టి ఎన్నో జీవాత్మలు వేరు శరీరాల ధారణకోసం వివిధ రకాలైన జంగమ యోనుల్లో ప్రవేశించి జన్మిస్తుంటాయి కాగా మరెన్నో జీవాత్మలు స్థావర రూపంలో నిలిచిపోతాయి. [పాప పుణ్యాలు సమానంగావున్న వారి జీవాత్మలు తిరిగి మానవ శరీరాన్ని ధరిస్తాయని, పుణ్యాలు తక్కువ, పాపాలు హెచ్చుగా వుండేవారి జీవాత్మలు పశుపక్ష్యాదుల శరీరాలు ధరిస్తాయనీ, మరీ పాపిష్టి జీవాత్మలు స్థావరరూపాలు - అంటే చెట్లుచేమలుగా, రాళ్లు, పర్వతాలుగా, గడ్డిపోచలు, లతలుగా యిలా వివిధరకాలుగా జన్మలు - ధరిస్తాయని అంటారు] **(7)**

**న ఏష సుప్తేషు జాగర్తి కామం కామం పురుషో నిర్మిమాణః।**
**తదేవ శుక్రం తద్ బ్రహ్మ తదేవామృతముచ్యతే।**
**తస్మిల్లోకాః శ్రితాః సర్వే తదు నాత్యేతి కశ్చన। ఏతద్వై తత్॥**

ఎవరెవరి కర్మఫలాలకు అనుసారంగా నానావిధాలైన భోగాలను సృష్టించే ఆ పరమ పురుషుడే, (ప్రళయకాలంలో అందరూ) గాఢనిద్రలోవున్నా తానుమాత్రం మేలుకొనేవుండేదెవరో అతడే (అదే) పరమ విశుద్ధ తత్వం, అదే బ్రహ్మ ; అదే అమృతమనీ అనబడుతుంది సకల లోకాలు అందులోనే (ఆయనలోనే) ఆశ్రయం పొందివుంటాయి దానిని ఎవరూకూడ అతిక్రమించజాలరు.

ఓ నచికేతా! నీవు తెలుసుకోగోరిన బ్రహ్మతత్వమిదే ["లోకంబులు లోకేశులు, లోకస్థులు దెగినతుది నలోకంబగు పెంజీకటి కవ్వల నెవ్వడు, నేకాకృతి వెలుగు" అన్న పోతన భావం యిదే కావచ్చు ] **(8)**

**అగ్నిర్యథైకో భువనం ప్రవిష్టో రూపం రూపం ప్రతిరూపో బభూవ।**
**ఏకస్తథా సర్వభూతాన్తరాత్మా రూపం రూపం ప్రతిరూపో బహిశ్చ ॥**

ఎలాగైతే ఈ సమస్తబ్రహ్మాండంలో వ్యాపించివున్న ఒకే అగ్ని నానారూపాలుగల ఆకారాల్లో ఆయా రూపాలు ధరించి నెలకొనివుంటుందో, అదే విధంగా సకల ప్రాణుల అంతరంగాల్లోనూ నెలకొనివుండే ఆ పరబ్రహ్మ ఒక్కటే అయినా నానారూపాలుగల ప్రాణులు, పదార్థాల్లో ఆయా రూపాలలోనే యిమిడి వుంటుంది అంతేగాక వాటికి బయటకూడ వ్యాపించివుంటుంది **(9)**

**వాయుర్యథైకో భువనం ప్రవిష్టో రూపం రూపం ప్రతిరూపో బభూవ।**
**ఏకస్తథా సర్వభూతాన్తరాత్మా రూపం రూపం ప్రతిరూపో బహిశ్చ ॥**

ఏ విధంగానైతే ఈ సమస్తవిశ్వంలో వ్యాపించివున్న ఒకే వాయువు నానారూపాలుగల ఆకారాల్లో ఆయా రూపాలు ధరించి నెలకొనివుంటుందో, అదే విధంగా సకల ప్రాణుల అంతరంగాల్లోనూ నెలకొనివుండే ఆ పరబ్రహ్మ ఒక్కటే అయినా నానారూప ప్రాణులు, పదార్థాల్లో ఆయా రూపాలలోనే ఇమిడి వుంటుంది ఇంకా వాటికి బయటకూడ వ్యాపించివుంటుంది. **(10)**

**సూర్యో యథా సర్వలోకస్య చక్షుర్న లిప్యతే చాక్షుషైర్బాహ్యదోషైః।**
**ఏకస్తథా సర్వభూతాన్తరాత్మా న లిప్యతే లోకదుఃఖేన బాహ్యః ॥**

ఏ విధంగానైతే సూర్యుడు ఒక్కడై వుండీ ఈ సమస్తవిశ్వాన్నీ ప్రకాశింపజేస్తాడో, లోకుల కళ్లకు సహాయకంగా వుంటాడో, అయినా వారి కంటిచూపులకు సంబంధించిన బాహ్యదోషాలు తనకంటకుండా వుంటాడో, అదేవిధంగా

సర్వభూతాల్లోనూ అంతర్యామిగా వుండే పరమాత్మ ఒక్కడే. ఆ పరబ్రహ్మ ప్రసాదించిన శక్తిసామర్థ్యాలవల్లే, మనస్సు, బుద్ధి, తదితర వివిధ ఇంద్రియాల సహాయంతో లోకులు వివిధకర్మలు చేస్తూ తదనుగుణమైన శుభ లేక అశుభ ఫలాలు పొందుతుంటారు అయితే ఆ పరమాత్మ లోకుల దుఃఖాలలో తాను నిమగ్నమై వుండడు. అందరిలోనూ వుంటూనే ఆ పరమాత్మ నిస్సంగుడై, అందరికీ బాహ్యంగా, దూరంగాకూడ వుంటాడు. ["ఒక సూర్యుండు సమస్త జీవులకు దా నొక్కొకడై తోచు పోలిక నే దేవుడు" అంటూ మన పోతన ప్రస్తుతించిన పద్యార్థానికీ, ఈ శ్లోకార్థానికీ కొంత పోలికవుందనిపిస్తుంది]. **(11)**

**ఏకో వశీ సర్వభూతాన్తరాత్మా ఏకం రూపం బహుధా యః కరోతి।**
**తమాత్మస్థం యేఽనుపశ్యన్తి ధీరాస్తేషాం సుఖమ్ శాశ్వతం నేతరేషామ్॥**

సమస్త ప్రాణికోటిలో అంతర్యామిగావుండే, అందరినీ తన వశంలో వుంచుకునే, అద్వితీయమైన ఏకాకృతి కలిగిన ఆ పరబ్రహ్మ సర్వము తాను ఒక్కడే అయినప్పటికీ అపూర్వలీలచే నానాప్రకారాలుగా రూపాలు ధరిస్తూంటాడు. అలాంటి తను హృదయక్షేత్రాలలోనే వసించే ఆ పరబ్రహ్మను ఎవరైతే జ్ఞాన పురుషులు నిరంతరం వీక్షిస్తుంటారో వారికి మాత్రమే నిశ్చలము, శాశ్వతము అయిన పరమానంద స్వరూప వాస్తవసుఖాలు దక్కుతాయిగాని అన్యుల కెవ్వరికీ కాదు [సర్వము దానయైన వాడు, నర్తకునిభంగి పెక్కుగు మూర్తులతో నాడువాడు, జగముల గలిగించు సమయించు కొఱకునై నిజమాయ నిన్నియును దాల్చువాడు - ఇవి మన పోతన వాడిన మధుర పదజాలాలు] **(12)**

**నిత్యో నిత్యానాం చేతనశ్చేతనానామేకో బహూనాం యో విదధాతి కామాన్ ।**
**తమాత్మస్థం యేనుపశ్యన్తి ధీరాస్తేషాం శాన్తిః శాశ్వతీ నేతరేషామ్ ॥**

నిత్య చేతన ఆత్మల్లోకే నిత్యమైనది, చైతన్యయుత పదార్థాలన్నిటిలోకే అతి చైతన్య యుతమైనది, ఒక్కటైవుండీ అనేకుల (జీవకోటియొక్క) కామనల్ని పరిపూర్తి గావించేది అయిన ఆ పరబ్రహ్మ తమ అంతరంగాల్లోనే నిలిచివుందని ఎరిగి, నిరంతరం దాన్ని వీక్షిస్తూ, ఉపాసిస్తూవుండే జ్ఞానులకుమాత్రమే శాశ్వత శాంతి లభిస్తుందిగాని యితరులకు కాదు దీనికే మరో విధమైన అర్థం చెబుతారు అదేమిటంటే అనిత్యాలలో నిత్యమైనది, అచేతనాల్లో చేతనము, చేతనాల్లో అచేతనమైనది ఆ పరబ్రహ్మ అని అంటే అంతా నశించిపోయినా , ఆ లయాన్ని సైతం తనలో విలీనం చేసుకుని మిగిలివుండే ఆ పరమతత్వమే పరబ్రహ్మ అని పైన ఉదహరించిన పోతన పద్యంలోలా **లోకంబులు, లోకేశులు, లోకస్థులు దెగినతుది నలోకంబగు పెంజీకటి కవ్వల నెవ్వడు ఏకాకృతి వెలుగుచుండు** నో ఆ పరమపురుషుడి ప్రస్తావన యిదన్నమాట **(13)**

**తదేతదితి మన్యన్తే నిర్దేశ్యం పరమం సుఖమ్ ।**
**కథం ను తద్విజానీయాం కిము భాతి విభాతి వా ॥**

యమధర్మరాజు ఈ విధంగా బ్రహ్మప్రాప్తివల్ల కలిగే పరమ సుఖం, అనిర్వచనీయ ఆనందం, శాశ్వత శాంతులను గురించి వివరిస్తూంటే విని ఎంతో ప్రభావితుడైన నచికేతుడు తన మనస్సులో తానే యిలా యోచించుకోసాగాడు పరబ్రహ్మ ప్రాప్తి పొందిన జ్ఞానులు అనిర్వచనీయ, పరమానందం, శాశ్వత శాంతి ఆ బ్రహ్మేనని భావిస్తారుగదా. మరి ఆ బ్రహ్మను నేనే విధంగా చక్కగా అర్థం చేసుకోగలను. మరి ఆ పరబ్రహ్మ నాముందు సాక్షాత్కరిస్తాడా లేక నా అనుభవంలో పరబ్రహ్మప్రాప్తి అయిన అనుభూతి కలుగుతుందా ? ఆ బ్రహ్మ జ్ఞానం నా కే తీరుగా లభిస్తుంది ? **(14)**

**న తత్ర సూర్యో భాతి న చన్ద్రతారకం నేమా విద్యుతో భాన్తి కుతోఽయమగ్నిః।**
**తమేవ భాన్తమనుభాతి సర్వం తస్య భాసా సర్వమిదం విభాతి ॥**

నచికేతుని మనోభావాన్ని గ్రహించిన యమధర్మరాజు యిలా వివరిస్తున్నాడు : అక్కడ సూర్యుడు ప్రకాశించడు. చంద్రుడు, తారలు ప్రకాశింపవు. మెరుపులు మెరవవు అలాంటప్పుడు ఈ లౌకికమైన అగ్ని మాత్రం ఎలా ప్రకాశించగలదు? ఎందుకంటే ఆ తత్వం (పరబ్రహ్మ) ప్రకాశించడంవల్లే పైన పేర్కొన్నవన్నీ ప్రకాశిస్తాయి ఆ పరబ్రహ్మ ప్రకాశంతోనే ఈ సమస్త విశ్వమూ ప్రకాశిస్తుంది. దీని సారాంశమేమంటే సూర్యచంద్రాదులు, నక్షత్రాలు, మేఘాలు, అగ్నిలయుక్తంగా ఈ సమస్త విశ్వం ఆ పరబ్రహ్మ ప్రకాశంనుండే కాంతిని పొంది తానూ ప్రకాశించగల్గుతుందని. ["ఇన చంద్రానల తారకాగ్రహ గణం బే రీతి నా రీతి నెవ్వని దీప్తిం బ్రతిదీప్త మయ్యె భువనవ్రాతంబు, దద్దీప్తిచే నమదీప్తంబగునట్టి యీశ్వరున కే నశ్రాంతమున్ మ్రొక్కెద " నంటాడు మన బమ్మెర పోతరాజు] **(15)**

# ద్వితీయ వల్లీ సమాప్తం.

★ ★ ★ ★ ★

# తృతీయ వల్లీ

ఊర్ధ్వమూలో ऽవాక్శాఖ ఏషోऽశ్వత్థః సనాతనః।
తదేవ శుక్రం తద్బ్రహ్మ తదేవామృతముచ్యతే।
తస్మిఀల్లోకాః శ్రితాః సర్వేతదు నాత్యేతి కశ్చన। ఏతద్వై తత్॥

ఈ ప్రత్యక్ష జగత్తు వేళ్ళు పైకి, శాఖలు కిందికి వ్యాపించివున్న ఒక సనాతన అశ్వత్థ వృక్షాన్ని పోలివున్నది. దీనికి మూలభూతమైనది ఆ విశుద్ధతత్వమే; అదే బ్రహ్మ. అదే అమృతం అనబడుతుందికూడా. సర్వలోకాలు ఆ విశుద్ధతత్వాన్ని, ఆ పరబ్రహ్మనే ఆశ్రయించివుంటాయి కనుక ఎవరైనాగానీ దానిని అతిక్రమించజాలరు. అంటే ఈ బ్రహ్మాండరూప రావిచెట్టుకు వేళ్ళు పైన అంటే పరబ్రహ్మ పురుషోత్తమునిలో వుంటాయి, జీవాత్మ దీని ప్రధాన శాఖ, దేవతలు, మానవులు, పితరులు, పశు పక్ష్యాదులు వగైరాలన్నీ చిన్న చిన్న శాఖలు. ఈ శాఖలన్నీ కింది వైపుకు వ్యాపించివున్నాయి. అలాంటి ఈ బ్రహ్మాండరూప అశ్వత్థ వృక్షం అతిసనాతనమైనది, అనాదికాలంనుండి అస్తిత్వంలో వున్నది దీనికి మూలకారణమే బ్రహ్మ దాన్నె అమృతమనికూడ అంటారు సకలలోకాలు దాన్ని ఆశ్రయించేవుంటాయి ఎన్నడూ ఎవరూ దానిని ఉల్లంఘించజాలరు ఓ నచికేతా ! నీవు తెలుసుకోగోరే బ్రహ్మతత్వమిదే. [ఈ శ్లోకాన్ని పోలిన శ్లోకం ఒకటి భగవద్గీత (15వ అధ్యాయం)లో వుంది ఆ అధ్యాయపు మొదటి శ్లోకం యిలా వుంటుంది · ఊర్ధ్వమూలమధశ్శాఖం అశ్వత్థం ప్రాహురవ్యయమ్। ఛన్దాంసి యస్య పర్ణాని యస్తం వేద స వేదవిత్॥ – అంటే ఈ సంసారమును (లేక జగత్తును) అశ్వత్థవృక్షంతో పోల్చవచ్చు ఇది నాశనమంటూ లేని, వేళ్ళు పైకి, కొమ్మలు కిందికి వుండే అనాదిగా వుంటూవస్తున్న చెట్టు వేదాలే ఈ చెట్టు ఆకులు. ఈ వృక్షతత్వాన్ని చక్కగా ఎరిగినవాడు వేదవిదుడే. వృక్షతత్వమే పరబ్రహ్మ అనేది సంకేతపరంగా చెప్పబడింది] (1)

**యదిదం కిం చ జగత్సర్వం ప్రాణ ఏజతి నిఃసృతమ్ ।**
**మహద్భయం వజ్రముద్యతం య ఏతద్విదురమృతాస్తే భవన్తి ॥**

మనకు కనిపించే, వినిపించే, అర్థమయ్యే, అవకపోయే ఈ సమస్త చరాచర జగత్తంతా ఆ పరబ్రహ్మ పరమేశ్వరునినుండి వెలువడివచ్చినదే. ఆ పరబ్రహ్మ ద్వారా ప్రాణం పోయబడినదే అంటే ఈ విశ్వం యావత్తూ పరమేశ్వరుని లీలయే. మరి ఈ పరబ్రహ్మ పైకెత్తిన వజ్రం (వజ్రాయుధం) లా పరమ భయంకరుడుకూడ ఇంతటి సర్వశక్తిమంతుడైన పరబ్రహ్మ పరమేశ్వరుని నిజతత్వాన్ని ఎరిగినవారు అమరులవుతారు అంటే జనన మరణ చక్రంనుండి వారు ముక్తి పొందుతారు (2)

**భయాదస్యాగ్నిస్తపతి భయాత్తపతి సూర్యః ।**
**భయాదిన్ద్రశ్చ వాయుశ్చ మృత్యుర్ధావతి పఞ్చమః ॥**

ఈ పరబ్రహ్మ భయంవల్లే అగ్ని మండుతాడు దీని భయంవల్లే సూర్యుడు ప్రకాశిస్తాడు; ఎండ కాస్తాడు. ఇంకా దీని భయంవల్లే ఇంద్రుడు, వాయువు, మరియు ఐదవవాడైన మృత్యుదేవత తమ తమ విధులు నిర్వర్తిస్తారు దీని సారాంశమేమంటే ఈ జగత్తులో వివిధ దేవతలచే నియమితరూపంలో జరిగే పనులన్నీ నిజానికి ఈ సర్వశక్తిమంతుడు, సర్వేశ్వరుడు, సర్వశాసకుడు అయిన ఈ పరబ్రహ్మ పరమేశ్వరుని అమోఘ శాసనంద్వారానే జరుగుతున్నాయి గాని వారంత వారే చేయడం లేదని (3)

**ఇహ చేదశకద్ బోద్ధుం ప్రాక్శరీరస్య విస్రసః ।**
**తతః సర్గేషు లోకేషు శరీరత్వాయ కల్పతే ॥**

ఈ దేహం నశించేలోగా ఈ మనుష్యశరీరంలోనే సాధకుడు పరమాత్మను సాక్షాత్కరింపజేసుకుంటే మంచిదే. కాని అలాకాని పక్షంలో అనేక కల్పాలపాటు నానాలోకాల్లోనూ, నానావిధ యోనుల్లోనూ శరీరధారణాలు చేయకతప్పని పరిస్థితి ఏర్పడుతుంది అంటే ఈ మానవజన్మలోనే పరమాత్మసాక్షాత్కారం పొందని వ్యక్తి యిక జనన మరణ చక్రంలో చిక్కుకుని చిరకాలంపాటు మగ్గుతూ వుండవల్సిందే నని అర్థం (4)

**యథాదర్శే తథాత్మని యథా స్వప్నే తథా పితృలోకే।**
**యథాప్సు పరీవ దదృశే తథా గంధర్వలోకే ఛాయాతపయోరివ బ్రహ్మలోకే॥**

జ్ఞానుల విశుద్ధ అంతఃకరణాల్లో ఈ పరబ్రహ్మ అద్దంలో కన్పట్టినట్లు చక్కగా కనపడుతుంది. కాగా పితృలోకాల్లోనైతే కలల్లో కనపడినట్లు కాస్త అస్పష్టంగానే దర్శనమిస్తుంది కాగా గంధర్వలోకంలో మరి కొంత మెరుగు, అలలతో కదలాడే నీటిలో కనిపించే ప్రతిబింబంలా కనిపిస్తుంది అయితే బ్రహ్మలోకంలోనే పరమాత్మ-ఆత్మ రెండూకూడ ఎండా నీడల్లా వేరువేరుగాను స్పష్టంగానూ కనిపిస్తాయి. **(5)**

**ఇన్ద్రియాణాం పృథగ్భావముదయాస్తమయౌ చ యత్।**
**పృథగుత్పద్యమానానాం మత్వా ధీరో న శోచతి॥**

తమ తమ కారణాలచే వేర్వేరు రూపాల్లో పుట్టుకొచ్చే ఇంద్రియాల వేర్వేరు అస్తిత్వాలను గుర్తెరిగి, అలాగే అవి జాగ్రదావస్థలో ఉదయించడం, నిద్రావస్థలో లయించడం, యిలా పరివర్తనలకు గురవడాన్నికూడ గుర్తించి, ఈ చంచల,పరివర్తనాశీల ఇంద్రియాలకు భిన్నంగా తాను నిత్యము, నిశ్చలము, చేతనాత్మకమైన ఆత్మను అని ఎరిగిన బుద్ధిమంతుడైన వ్యక్తి శాశ్వతంగా దుఃఖాలకు దూరమై, దేనికీ శోకించకుండా వుంటాడు **(6)**

**ఇన్ద్రియేభ్యః పరం మనో మనసః సత్వముత్తమమ్।**
**సత్త్వాదధి మహానాత్మా మహతోऽవ్యక్తముత్తమమ్॥**

ఇంద్రియాలకంటే మనసు ఉత్తమమైనది. మనసుకంటె సత్వం (బుద్ధి) శ్రేష్ఠమైనది బుద్ధికంటె ఆత్మ(జీవాత్మ) అతిగొప్పది. జీవాత్మకంటె అవ్యక్త శక్తి ఉత్తమమైనది. అంటే వ్యక్త శరీరాలు ధరించే జీవాత్మకంటె దాని అవ్యక్త శక్తియే ప్రబలమైనదని అర్థం [ఇదే *భగవద్గీత, **14**వ అధ్యాయం, **5** వ శ్లోకంలో సత్త్వం రజస్తమ ఇతి గుణాః ప్రకృతిసంభవాః । నిబధ్నన్తి మహాబాహో ! దేహే దేహినమవ్యయమ్ ॥* - అని, అంటే నాశరహితుడైన దేహిని (జీవాత్మను) సత్త్వ రజస్తమో గుణములు మూడూ దేహమందు బంధించివుంచుతున్నాయని చెప్పబడింది] **(7)**

**అవ్యక్తాత్తు పరః పురుషో వ్యాపకోऽలిఙ్గ ఏవ చ ।**
**యం జ్ఞాత్వా ముచ్యతే జన్తురమృతత్వం చ గచ్ఛతి ॥**

అయితే ఈ అవ్యక్తశక్తికంటె వ్యాపకమైనది, సర్వదా ఆకారరహితమైనది అయిన పరమ పురుషుడు శ్రేష్ఠుడు. ఇది తెలుసుకున్నప్పుడే జీవాత్మ ముక్తి పొందుతుంది అప్పుడే దానికి అమృతస్వరూప ఆనందమయ బ్రహ్మప్రాప్తి సంభవిస్తుంది **(8)**

**న సందృశే తిష్ఠతి రూపమస్య న చక్షుషా పశ్యతి కశ్చనైనమ్ ।**
**హృదా మనీషా మనసాభిక్లృప్తో య ఏతద్విదురమృతాస్తే భవన్తి ॥**

ఈ పరబ్రహ్మ నిజస్వరూపం ప్రత్యక్షతత్వంలా ఎదుట సాక్షాత్కరించ దెవరికీ; ఎవరూకూడ దీన్ని మామూలు కళ్లతో చూడలేరు మనస్సు ద్వారా పదే పదే ధ్యానం చేయడంవల్లమాత్రమే నిర్మల, నిశ్చల హృదయంతో, విశుద్ధ బుద్ధి ద్వారామాత్రమే (దివ్య బుద్ధిరూప నేత్రాలతోమాత్రమే) దానిని చూడ శక్యమవుతుంది ఎవరైతే ఈ సత్యాన్ని గ్రహించి, పరబ్రహ్మ నిలా తెలుసు కోగలరో వాళ్లు అమృత (పరమానంద) స్వరూపులే అవుతారు. **(9)**

**యదా పఞ్చావతిష్ఠన్తే జ్ఞానాని మనసా సహ ।**
**బుద్ధిశ్చ న విచేష్టతి తామాహుః పరమాం గతిమ్ ॥**

ఎప్పుడైతే పంచేంద్రియాలు మనస్సుతోబాటుగా చక్కగా స్థిరంగా నిలిచి వుంటాయో, బుద్ధికూడ చేష్టలుడిగి నిశ్చలంగా నిలిచివుంటుందో ఆ స్థితిని (యోగులు) పరమ గతి అని అంటారు. ఇక్కడ ఇంద్రియ వ్యాపారాల్ని యోగం ద్వారా ఆపివేసి పరబ్రహ్మను పొందే మరో పద్ధతి వివరించబడింది. నిరంతర యోగాభ్యాసంవల్ల పంచేంద్రియాలు, మనస్సు, బుద్ధి అన్నీ నిర్వ్యాపారమై, సమాధిగ్రస్తమైవుండే ఒక సర్వోత్తమ స్థితి వస్తుంది ఇదే పరమ గతి **(10)**

**తాం యోగమితి మన్యన్తే స్థిరామిన్ద్రియధారణామ్ ।**
**అప్రమత్తస్తదా భవతి యోగో హి ప్రభవాప్యయౌ ॥**

ఆ విధంగా ఇంద్రియాలను స్థిరంగా నిలిపివుంచుకోవడాన్నే యోగం అంటారు ఇంద్రియాలు, మనసు, బుద్ధుల స్థిరధారణనే యోగమని అంటారు ఎందుకంటే ఆ సమయంలో సాధకుడు విషయదర్శనరూప ప్రమాదాలు ఏవీ లేకుండా వుంటాడు - అప్రమత్తుడుగా వుంటాడు కాని యోగం సర్వదా వుండదు దానికి ఉదయాస్తమయాలు అంటూ వుంటాయి కనుక పరమాత్మను పొందగోరే సాధకుడు నిరంతర యోగ యుక్తుడై వుండడానికి దృఢ అభ్యాసం చేస్తూవుండాలని అర్థం **(11)**

**నైవ వాచా న మనసా ప్రాప్తుం శక్యో న చక్షుషా ।**
**అస్తీతి బ్రువతోఽన్యత్ర కథం తదుపలభ్యతే ॥**

వాక్కుద్వారాగాని, మనస్సుద్వారాగాని లేక కళ్లతోగాని దాన్ని అనుభూతి చెందలేము, ప్రాప్తిగావించుకోలేము కాని అది అవశ్యం వున్నది అనే విధంగా చెప్పేవారికి తప్పితే అది( బ్రహ్మ) అన్యులకు ఎలా ప్రాప్తించగలదు? అంటే పైన చెప్పిన విధంగా ఇంద్రియాలను, మనస్సును, బుద్ధిని అన్నింటినీ స్థిరంగా నిలుపుకుని, వీటి గ్రహణశక్తుల కతీతమైన ఆ పరబ్రహ్మ వున్నది అనే దృఢ విశ్వాసంతో నిరంతరం కఠిన అభ్యాసాలు చేస్తూ వుండాలి అలా చేసేవారికే ఆ పరబ్రహ్మ ప్రాప్తి సాధ్యం అని అర్థం **(12)**

**అస్తీత్యేవోపలబ్ధవ్యస్తత్త్వభావేన చోభయోః।**
**అస్తీత్యేవోపలబ్ధస్య తత్త్వభావః ప్రసీదతి ॥**

మొదటగా ఆ పరబ్రహ్మ అస్తిత్వంగురించి అది తప్పక వున్నదనే దృఢ నిశ్చయం అవసరం ఆ తర్వాత తత్వభావం(నిరంతర యోగధ్యానం)తో దాన్ని ప్రాప్తింప జేసుకోవడానికి కృషిచేయాలి. ఇలా రెండు విధాలుగానూ పరబ్రహ్మ అస్తిత్వాన్ని అంగీకరించి, ప్రయత్నించే సాధకునికి ఆ బ్రహ్మతత్వం (ఎప్పుడో ఒకప్పుడు) అతడి విశుద్ధ హృదయంలో తనంతతానుగానే సాక్షాత్కరిస్తుంది. **(13)**

**యదా సర్వే ప్రముచ్యన్తే కామా యేఽస్య హృది శ్రితాః।**
**అథ మర్త్యోఽమృతో భవత్యత్ర బ్రహ్మ సమశ్నుతే ॥**

ఇలాంటి సాధకుని హృదయంలోవుండే కామనలు (వాంఛలు, కోరికలు) అన్నీ సమూలంగా నష్టమైపోయినప్పుడు ఈ మర్త్యుడు (మరణశీలుడైన మనిషి) అమరుడౌతాడు. ఇలాంటి సాధకుడే తన మానవ శరీరంలోనే పరబ్రహ్మను చక్కగా ప్రాప్తిగావించుకుంటాడు(సాక్షాత్కరింపజేసుకుంటాడు) **(14)**

**యదా సర్వే ప్రభిద్యన్తే హృదయస్యేహ గ్రన్థయః।**
**అథ మర్త్యోఽమృతో భవత్యేతావద్ధ్యనుశాసనమ్ ॥**

హృదయపు సర్వ గ్రంథులూ (అహంతా, మమతారూప సమస్త గ్రంథులు) చక్కగా విచ్చుకున్నప్పుడు(అంటే పూర్తిగా తెగినప్పుడు) మర్త్యుడైన మానవుడు ఈ శరీరంలోనే అమరత్వం పొందగలుగుతాడు. అంటే అప్పుడే సంశయాలన్నీ దూరమై పరబ్రహ్మ పరమేశ్వరుడు తప్పక వున్నాడు, నిశ్చయంగా బ్రహ్మప్రాప్తి కాగలదనే భావనకలిగినప్పుడు ఈ శరీరంలోవుంటూనే మర్త్యుడైన మానవుడు అమరత్వం పొందగలుగుతాడు. మరి వేదాంతపు సనాతన ఉపదేశ మింతే నని తెలుసుకోవాలి. **(15)**

**శతం చైకా చ హృదయస్య నాడ్యస్తాసాం మూర్ధానమభినిఃసృతైకా।**
**తయోర్ధ్వమాయన్నమృతత్వమేతి విష్వఙ్ఙన్యా ఉత్క్రమణే భవన్తి ॥**

మనిషి హృదయంలో (గుండెలో) నూటొక్కటి ప్రధాన నాడులున్నాయి అవి శరీరంలో ఎల్లెడలకూ వ్యాపించివున్నాయి వాటిలో ఒక్కటిమాత్రమే (దాన్నే సుషుమ్నా అంటారు) పైకి తలవైపుకు (కపాలంవైపుకు) పారుతుంది దాని ద్వారానే మనిషి పైకి ఊర్ధ్వలోకాలకు పోగల్గుతాడు తద్వారా అమృతత్వం పొందగల్గుతాడు మిగతా నూరు నాడులూ వేరు వేరు దిశలుగా పారుతాయి మరణకాలంలో వాటిద్వారా జీవుడు బయల్వెడలితే అప్పుడు నానావిధ యోనుల్లో తన కర్మఫలానుసారంగా జన్మలెత్తుతూ చిరకాలం జనన మరణ చక్రంలో చిక్కుకునే వుంటాడు. **(16)**

**అఙ్గుష్ఠమాత్రః పురుషోऽన్తరాత్మా సదా జనానాం హృదయే సంనివిష్టః।**
**తం స్వాచ్ఛరీరాత్ప్రవృహేన్ముఞ్జాదివేషీకాం ధైర్యేణ।**
**తం విద్యాచ్ఛుక్రమమృతం తం విద్యాచ్ఛుక్రమమృతమితి ॥**

అందరిలో అంతర్యామిగా అంగుష్ఠమాత్ర పరిమాణంలోవుండే ఆ పరమపురుషుడు సర్వదా మానవుల హృదయాల్లో చక్కగా నిహితమై వుంటాడు వివేచనాబుద్ధితో దర్భపోచలనుండి గడ్డిపోచలను వేరుచేసి చూచే చందంగా దాన్ని (అంగుష్ఠమాత్ర పరబ్రహ్మను) శరీరంనుండి వేరుచేసి చూడాలి దానినే విశుద్ధ అమృతస్వరూప తత్వంగా ఎరగాలి దానినే విశుద్ధ అమృతస్వరూప బ్రహ్మతత్వంగా తెలుసుకోవాలి. **(17)**

**మృత్యుప్రోక్తాం నచికేతోऽథ లబ్ధ్వా విద్యామేతాం యోగవిధిం చ కృత్స్నమ్ ।
బ్రహ్మప్రాప్తో విరజోऽభూద్విమృత్యురన్యోऽప్యేవం యో విదధ్యాత్మమేవ ॥**

ఈ విధంగా యమధర్మరాజు చేసిన ఉపదేశాలు విన్న నచికేతుడు ఆయన వెల్లడించిన బ్రహ్మవిద్యను, సంపూర్ణ యోగవిధిని ప్రాప్తంగావించుకున్నాడు దానితో మృత్యు రహితంగా, సర్వవికారాలు దూరంగావించుకుని అతి విశుద్ధంగా రూపొందాడు బ్రహ్మప్రాప్తి పొందాడు అదేవిధంగా యితరు లెవరైనాగాని ఈ అధ్యాత్మ విద్యను యిదే ప్రకారంగా తెలుసుకుంటే, వారూ ఇలాగే మృత్యు రహితంగా, నిర్వికారంగా రూపొంది పరబ్రహ్మ ప్రాప్తి పొందుతారు **(18)**

## తృతీయ వల్లీ సమాప్తం
## ద్వితీయ అధ్యాయం సమాప్తం
## కృష్ణయజుర్వేదీయ కఠోపనిషద్ సమాప్తం

* * * * *

## శాంతి పాఠం

**ఓం సహ నావవతు । సహ నౌ భునక్తు । సహ వీర్యం కరవావహై ।
తేజస్వి నావధీతమస్తు । మా విద్విషావహై ।**

**ఓం శాంతిః శాంతిః శాంతిః**

[ ఓ పరమాత్మా ! మా ఇరువురినీ (గురుశిష్యులిద్దరినీ) తోడ్తోడుగా రక్షించేది మా ఇద్దరినీ తోడ్తోడుగా సముచితరీతిలో పాలించి పోషించేది మా యిరువురికీ తగు శక్తియుక్తులు ప్రసాదించమని, మే మిరువురమూ చదివే విద్య ప్రభావంతంగా వుండేట్లు చేయమని, మే ముభయులం ఒకరి నొకరు పరస్పరం ద్వేషించుకోకుండా సద్బుద్ధి ప్రసాదించమని ప్రార్థన ఓ పరబ్రహ్మా ! మా త్రివిధ తపస్సులూ నివృత్తి అయేట్లు చేయవల్సిందిగా ప్రార్థన ! ]

* * * * * * * * * *

# ప్రశ్నోపనిషత్తు

ప్రశ్నోపనిషత్తు అధర్వవేదంలోని పిప్పలాద శాఖీయ బ్రాహ్మణ భాగం లోనిది. ఈ ఉపనిషత్తులో పిప్పలాదుడనే రుషివర్యుడు సుకేశ మొదలైన ఆరుగురు రుషులు వేసిన ఆరు ప్రశ్నలకు క్రమపద్ధతిలో జవాబిచ్చాడు. కనుకనే ఈ ఉపనిషత్తుకు ప్రశ్నోపనిషత్తు అనే పేరు వచ్చింది.

## శాంతి పాఠం

ఓం భద్రః కర్ణేభిః శ్రుణుయామ దేవాః భద్రం పశ్యేమాక్షభిర్యజత్రాః।
స్థిరైరఙ్గైస్తుష్టువాంసస్తనూభిర్వ్యశేమ దేవహితం యదాయుః ॥
స్వస్తి న ఇన్ద్రో వృద్ధశ్రవాః స్వస్తి నః పూషా విశ్వవేదాః।
స్వస్తి నస్తార్క్ష్యో అరిష్టనేమిః స్వస్తి నో బృహస్పతిర్దధాతు ॥

**ఓం శాంతిః శాంతిః శాంతిః !**

గురువుద్గర అధ్యయనం చేసే శిష్యులు తమ గురువుకు, సహపాఠులకు, మొత్తం మానవులందరికీకూడ కళ్యాణమవాలని కోరుతూ దేవతల నిలా ప్రార్థిస్తున్నారు· ఓ దేవగణాల్లారా ! మేము భగవంతుడిని ఆరాధిస్తూ మా చెవులతో కళ్యాణ కారక విషయాలే వినేట్లు చేయండి. అలాగే కళ్లతో కళ్యాణదాయకమైన దృశ్యాలే చూచేట్లు చేయండి మా శరీరాలు, వాటిలోని సర్వాంగాలూ సుదృఢంగా వుండేట్లు, అలాంటి దేహాలతో మా జీవితాలు భగవంతుని స్తుతించడానికి, దేవుని కార్యాలు నిర్వహించడానికే వెచ్చించేట్లు గావించండి. సకల దిశలా వ్యాపించిన ఘనకీర్తిగల ఆ ఇంద్రుడు మాకు కళ్యాణము చేయుగాక. సర్వ విశ్వ జ్ఞాని పూషా మాకు కళ్యాణమే ప్రసాదించుగాక. అరిష్టాలు నిర్మూలించే శక్తిశాలి ఆ గరుడుడూ మాకు క్షేమమే చేయుగాక బుద్ధికి అధిపతి బృహస్పతికూడ మాకు క్షేమం చేకూర్చుగాక. మా త్రివిధాల - ఆధ్యాత్మిక, అధిదైవిక, అధిభౌతిక - తపస్సులకు నివృత్తికలిగి మాకు శాంతి లభించుగాక

# ౧. మొదటి ప్రశ్న

**ఓం సుకేశా చ భారద్వాజః శైబ్యశ్చ సత్యకామః సౌర్యాయణీ చ గార్గ్యః కౌసల్యశ్చాశ్వలాయనో భార్గవో వైదర్భిః కబన్ధీ కాత్యాయనస్తే హైతే బ్రహ్మపరా బ్రహ్మనిష్ఠాః పరం బ్రహ్మాన్వేషమాణా ఏష హ వై తత్సర్వం వక్ష్యతీతి తే హ సమిత్పాణయో భగవన్తం పిప్పలాదముపసన్నాః ॥**

ఓం అనేది బ్రహ్మనామమట. కనుక ఆ బ్రహ్మనామోచ్చరణతో ఈ ఉపనిషత్తు ఆరంభించబడుతున్నది. భరద్వాజ పుత్రుడు సుకేశుడు, శిబికుమారుడు సత్యకాముడు, గర్గ గోత్రీయుడు సౌర్యాయణీ, కోసలదేశీయుడు ఆశ్వలాయనుడు, ఇంకా విదర్భవాసి భార్గవుడు, కత్య రుషి ప్రపౌత్రుడు కబన్ధీ - ఈ ఆరుగురూ బ్రహ్మపరులు(వేదపారాయణులు), బ్రహ్మనిష్టగలవారైన ప్రసిద్ధ రుషులు. వాళ్లు ఆరుగురూకూడ పరబ్రహ్మను అన్వేషిస్తూ , ఆ "పరబ్రహ్మనుగురించిన సమస్త జ్ఞానమూ ఆయనకు తెలుసు, ఆయన మనకు వెల్లడిస్తాడు "అని భావించి, తమ చేతుల్లో సమిధలు పట్టుకుని, పిప్పలాద మహర్షివద్దకు వెళ్లారు (1)

**తాన్హ స ఋషిరువాచ భూయ ఏవ తపసా బ్రహ్మచర్యేణ శ్రద్ధయా సంవత్సరం సంవత్స్యథ యథాకామం ప్రశ్నాన్పృచ్ఛత యది విజ్ఞాస్యామః సర్వం హ వో వక్ష్యామ ఇతి ॥**

అలా తనవద్దకు వచ్చిన ఆ సుకేశాది రుషుల మనస్సుల్లోని మర్మమెరిగిన ఆ సుప్రసిద్ధుడైన పిప్పలాద మహారుషి వారితో, "మీరంతా శ్రద్ధతో బ్రహ్మచర్యం పాటిస్తూ, తపస్యాపూర్వకంగా ఒక సంవత్సరంపాటు యిక్కడ నాదగ్గర (ఆశ్రమంలో) చక్కగా నివసించండి. తదనంతరం ఎవరి ఇష్టానుసారంగా వారు మీరడగదలచిన ప్రశ్నలు అడగండి మీరు అడిగిన విషయాలగురించి నాకు తెలిసివుంటేగనుక నిస్సందేహంగా, అరమరికలు లేకుండా ఆ విషయాలన్నీ మీకు చక్కగా తెలియజెప్పుతాను" అని అన్నాడు. (2)

**అథ కబన్ధీ కాత్యాయన ఉపేత్య పప్రచ్ఛ। భగవన్ కుతో హ వా ఇమాః ప్రజాః ప్రజాయన్త ఇతి ॥**

పిప్పలాద మహారుషి ఆజ్ఞానుసారంగా ఆ ఆరుగురూ ఒక ఏడాదిపాటు బ్రహ్మచర్యం పాటిస్తూ, తపస్సు చేస్తూ, నిష్ఠతో విధిపూర్వకంగా అక్కడ నివసించివున్నారు. ఒక సంవత్సరం గడిచినతర్వాత మొదటగా కత్యరుషి ప్రపౌత్రుడు (కాత్యాయనుడు) కబంధీ గురువుదగ్గరకు వెళ్ళి, "భగవన్! ఏ సుప్రసిద్ధ, సునిశ్చిత కారణవిశేషంవల్ల ఈ ప్రజలంతా, ఈ ప్రాణికోటి అంతా నానారూపాలలో ఉత్పన్నమవుతున్నది ? " అని ప్రశ్నించాడు. (3)

**తస్మై స హోవాచ ప్రజాకామో వై ప్రజాపతిః స తపోఽతప్యత స తపస్తప్త్వా స మిథునముత్పాదయతే। రయిం చ ప్రాణం చేత్యేతౌ మే బహుధా ప్రజాః కరిష్యత ఇతి ॥**

ఆ ప్రశ్న విని సుప్రసిద్ధుడైన పిప్పలాద మహారుషి యిలా జవాబిచ్చాడు : ఓ కాత్యాయనా ! ప్రజలను ఉత్పన్నం చేయాలనే యిచ్ఛగల ప్రజాపతి ఎవరైతే వున్నాడో నిశ్చయంగా ఆయనే ఇదంతా సృష్టించాడు ఇందుకోసం ప్రజాపతి తపస్సు చేశాడు సృష్టి ఆదిలో ప్రజాపతి తపస్సుచేసి ఒక రయి (చంద్రుడు) ని, రెండవదిగా ప్రాణి (సూర్యుడి)ని ఒక జంటగా సృష్టించాడు ఆ రెండూ కలిసి తాను ఉద్దేశించిన నానావిధ ప్రజానీకాల్ని సృష్టించాలనే తలపుతో ఆ రెంటినీ సంయోగపరిచాడు. ప్రాణం ఒక చేతన (చైతన్యం), కాగా రయి ఒక శక్తి లేక ఆకృతి. అందరికీ జీవనప్రదానం చేసే సమష్టిశక్తియే ప్రాణం. ఆకారయుతమైన సర్వ భౌతిక పదార్థాలే రయి. అంటే ప్రకృతియొక్క స్థూలస్వరూపమే రయి. ధనాత్మక, రుణాత్మక (పాజిటివ్, నెగటివ్ ) ధ్రువాలు కలిస్తేనే విద్యుత్తు ప్రవహిస్తుంది అలాగే ఈ ప్రాణం, రయిల సంయోగంతోనే సమస్త సృష్టి కార్యాలు జరుగుతాయి. జంటగా పేర్కొనే ఈ రెండు భిన్నాంశాలనే అన్యత్రా అగ్ని-సోముడు, పురుషుడు - ప్రకృతి అనికూడ పేర్కొనివున్నారు.

[మహాభారతం, ఆదిపర్వం, తృతీయాశ్వాసంలో యిలా చెప్పబడింది తొల్లి సకల జగదుత్పత్తినిమిత్తభూతుండైన బ్రహ్మకు మానసపుత్రులైన మరీచియు నంగిరసుండును నత్రియు బులస్త్యుండును గ్రతువును ననునార్వురు పుట్టిరందు మరీచికి గశ్యప ప్రజాపతి పుట్టె, గశ్యపువలన చరాచరభూతరాశియెల్ల నుద్భవిల్లె ...] (4)

**ఆదిత్యో హ వై ప్రాణో రయిరేవ చన్ద్రమా రయిర్వా ఏతత్ సర్వం యన్మూర్తం చామూర్తం చ తస్మాన్మూర్తిరేవ రయిః ॥**

సూర్యుడే ప్రాణమనేది నిశ్చయమే చంద్రుడే రయి అనేదీ నిశ్చయమే. మూర్తము (ఆకారసహితమైనవి), అమూర్తము (ఆకారరహితమైనవి) అన్నింటిలోనూ కొంత రయి వున్నది. కొంత ప్రాణమున్నది. మూర్తము, అమూర్తమునైన సమస్త జగత్తూ రయి, దానిలో చేతన ప్రసాదించేది ప్రాణం అని అర్థం. అందరికీ వెలుగును, వేడిమిని పంచే సూర్యుడ్ని ప్రాణంగా, కేవలం స్థూలాకృతులకు ప్రతీకగా నిలిచే చంద్రుడ్ని రయిగా భావించి చెప్పబడుతున్నది మన శరీరంలోకూడ జీవన శక్తి సూర్యసంబంధమైనదికాని, మాంసము, ఎముకలు మొదలైనవన్నీ చంద్రుని అంశగా తెలుసుకోవాలి. (5)

**అథాదిత్య ఉదయన్యత్ప్రాచీం దిశం ప్రవిశతి తేన ప్రాచ్యాన్ రశ్మిషు సంనిధత్తే । యద్దక్షిణాం యత్ప్రతీచీం యదుదీచీం యదధో యదూర్ధ్వం యదన్తరా దిశో యత్సర్వం ప్రకాశయతి తేన సర్వాన్ ప్రాణాన్ రశ్మిషు సంనిధత్తే ॥**

సకల ప్రాణుల్లోగల జీవన శక్తికి, సూర్యునికి గల సంబంధాన్ని ఈ శ్లోకంలో చూప బడుతున్నది. రాత్రి గడిచిన పిదప సూర్యుడు తూర్పున ఉదయించినప్పుడు ఆ దిక్కునగల ప్రాణులన్నింటినీ తన ప్రకాశంతో ఆవరించి వాటికి జీవనస్ఫూర్తి కలిగిస్తాడు. అదే విధంగా పొద్దు గడిచినకొద్దీ వివిధ దిశలకు వెలుగు, వేడిమి ప్రసరింపజేస్తాడు. ఇలా దక్షిణం, ఉత్తరం, పడమట, పై లోకాలు, కింది లోకాల కన్నిటికీ వెలుగులందిస్తూ సూర్యుడు సర్వప్రాణుల్నీ, సమస్త విశ్వాన్నీ తన కిరణాలతో ఉత్తేజితంచేస్తూ ప్రాణశక్తికి ఆలవాలమై వుంటాడు (6)

**స ఏష వైశ్వానరో విశ్వరూపః ప్రాణోऽగ్నిరుద్రయతే । తదేతదృచాభ్యుక్తమ్ ॥**

ఈ సూర్యునివల్లనే వైశ్వానర అగ్ని (జఠరాగ్ని) ప్రజ్వలితమౌతుంది. అలాగే దీనితర్వాతి ఋచా (చరణం) లో వివరించినట్లు విశ్వరూపప్రాణమే సూర్యుడు అంటే ప్రాణుల దేహాల్లో అన్నం అరిగించే జఠరాగ్ని ఏదైతే వుంటుందో అది సూర్యుని అంశేనని అర్థం [ఈ జఠరాగ్నినిగురించి ***భగవద్గీత,*** పదునైదవ అధ్యాయమైన **పురుషోత్తమప్రాప్తి యోగం** లో యిలా చెప్పబడింది . *అహం వైశ్వానరో* ***భూత్వా ప్రాణినాం దేహమాశ్రితః । ప్రాణాపానసమాయుక్తః పచామ్యన్నం చతుర్విధమ్ ॥*** - అనగా జీవరాసుల దేహాలందు నేను వైశ్వానరాగ్ని (జఠరాగ్ని) రూపంలో వుండి, ప్రాణాపాన వాయువులతోగూడి అవి తినే నాలుగు రకాల ఆహారాలను (భక్ష్యములు, భోజ్యములు, లేహ్యములు, చోష్యములు) జీర్ణం చేస్తాను అని అర్థం ] ఈ ప్రపంచంలో ప్రాణమంతా: 1. ప్రాణం; 2. అపానం; 3. సమానం; 4. వ్యానం; 5. ఉదానం అనే ఐదు అంశాలుగా విభజితమైవుంది ఈ ఐదు అంశాలతో కూడుకున్న ప్రాణం ఆ సూర్యుని అంశే. కనుక సూర్యుడే ప్రాణం **(7)**

**విశ్వరూపం హరిణం జాతవేదసం పరాయణం జ్యోతిరేకం తపన్తమ్ ।**
**సహస్రరశ్మిం శతధా వర్తమానః ప్రాణః ప్రజానాముదయత్యేష సూర్యః ॥**

విశ్వరూపుడు (విశ్వంలోని రూపాలన్నిటికీ కేంద్రంగావుండేవాడు), జాతవేదుడు (సర్వజ్ఞుడు), పరాయణుడు (సర్వధారి), జ్యోతిర్మయుడు, వేడితీవ్రతతో కాగిపోయే కిరణాలుగలవాడు, అద్వితీయుడు అయిన ఈ సహస్ర కిరణ సూర్యుడే వందలు, వేల రీతుల్లో చరిస్తూ, సమస్తజీవులకు ప్రాణంగా (జీవనప్రదాతగా) ఉదయిస్తూంటాడు **(8)**

**సంవత్సరో వై ప్రజాపతిస్తస్యాయనే దక్షిణం చోత్తరం చ । తద్యే హ వై తదిష్టాపూర్తే కృతమిత్యుపాసతే తే చాన్ద్రమసమేవ లోకమభిజయన్తే । త ఏవ పునరావర్తన్తే తస్మాదేత ఋషయః ప్రజాకామా దక్షిణం ప్రతిపద్యన్తే । ఏష హ వై రయిర్యః పితృయాణః ॥**

కాత్యాయనుడైన కబంధీ ప్రశ్నకు జవాబుగా సర్వశక్తిమంతుడైన ఆ పరబ్రహ్మ సంకల్పంవల్లే ప్రాణం, రయిల సంయోగంద్వారా ఈ జగత్తంతా సృష్టించ బడిందని పైన విశదీకరించబడింది. ఇప్పుడు ఈ ప్రాణశక్తి, రయిశక్తుల సంబంధంలో ఆ పరబ్రహ్మను ఉపాసించే తీరుతెన్నులు, దాని ఫలాలనుగురించి చెప్పబడుతున్నది సంవత్సరమే ప్రజాపతి. దానికి రెండు అయణాలు : ఒకటి దక్షిణాయణం, రెండవది ఉత్తరాయణం. సూర్యుడు ఉత్తరంవైపుగా చరించే అయనం ప్రజాపతికి ఉత్తర అంగంవంటిది. అదే ప్రాణస్వరూపమని దీనితర్వాతి శ్లోకంలో స్పష్టంగావించబడింది. ఇక్కడ దక్షిణాయణం ప్రజాపతికి దక్షిణ అంగంవంటిదని, ఇష్టకామ్యసిద్ధికోసం, ఐహిక భోగాలకోసం, ముఖ్యంగా సంతానప్రాప్తికోసం రుషులు ఈ అయణంలో ఉపాసన - తపస్సు, యజ్ఞయాగాదులు, పూజాదికాలు, అలాగే బావులు, చెరువులు తవ్వించడం, సత్రాలు, బడులు, గుడులు కట్టించడం వగైరా పుణ్యకార్యాలు చేస్తూవుంటారు. దీన్నే ఈశోపనిషత్తులో అసంభూతి అనే పేరిట దేవతలు, పితరులు, సాటి మానవులు మొదలైన దేహధారులకు సేవచేయడంగా అభివర్ణించడం జరిగిందని గ్రహించాలి. వీటి ఫలితంగా వారంతా చంద్రలోకాన్నే పొందుతారు. అక్కడ వారు తమ కర్మఫలాల్ని అనుభవించి తిరిగి వివిధ యోనుల్లో ప్రవేశించి వివిధ జన్మలెత్తడానికి తిరిగివస్తుంటారు. అంటే మళ్ళీ జనన మరణ చక్రంలో చిక్కుకుంటారు. నిస్సందేహంగా రయి అంటే యిదే. దీన్నే పితృయాణం అనికూడ అంటారు. **(9)**

**అథోత్తరేణ తపసా బ్రహ్మచర్యేణ శ్రద్ధయా విద్యయాఽఽత్మానమన్విష్యాదిత్య మభిజయన్తే । ఏతద్వై ప్రాణానామాయతనమేతదమృతమభయమేతత్ పరాయణమేతస్మాన్న పునరావర్తన్త ఇత్యేష నిరోధస్తదేష శ్లోకః ॥**

అయితే ఎవరైతే బ్రహ్మచర్యం ఆచరిస్తూ, తపస్సుచేస్తూ, శ్రద్ధాప్రపత్తులతో ఆధ్మాత్మిక చింతనద్వారా ఆ పరమాత్మను అన్వేషిస్తూ తమ జీవితాల్ని సార్థకం చేసుకుంటారో వారు ఉత్తరాయణ మార్గంగుండా సూర్యలోకాన్ని ప్రాప్తం గావించుకుంటారు ఈ సూర్యుడే సమస్త ప్రాణాలకు కేంద్రం. ఈ సూర్యుడే అనశ్వరుడు, అమృతుడు. నిర్భయ పదస్థుడు, పరమ గతి ఈ సూర్యుడే. కనుక ఈ పరమపదాన్ని పొందినవారు మళ్లీ జనన మరణ చక్రంలో చిక్కుకోవడానికి తిరిగిరావడమంటూ వుండదు ఈ విధంగా ఇది (ఉత్తరాయణ మార్గం) పునర్జన్మ నిరోధకం, పరమగతి ప్రదాయకం. ఈ శ్లోకంలో సూర్యుణ్ని పరమాత్మ స్వరూపంగా అభివర్ణిస్తూ, ఉత్తరాయణ మార్గంలో ఈ సూర్యుడు ప్రాప్తమవుతాడనే విషయం స్పష్టం చేయబడింది. **(10)**

**పఞ్చపాదం పితరం ద్వాదశాకృతిం దివ ఆహుః పరే అర్ధే పురీషిణమ్ । అథేమే అన్యే ఉ పరే విచక్షణం సప్తచక్రే షడరే ఆహురర్పితమితి ॥**

ఐదు పాదాలు గలవాడు, పన్నెండు ఆకారాలుగలవాడు, అందరికీ తండ్రియైన వాడు, నీటిని ఉత్పత్తిగావించేవాడు అయిన ఈ సూర్యుడు దివానికి (స్వర్గ లోకానికి) యింకా పైన అత్యున్నతస్థానంలో నెలకొని వున్నాడని చెబుతారు. ఇంకా మరెందరో జనులు ఈ సూర్యుడు ఏడు చక్రాలు, ఆరు అరలుగల రథాసీనుడై అందరినీ చక్కగా ఎరిగివుండేవాడు (దేవుడు) అనికూడ చెబుతారు ఆరు ఋతువుల్లో రెంటిని - హేమంత, శిశిరాలను - ఒక్కటిగా చూచి, మొత్తం ఐదుగా భావించి, వాటిని సూర్యుని ఐదు పాదాలుగా చెబుతారు. అలాగే సంవత్సరంలోని 12 నెలలను సూర్యుని పన్నెండు ఆకారాలుగా పేర్కొంటారు. అందరికీ జలరూపంలో జీవనం ప్రదానంచేస్తాడుగనుగ సూర్యుణ్ని అందరికీ తండ్రి అని చెబుతారు. ఇంద్రధనుస్సులోని ఏడు రంగులు

సూర్యుని రథానికిగల ఏడు చక్రాలు; ఆరు రుతువులు ఆ రథంలోని ఆరు అరలుగాకూడ మరోవిధంగా అభివర్ణిస్తారు [సప్తాశ్వరథమారూఢమ్ ... అని మరో వర్ణన]. ఇదంతా సర్వజ్ఞుడైన ఆ పరబ్రహ్మ రూపవికాసమేనట స్థూలనేత్రాలకు కనిపించే సూర్యమండలమే పరబ్రహ్మ శరీరం, ఈ సకల చరాచర ప్రకృతంతా పరబ్రహ్మ మహిమేనని చెప్పడం జరుగుతున్నది (11)

**మాసో వై ప్రజాపతిస్తస్య కృష్ణపక్ష ఏవ రయిః శుక్లః ప్రాణస్తస్మాదేత ఋషయః శుక్ల ఇష్టం కుర్వన్తీతర ఇతరస్మిన్ ॥**

నెలయే ప్రజాపతి దాని కృష్ణపక్షమే రయి దాని శుక్లపక్షమే ప్రాణం కనుకనే కళ్యాణకాములైన ఋషిగణాలు శుక్లపక్షంలో నిష్కామభావనతో యజ్ఞ యాగాది సత్కర్మలు నిర్వహిస్తుంటారు. ఇతరులు సాంసారిక భోగాలు కోరుకుంటూ సకామభావంతో కృష్ణపక్షంలో శుభకర్మలు చేస్తుంటారు. [ఇదే *భగవద్గీత,* రెండవ అధ్యాయమైన *సాంఖ్యయోగం* లోని 42-44 శ్లోకాల్లో చక్కగా వివరింపబడింది. 43వ శ్లోకంలో *కామాత్మానస్స్వర్గపరాః జన్మకర్మఫలప్రదామ్ । క్రియావిశేష బహులాం భోగైశ్వర్యగతిం ప్రతి ॥*- స్వర్గసుఖాల్నిమించి వేరొకటి లేదని వాదిస్తూ ఇష్టకామ్యసిద్ధిని కాంక్షిస్తూ దానికి కర్మకాండలే ముఖ్యమని తలచి, ఆచరిస్తూ జనన మరణ ప్రవాహంలోపడి కొట్టుకుపోతుంటారు - అని చెప్పబడింది ]. (12)

**అహోరాత్రో ప్రజాపతిస్తస్యాహరేవ ప్రాణో రాత్రిరేవ రయిః ప్రాణం వా ఏతే ప్రస్కన్దన్తి యే దివా రత్యా సంయుజ్యన్తే బ్రహ్మచర్యమేవ తద్యద్రాత్రౌ రత్యా సంయుజ్యన్తే ॥**

పగలు,రాత్రుల జంటే ప్రజాపతి. దానిలో పగలే ప్రాణం. రాత్రే రయి కనుక పగలు రతిక్రియ (స్త్రీసంభోగం) జరిపేవారు నిశ్చయంగా తమ ప్రాణాల్ని క్షీణింపజేసుకుంటారు. అయితే ఎవరైతే రాత్రుళ్లు సంభోగంచేస్తారో అది శ్రేయస్కరం, నిజానికి అది బ్రహ్మచర్యమే (దాని కిందికే లెక్క) [ శాస్త్రాలను అనుసరించి ఋతుకాలంలో రాత్రిపూటల్లో నియమితప్రకారంగా స్త్రీసంభోగం చేస్తే అది బ్రహ్మచర్యతుల్యమేనట. రజోదర్శనంనుండి (రుతుస్రావం మొదలైనప్పటి

నుండి) పదహారు దినాలు స్వాభావిక రుతుకాలం అంటారు. వీటిలో మొదటి నాలుగు రాత్రులు, ఇంకా 11వ, 13వ రాత్రులు పూర్తిగా వర్జ్యమైనవి. మిగతా 10 రాత్రుల్లో ఏవైనా పండగదినాలు వస్తే వాటిని వదిలిపెట్టాలి. ఇలా మినహాయిస్తూపోయి నెలకు రెండు రాత్రులుమాత్రమే తన భార్యతో సంభోగం, అదీ పుత్రోత్పత్తికోసమే, జరిపే వ్యక్తి గృహస్థాశ్రమంలోవున్నప్పటికీ బ్రహ్మచారిగానే లెక్కకు వస్తాడని మనుస్మృతి, 3/45-47, 50 శ్లోకాలలో చెప్పబడింది] **(13)**

**అన్నం వై ప్రజాపతిస్తతో హ వై తద్రేతస్తస్మాదిమాః ప్రజాః ప్రజాయన్త ఇతి ॥**

అన్నమే ప్రజాపతి ఎందుకంటే దానివల్లే వీర్యం ఉత్పత్తి అవుతుంది. ఆ వీర్యం వల్లే ఈ సర్వచరాచర ప్రాణికోటి ఉత్పన్నమవుతుంది. అందుకే అన్నం పరబ్రహ్మ స్వరూపమ్ అనికూడ అంటారు. **(14)**

**తద్యే హ వై తత్ప్రజాపతివ్రతం చరన్తి తే మిథునముత్పాదయన్తే । తేషామేవైష బ్రహ్మలోకో యేషాం తపో బ్రహ్మచర్యం యేషు సత్యం ప్రతిష్ఠితమ్ ॥**

ఎవరైతే (సంతానోత్పత్తిరూప) ప్రజాపతివ్రతాన్ని నియమానుసారం అనుష్టిస్తారో, అంటే స్వర్గాది శుభలోకప్రాప్తికోసం విధివత్తుగా కర్మకాండలు జరుపుతూ, పైన చెప్పిన విధంగా శాస్త్రోక్తంగా రతిసంభోగం జరుపుతారో, వారు ఒక జంటను (కొడుకు, కూతుళ్ల జంటను) కంటారు. పోతే ఎవరైతే తపస్సు, బ్రహ్మచర్యం, సత్యనిష్ఠ కలిగి [ఐహికభోగాల నాశించకుండా సదా పరబ్రహ్మ యందు మనసు లగ్నంచేసి] వుంటారో వారికే ఆ బ్రహ్మలోకం ప్రాప్తమవుతుంది గాని యితరులకైతే కాదు **(15)**

**తేషామసౌ విరజో బ్రహ్మలోకో న యేషు జిహ్మమనృతం న మాయా చేతి ॥**

ఎవరిలోనైతే కుటిలతగాని, కపటం(మాయ)గాని, అబద్ధంగాని వుండవో అంటే ఎవరైతే రాగద్వేషాలకు దూరంగావుంటూ, నిష్కల్మష హృదయులైవుంటారో వారికిమాత్రమే ఈ విశుద్ధ, నిర్వికార బ్రహ్మలోకం లభిస్తుంది **(16)**

# ప్రథమ ప్రశ్న సమాప్తం

* * * * *

# 2. రెండవ ప్రశ్న

**అథ హైనం భార్గవో వైదర్భిః పప్రచ్ఛ । భగవన్కత్యేవ దేవాః ప్రజాం విధారయన్తే కః పునరేషాం వరిష్ఠ ఇతి ॥**

ఆ (మొదటి ప్రశ్న) తర్వాత విదర్భదేశీయుడైన భార్గవుడు పిప్పలాద మహర్షిని యిలా అడిగాడు : భగవాన్ ! ప్రజల్ని (అంటే ప్రాణుల శరీరాల్ని) ధరించే దేవతలు మొత్తం ఎందరున్నారు ? వారిలో ఎవరెవరు ప్రజలను ప్రకాశితం చేస్తారు (వారికి వెలుగు నిస్తారు)? వారందరిలో సర్వశ్రేష్ఠుడైన దేవత ఎవరు ? (1)

**తస్మై స హోవాచాకాశో హ వా ఏష దేవో వాయురగ్నిరాపః పృథివీ వాఙ్మనశ్చక్షుః శ్రోత్రం చ । తే ప్రకాశ్యాభివదన్తి వయమేతద్బాణమవష్టభ్య విధారయామః ॥**

అప్పుడు పిప్పలాద మహర్షి భార్గవునికి యిలా జవాబిచ్చాడు . నిశ్చయంగా ఆ ఆకాశమే ఈ [ప్రసిద్ధ సర్వశ్రేష్ఠ] దేవత ఇంకా వాయువు, అగ్ని, నీరు, భూమి, వాణి(మాట), కళ్లు, చెవులు మరియు మనస్సు(అంతఃకరణం) కూడ దేవతలే. ఇవన్నీ తమ తమ శక్తులు ప్రకటించేస్తూ మేము ఈ శరీరానికి ఆశ్రయం యిచ్చి, దాన్ని ధరించివున్నామంటూ అభిమానపూర్వకంగా ఘోషిస్తుంటాయి. అంటే అన్నింటికీ ఆధారం ఆకాశం అయితే దాన్నుండి ఉత్పన్నమయ్యే గాలి, నిప్పు, నీరు, నేల - ఈ నాలుగు మహాభూతాలుకూడ శరీరాన్ని ధరించి వున్నాయి. ఈ స్థూలశరీరం వీటినుండే తయారైంది. కనుక ఇవి ధారక దేవతలు. ఇవిగాక వాక్కు మొదలైన ఐదు కర్మేంద్రియాలు, నేత్రాలు, శ్రోత్రాలు (కళ్లు, చెవులు) మొదలైన ఐదు జ్ఞానేంద్రియాలు, ఇంకా మనస్సుమొదలైన నాలుగు అంతఃకరణాలు - మొత్తం ఈ పద్నాలుగు దేవతలు శరీరాన్ని ధరించడమేగాక ప్రకాశింపజేస్తాయికూడ కనుక యివి ప్రకాశక దేవతలు ఇవి యీ దేహాన్ని ప్రకాశింపజేస్తూ, తమలోతాము " మేము ఈ శరీరానికి ఆశ్రయమిచ్చి ప్రకాశింపజేస్తున్నాము" అంటూ గొప్పగా చెప్పుకుంటున్నట్లు ఒక పాడుపు కథలా పిప్పలాదుడు చెబుతున్నాడు. (2)

**తాన్వరిష్ఠః ప్రాణ ఉవాచ । మా మోహమాపద్యథాహమేవైతత్పఞ్చధాఽఽత్మానం ప్రవిభజ్యైతద్బాణమవష్టభ్య విధారయామీతి తేఽశ్రద్దధానా బభూవః ॥**

అప్పుడు వాటన్నింటికంటె సర్వశ్రేష్ఠమైన ప్రాణం యిలా అందట · మోహంలో పడకండి ! నేనే నా ఈ స్వరూపాన్ని ఐదు భాగాలుగా విభజించి ఈ శరీరానికి ఆశ్రయమిచ్చి ధరిస్తున్నాను. అంటే అనవసరంగా మీలో మీరు వాదులాడుకోవడ మెందుకు ? మీలో ఎవ్వరికీకూడ ఈ శరీరాన్ని ధరించే, ప్రకాశింపజేసే శక్తిలేదు కాగా నేనే ( ప్రాణం, అపానం, సమానం, వ్యానం, ఉదానం అనే) ఐదు భాగాలుగా నన్ను నేను విభజించుకుని ఈ శరీరాన్ని ధరించి వున్నాను నావల్లనే అది ప్రకాశమానమై, సురక్షితమై వుంది అని వివరించిందట కాని యిదంతా విన్నా పై దేవతలెవరికీ ప్రాణం చెప్పిన విషయాలపై నమ్మకం కలగలేదట (3)

**సోఽభిమానాదూర్ధ్వముత్క్రమత ఇవ తస్మిన్నుత్క్రామత్యథేతరే సర్వ ఏవోత్క్రామన్తే తస్మింశ్చ ప్రతిష్ఠమానే సర్వ ఏవ ప్రాతిష్ఠన్తే । తద్యథా మక్షికా మధుకరరాజానముత్క్రామన్తం సర్వా ఏవోత్క్రామన్తే తస్మింశ్చ ప్రతిష్ఠమానే సర్వా ఏవ ప్రాతిష్ఠన్త ఏవం వాఙ్మనశ్చక్షుఃశ్రోత్రం చ తే ప్రీతాః ప్రాణం స్తున్వన్తి ॥**

అప్పుడు ప్రాణం (దెబ్బతిన్న అహంతో) అభిమానపూర్వకంగా లేచి శరీరం విడిచి పైకి ( బయటకు) వెళ్లిపోసాగిందట అలా దేహం బయటకు వెళ్లిపోగానే దానితోబాటే మిగతా దేవతలంతాకూడ తమప్రమేయంలేకుండానే పైకి లేచి వెళ్లిపోసాగారట ఆనక కొంతసేపటికి అది( ప్రాణం) మళ్లీ కిందకు వచ్చి శరీరంలో ప్రవేశించగానే మిగతా దేవతలంతా ఆటోమాటిక్గా కిందకు వచ్చేసి శరీరంలో యిమిడిపోయారట. ఎలాగైతే తేనెతుట్టెనుండి రాణీ ఈగ (లేక రాజు ఈగ) బయటికిపోగానే మిగతా ఈగలన్నీ వేధిగా జుమ్మని దానివెంటే కదిలిపోతాయో, మళ్లీ ఎలాగైతే రాణీ ఈగ తుట్టెలోకి తిరిగిరాగానే మిగతా ఈగలన్నీ ఆటోమాటిక్గా తిరిగివచ్చేస్తాయో యిదీ అలాగే జరిగిందట ఈ పరిణామాన్ని గమనించి తమకంటె ప్రాణం శ్రేష్ఠమైనదని అర్థం చేసుకుని పైన చెప్పిన - వాక్కు, చక్షువు, శ్రోత్రం, మనస్సు మొదలైన - దేవతలంతా ప్రసన్నులై ప్రాణం గొప్పదంటూ జయగానం చేయసాగారట. (4)

**ఏషోఽగ్నిస్తపత్యేష సూర్య ఏష పర్జన్యో మఘవానేష వాయుః।**
**ఏష పృథివీ రయిర్దేవః సదసచ్చామృతం చ యత్॥**

ఇప్పుడు ప్రాణాన్ని (పరబ్రహ్మస్వరూపంగా భావించి) ఈ విధంగా స్తుతించడం జరుగుతున్నది ఈ ప్రాణం అగ్నిరూపంలో మండుతుంది ఇదే సూర్యుడు. ఇదే పర్జన్యము (మేఘం) ఇంకా యిదే ఇంద్రుడు ఇదే వాయువు ఈ ప్రాణ రూప దేవతే పృథ్వి ఇదే రయి. అంటే సర్వభూత సముదాయమూ ఈ ప్రాణమే. సత్తు లేక అసత్తు ఏదైతేవుందో, అలాగే అమృతమని ఏదైతే చెప్ప బడుతుందో అదంతా యిదే (ఈ ప్రాణమే). **(5)**

**అరా ఇవ రథనాభౌ ప్రాణే సర్వం ప్రతిష్ఠితమ్।**
**ఋచో యజూంషి సామాని యజ్ఞః క్షత్రం బ్రహ్మ చ॥**

రథచక్రపు బొడ్డు (నడిమి దిమ్మె) ఆధారంగా కూర్చబడివున్న చక్రపు ఆకుల విధంగా ఋగ్వేదపు సమస్త ఋచాలు, యజుర్వేద మంత్రాలు, అలాగే సామవేద మంత్రాలు, యజ్ఞయాగాలు, వాటిని చేసే బ్రాహ్మణ, క్షత్రియ తదాది అధికార వర్గాలు సమస్తమూకూడ ప్రాణం ఆధారంగానే నిలిచివున్నాయి వీటన్నిటి ఆశ్రయం ప్రాణమే. **(6)**

**ప్రజాపతిశ్చరసి గర్భే త్వమేవ ప్రతిజాయసే । తుభ్యం ప్రాణ ప్రజాస్త్విమా బలిం హరన్తి యః ప్రాణైః ప్రతితిష్ఠసి ॥**

పైన ప్రాణం మహత్తునుగురించి వివరించిన పిదప యిప్పుడు ప్రాణాన్ని స్తుతించడం జరుగుతున్నది. ఓ ప్రాణమా ! నీవే ప్రజాపతివి (సకల ప్రాణులకు ఈశ్వరుడివి)। నీవే తల్లిగర్భంలో విచరిస్తూ, తల్లిదండ్రులకు అనురూపంగా జన్మ ధరిస్తూ వుంటావు. నిశ్చయంగా ఈ సమస్త జీవులూ నీకే కానుక లర్పించుకుంటారు నీవే అపానాది యితర ప్రాణాలతోబాటుగా అందరి శరీరాల్లో స్థితమైవుంటావు. **(7)**

**దేవానామసి వహ్నితమః పితౄణాం ప్రథమా స్వధా ।**
**ఋషీణాం చరితం సత్యమథర్వాఙ్గిరసామసి ॥**

ఓ ప్రాణమా ! నీవు దేవతలకు (హవిని చేర్చే) ఉత్తమ అగ్నివి పితరులకోసం సమర్పించబడే మొదటి స్వధవు (పిండానివి). అథర్వాంగిరస మొదలైన రుషులద్వారా ఆచరించబడిన, వాళ్లకు స్వీయానుభవంలో అభివ్యక్తమైన సత్యానివి నీవే. **(8)**

**ఇంద్రస్త్వం ప్రాణ తేజసా రుద్రోऽసి పరిరక్షితా ।**
**త్వమన్తరిక్షే చరసి సూర్యస్త్వం జ్యోతిషాం పతిః ॥**

ఓ ప్రాణమా ! నీవే తేజోవంతుడైన ఇంద్రుడివి నీవే రుద్రుడివి నీవే పరిరక్షకుడివి. నీవే అంతరిక్షంలో చరించే వాడివి. నీవే జ్యోతిర్గణాలకు స్వామివి అంటే సర్వరకాల తేజోశక్తులుగల, ముల్లోకాలకు అధిపతియైన ఇంద్రుడు, ప్రళయకాలంలో సర్వసంహారంగావించే రుద్రుడు, భూలోకానికి, స్వర్గలోకానికి నడుమగల అంతరిక్షంలో విచరించే వాయువు అన్నీ ఈ ప్రాణరూపాలే. అలాగే అగ్ని, చంద్రుడు, తారలు మొదలైన సమస్త జ్యోతిర్గణాల స్వామియైన సూర్యుడుకూడ ఈ ప్రాణరూపమే ఈ ప్రాణమే సర్వజనులనూ యథోచితరీతిలో సంరక్షిస్తూంటుందని అర్థం. **(9)**

**యదా త్వమభివర్షస్యథేమాః ప్రాణ తే ప్రజాః ।**
**ఆనందరూపాస్తిష్ఠన్తి కామాయాన్నం భవిష్యతీతి ॥**

ఓ ప్రాణమా ! నీవెప్పుడైతే (మేఘరూపంలో) సమృద్ధిగా వర్షం కురిపిస్తావో అప్పుడు నీ యీ ప్రజలంతా ఇక కోరినంతగా అన్నధాన్యాలు పండుతాయని తెలిసి మురిసిపోతారు - ఆనందస్వరూపులవుతారు. **(10)**

వ్రాత్యస్త్వం ప్రాణైకర్షిరత్తా విశ్వస్య సత్పతిః ।
వయమాద్యస్య దాతారః పితా త్వం మాతరిశ్వ నః ॥

ఓ ప్రాణమా ! నీవు సంస్కారరహితమైవుండికూడ ఏకమాత్ర సర్వశ్రేష్ఠ రుషివిగా వున్నావు మేము నీకు భోజనం తెచ్చియిచ్చేవాళ్లం నీవు భోక్తవు. సమస్త జగత్తుకు నీవే సర్వశ్రేష్ఠుడైన యజమానివి ఆకాశంలో విచరించే ఓ వాయుదేవా నీవే మా తండ్రివి. అంటే యింతకుముందు ప్రస్తావించబడ్డ ఇంద్రియాలు, మనస్సు మొదలైన దేవతలన్నీ ప్రాణం సర్వశ్రేష్ఠతను ఒప్పుకుంటూ మేమంతా నీకు వివిధ మార్గాలలో రకరకాలైన భోజనసామగ్రి తెచ్చియిస్తే నీవు భోక్తగా వాటిని ఆరగించి మాకందరికీ శక్తియుక్తులు ప్రసాదిస్తున్నావు, నీవే ఈ సమస్త విశ్వానికి స్వామివి, ఆకాశచారియైన సమష్టివాయు స్వరూపం నీది, నీవల్లనే మేమందరమూ జనించాముగనుక నీవే మాకందరికీ తండ్రివి అని జయగానం చేస్తున్నాయట. (11)

యా తే తనూర్వాచి ప్రతిష్ఠితా యా శ్రోత్రే యా చ చక్షుషి ।
యా చ మనసి సన్తతా శివాం తాం కురు మోత్క్రమీః ॥

ఓ ప్రాణమా ! వాక్కులో, కళ్లలో, చెవుల్లో, సమస్త ఇంద్రియాల్లో, మనస్సు మొదలైన అంతఃకరణాల్లో నీ రూపమేదైతే వ్యాపించివుందో దాన్ని మాకందరికీ కళ్యాణమయంగానే వుండనీ (అంతేగాని మాపై కోపించి) బయటకు వెళ్లిపోకు ఇదే మా ప్రార్థన (12)

ప్రాణస్యేదం వశే సర్వం త్రిదివే యత్ప్రతిష్ఠితమ్ ।
మాతేవ పుత్రాన్ రక్షస్వ శ్రీశ్చ ప్రజ్ఞాం చ విధేహి న ఇతి ॥

ఈ ప్రత్యక్ష జగత్తులో, అలాగే స్వర్గలోకంలో వున్న సర్వస్వమూ ప్రాణానికి వశమైవుంది కనుక ఓ ప్రాణమా ! ఒక తల్లి తన కొడుకుల్ని ఎలా ప్రేమగా చూచి రక్షించుకుంటుందో అదే విధంగా నీవు మమ్మల్ని (సర్వేంద్రియాలు,

మనస్సు మొదలైన అంతఃకరణాలను) రక్షించేది మాకు తేజస్సును, బుద్ధిని ప్రదానం చేసేది. ఇదే మా ప్రార్థన ఇలా రెండో ప్రశ్న ముగిసిపోయింది **(13)**

ఈ ప్రకరణంలో పిప్పలాద మహాఋషి రెండో ప్రశ్నలో భాగంగా భార్గవుడు అడిగిన మూడు ప్రశ్నలకు జవాబిచ్చాడు. సమస్త ప్రాణుల శరీరాలను లోనుండి, వెలుపలినుండి ధరించేది ఆకాశతత్వం - దానితోబాటు ఈ శరీరావయవాలుగా వర్తించేవి వాయువు, అగ్ని, జలము, పృథ్వి వెరసి పంచభూతాలు. పోతే పది ఇంద్రియాలు, అంతఃకరణాలు( మనస్సు, బుద్ధి మొదలైనవి) ఈ శరీరానికి వలసిన తేజస్సును ప్రదానంచేసి దీన్ని క్రియాశీలం చేస్తాయి. కాని వీటన్నింటికంటే శ్రేష్ఠమైనది ప్రాణం. అది లేకపోతే పై (దేవతారూప) తత్వాలన్నీ శరీరంనుండి లుప్తమైపోతాయి. కనుక వాస్తవంలో ప్రాణమే ఈ శరీరాన్ని ధరించివుండేది అన్య తత్వాలన్నీ దీన్నుండే తమ శక్తుల్ని, ప్రకాశాన్ని పొందుతాయి. ఈ విధమైన ప్రాణశక్తి వర్ణన మనకు ఛాందోగ్యోపనిషత్తులోని ఐదవ అధ్యాయ ఆరంభంలోనూ, బృహదారణ్యకోపనిషత్తులోని ఆరవ అధ్యాయ ఆరంభంలోనూ కూడ కనిపిస్తుంది కాని వాటిల్లోకంటె యిక్కడే ప్రాణశక్తి స్తుతి ఎక్కువగా వుందని గమనించాలి.

# ద్వితీయ ప్రశ్న సమాప్తం

★★★

# ౩. మూడవ ప్రశ్న

**అథ హైనం కౌసల్యశ్చాశ్వలాయనః పప్రచ్ఛ భగవన్కుత ఏష ప్రాణో జాయతే కథమాయాత్యస్మిన్శరీర ఆత్మానం వా ప్రవిభజ్య కథం ప్రతిష్ఠతే కేనోత్క్రమతే కథం బాహ్యమభిధత్తే కథమధ్యాత్మమితి ॥**

ఆ తర్వాత ఆ ప్రసిద్ధ పిప్పలాద మహర్షిని కోసలదేశస్థుడైన ఆశ్వలాయనుడు యిలా అడిగాడు భగవాన్! (1) ఈ ప్రాణం దేనినుండి ఉత్పన్నమవుతుంది ? (2) ఈ శరీరంలోకి ఎలా ప్రవేశిస్తుంది ? (3) ఆపై తన్ను విభజించుకుని ఈ శరీరంలోని (వివిధ ఇంద్రియాలు, అంతఃకరణాలలో) ఎలా స్థితమవుతుంది ? (4) ఏ విధంగా ఈ శరీరంనుండి నిష్క్రమిస్తుంది ? (5) అలా నిష్క్రమించిన ఈ ప్రాణం ఏ విధంగా(పాంచభౌతికమైన) బాహ్యజగత్తును చక్కగా ధరిస్తుంది? (6) అలాగే ఆధ్యాత్మిక జగత్తును (అంటే మనస్సు, ఇంద్రియాలు మొదలైనవాటితోకూడుకున్న శరీరంలోపలి జగత్తును) ఎలా ధరిస్తుంది ? మొదట అడిగిన ప్రశ్నల్లో లేని అంశాలగురించి, మొదటి రెండు ప్రశ్నల జవాబుల పర్యవసానంగా స్ఫురించే యితర అంశాలగురించే ఈ ప్రశ్న వుండడం గమనిస్తే, ఈ ప్రశ్న-జవాబుల సెషన్‌లో సుకేశుడు మొదలైన ఈ ఆరుగురు రుషులూకూడ పక్కపక్కనే కూర్చుని వున్నట్లు, ఒక విధంగా వారంతా కూడ బలుక్కునే యిలా వరుసగా ప్రశ్నలడిగి జవాబులు రాబట్టుకున్నట్లు మనకు తోచకమానదు. (1)

**తస్మై స హోవాచాతిప్రశ్నాన్పృచ్ఛసి బ్రహ్మిష్ఠోఽసీతి తస్మాత్తేఽహం బ్రవీమి ।**

అప్పుడు ఆ కౌసల్యుడితో పిప్పలాద మహర్షి యిలా అన్నాడు నీవు చాల కఠినమైన ప్రశ్నే అడిగావు. సరే, వేదాలన్నింటినీ చక్కగా తెలుసుకొన్నవాడిని గనుక నేను నీవు వేసిన ప్రశ్నలకు జవాబిస్తాను. ఇక్కడ ప్రశ్న అడిగిన తీరుపట్ల పిప్పలాదుని అసహనంకూడ వ్యక్తమవుతున్నది. (2)

**ఆత్మన ఏష ప్రాణో జాయతే యథైషా పురుషే ఛాయైతస్మిన్నేతదాతతం మనోకృతేనాయాత్యస్మిన్ఛరీరే ॥**

ఈ ప్రాణం పరమాత్మనుండి ఉత్పన్నమవుతుంది. ఏవిధంగానైతే పురుషుడంటూ వున్నప్పుడే అతని నీడ అనేది వుంటుందో (పడుతుందో) అదే విధంగా ఈ ప్రాణం ఆ పరమాత్మను ఆశ్రయించేవుంటుంది [ఇది కౌసల్యుని మొదటి ప్రశ్నకు జవాబు]. పోతే ఈ ప్రాణం మనోసంకల్పంద్వారా శరీరంలోకి ప్రవేశిస్తుంది. అంటే చనిపోయేటప్పుడు ప్రాణి మనస్సులో దాని కర్మానుసారంగా ఎలాంటి సంకల్పం కలుగుతుందో దాని కనుగుణమైన శరీరమే దానికి లభిస్తుందని. కనుక మనోసంకల్పంద్వారానే ప్రాణం శరీరప్రవేశం చేస్తుందని ఎరుగాలి [ఇది ఆశ్వలాయనుని రెండో ప్రశ్నకు జవాబు]. **(3)**

**యథా సమ్రాడేవాధికృతాన్వినియుఙ్క్తే ఏతాన్గ్రామానేతాన్గ్రామానధితిష్ఠస్వేత్యే వమేవైష ప్రాణ ఇతరాన్ ప్రాణాన్పృథక్పృథగేవ సంనిధత్తే ॥**

ఏ విధంగానైతే ఒక చక్రవర్తి మహారాజు స్వయంగా వివిధ అధికారులను నీవు ఈ గ్రామాల్లో వుండు, నీవు ఆ గ్రామాల్లో వుండు అని చెప్పి వేరు వేరు చోట్లకు, విధులకు నిర్దేశిస్తుంటాడో, అదే విధంగా ఈ ప్రాణం (అంటే ప్రధాన ప్రాణం) ఇతర ప్రాణాలన్నింటినీ (అపానం, సమానం, వ్యానం మొదలైనవాటిని) వేరు వేరుగా వివిధ చోట్ల, వివిధ విధులకు నియమిస్తుంది **(4)**

**పాయూపస్థేஉపానం చక్షుఃశ్రోత్రే ముఖనాసికాభ్యాం ప్రాణః స్వయం ప్రతిష్ఠతే మధ్యే తు సమానః । ఏష హ్యేతద్ధుతమన్నం సమం నయతి తస్మాదేతాః సప్తార్చిషో భవన్తి ॥**

అది (ప్రాణం) గుదస్థానం, ఉపస్థభాగాలలో అపానాన్ని (పిత్తును) వుంచుతుంది తాను స్వయంగా (అంటే ప్రధాన ప్రాణం) నోరు, ముక్కులగుండా విచరిస్తూ కళ్లు, చెవులలో స్థితమైవుంటుంది. పోతే శరీర మధ్యభాగంలో సమానాన్ని

వుంచుతుంది ఈ సమాన వాయువే ఈ ప్రాణాగ్నిలో హవనం చేయబడ్డ అన్నాన్నంతటినీ శరీరమంతటా వివిధభాగాలకు యధాసాధ్యమైన సమాన భావంతో పంపిణీ చేస్తూంటుంది. దానినుండే ఈ సప్తజ్వాలలు ఉత్పన్న మవుతాయి ఇక్కడ పిప్పలాదుడు పంచప్రాణాలగురించి వివరిస్తున్నాడు వాటన్నిటికీ దర్శకత్వం, యాజమాన్యం ప్రాణమే( ప్రధాన ప్రాణం) అని స్పష్టం చేస్తూనే సమానంయొక్క మహత్తును వర్ణిస్తున్నాడు ఈ సమాన వాయువువల్లనే పొట్టలో వేసుకునే అన్నమంతా జీర్ణమై దాని సారరసం శరీరంలోని అంగ ప్రత్యంగాలకు యథోచిత రీతిలో సమభావంతో పంపిణీ చేయబడుతుందట. ఇలా పంపిణీ అయ్యే సారభూత రసంవల్లే సప్త జ్వాలలు - అంటే సమస్త విషయాలను ప్రకాశితం చేసే రెండు కళ్ళు, రెండు చెవులు, రెండు ముక్కుపుటాలు, ఒక నాలుక(నోరు) అనే ఏడు ద్వారాలు ఉత్పన్నమవుతాయి. సమానంద్వారా పంపిణీ అయ్యే ఈ అన్న రసంద్వారా పుష్టి పొందినప్పుడే ఈ ఏడు ద్వారాలు తమతమ పనులు ( విధులు) చేయగల్గుతాయంటాడు **(5)**

**హృది హ్యేష ఆత్మా అత్రైతదేకశతం నాడీనాం తాసాం శతం శతమేకైకస్యాం ద్వాసప్తతిర్ద్వాసప్తతిః ప్రతిశాఖానాడీసహస్రాణి భవన్త్యాసు వ్యానశ్చరతి ||**

ఈ జీవాత్మ హృదయప్రదేశంలో నెలకొనివుంటుంది ఈ హృదయంలో (గుండెలో) మౌలికంగా ఒక వంద నాడులసముదాయం వుంటుంది. ఆ నాడుల్లో ప్రతి ఒక్కదానికీ నూరేసి శాఖలున్నాయి ఇలాంటి ప్రత్యేక నాడీశాఖలకు మళ్లీ ఒక్కొక్కదానికీ 72వేల నాడీఉపశాఖలచొప్పున వుంటాయి ఈ విధంగా శరీరంలో మొత్తం 72 కోట్ల నాడులు వున్నాయి ఈ సమస్త నాడులు, నాడీశాఖలు, నాడీఉపశాఖల్లో వ్యానవాయువు చరిస్తూంటుంది అంటే వ్యానం అనేది నాడీముఖంగా శరీరమంతటా వ్యాపించివుండే ప్రాణవాయువని తెలుసుకోవాలి **(6)**

**అథైకయోర్ధ్వ ఉదానః పుణ్యేన పుణ్యం లోకం నయతి పాపేన పాపముభాభ్యామేవ మనుష్యలోకమ్ ॥**

పైన చెప్పిన 72 కోట్ల నాడులకు భిన్నంగా మరొక నాడి వున్నది. అది హృదయంనుండి పైకి తలవైపుగా సాగిపోతుంది [దానినే సుషుమ్నా అంటారు]. దానిద్వారా ఉదాన వాయువు శరీరం పైభాగానికి ప్రసరిస్తుంది [ఇలా ఆశ్వలాయనుని మూడవ ప్రశ్నకు సమాధానం పూర్తిచేసి ఇప్పుడు పిప్పలాదుడు అతడి నాల్గవ ప్రశ్నకు జవాబిస్తున్నాడు]. ఈ ఉదానవాయువు పుణ్యకర్మలు చేసిన మనిషిని పుణ్యలోకాలకు (ఊర్ధ్వలోకాలకు) తీసుకెళ్లుతుంది పాపపు పనులు చేసిన మనిషిని నీచయోనుల్లో పడేస్తుంది; అధోలోకాలకు (రౌరవాది నరకాలకు) తీసుకెళ్తుంది పాపం, పుణ్యం కలగలిసిన కర్మలు చేసేవారిని మళ్లీ మనుష్యలోకంలోకే తీసుకెళ్లుతుంది. [ఇలా ఉదానంద్వారా ఒక శరీరంనుండి బయల్వెడలి మరో శరీరానికి పోయేది ప్రధాన ప్రాణమొక్కటేగాదు. దానివెంట దానికి అవయవాలవంటివైన సమానం, వ్యానం, అపానమేగాక ఇంద్రియాలు, మనస్సు, వీటన్నింటితోబాటే జీవాత్మకూడ ప్రయాణం కడుతాయని వేదాంతుల వ్యాఖ్య] (7)

**ఆదిత్యో హ వై బాహ్యః ప్రాణ ఉదయత్యేష హ్యేనం చాక్షుషం ప్రాణమనుగృహ్ణానః । పృథివ్యాం యా దేవతా సైషా పురుషస్యాపాన మవష్టభ్యాన్తరా యదాకాశః స సమానో వాయుర్వ్యానః ॥**

సూర్యుడే బాహ్య ప్రాణం, యిదే (సూర్యరూప బాహ్యప్రాణమే) నేత్రసంబంధ ప్రాణంపై అనుగ్రహించి (దానికి వెలుగు చూపడానికిగాను) ఉదయిస్తుందనేది నిశ్చయమే భూమిలో ఏ దేవతలైతేవున్నారో (లేక భూదేవతే) వారే (లేక అదే) మనుష్యునిలో అపానవాయువును స్థిరపర్చి చరిస్తుంటారు. మధ్యలో, అంటే భూమికి స్వర్గానికి నడుమ అంతరిక్షంలో (ఆకాశంలో) అదే సమాన వాయువు బాహ్యస్వరూపం ఆకాశంలో విచరించే వాయువే వ్యానం (8)

**తేజో హ వా ఉదానస్తస్మాదుపశాన్తతేజాః పునర్భవమిన్ద్రియైర్మనసి సమ్పద్యమానైః ॥**

తేజస్సే (అంటే వేడిమి, వెలుగు రెండూకూడిన గుణమే) ఉదానం. అందుకే ఎవరి శరీర తేజస్సు అంతరించిపోతుందో వారి జీవాత్మ మనస్సులో విలీనమైన ఇంద్రియాలతోబాటుగా (ఆ శరీరంనుండి నిష్క్రమించి) పునర్జన్మ పొందుతుంది అంటే శరీర తేజస్సు అంతరించిపోగానే అందులోని జీవాత్మ, మనస్సులో విలీనమైన ఇంద్రియాలను వెంటబెట్టుకుని ఉదానవాయువుద్వారా ఆ శరీరంనుండి వెళ్లిపోయి, యింకో శరీరంలోకి ప్రవేశిస్తుందని అర్థం. **(9)**

**యచ్చిత్తస్తేనైష ప్రాణమాయాతి ప్రాణస్తేజసా యుక్తః సహాత్మనా యథాసంకల్పితం లోకం నయతి ॥**

ఈ జీవాత్మ తన చిత్తసంకల్పం ప్రకారంగా (ముఖ్య) ప్రాణంలో స్థితమైపోతుంది ఈ (ముఖ్య) ప్రాణం తేజస్సు(ఉదానం)తో కలిసి మనస్సు, ఇంద్రియాలతోయుక్తంగావుండే జీవాత్మను దాని సంకల్పానుసారంగానే భిన్న భిన్న లోకాలకు (అంటే వివిధ యోనులకు) తీసుకుపోతుంది. చనిపోయేటప్పుడు మనిషి చిత్తంలో ఏ సంకల్పం వుంటుందో దాని కనుగుణంగానే పునర్జన్మ లభిస్తుందని దీని తాత్పర్యం [ఈ విషయమే ***భగవద్గీత, ఎనిమిదవ అధ్యాయం (అక్షరపరబ్రహ్మయోగం),*** **6**వ శ్లోకంలో యిలా చెప్పబడింది: ***యం యం వాపి స్మరన్ భావం త్యజత్యంతే కలేబరమ్ । తం తమేవైతి కౌంతేయ ! సదా తద్భావ భావితః ॥*** (అంటే ఓ కౌంతేయా ! ఎవడే భావాన్ని స్మరిస్తూ తుదకు దేహత్యాగం గావిస్తాడో అతడా భావాన్నే పొందుతాడు అనగా అతడి పునర్జన్మ అవసాన సమయమప్పటి తుది భావాన్నిబట్టి ఆధారపడివుంటుందని అర్థం) దీనికి పుష్టినిచ్చే పిట్టకథలుకూడ పురాణాల్లో కొన్ని చెబుతారు. 1. భరతుడనే రాజు అడవుల్లో తపస్సు చేసుకుంటూ తుదిరోజులు గడుపుతాడు. చనిపోయేముందు అతడు ఒక లేడిపిల్లను రక్షిస్తాడు. ఆ తుది క్షణాల్లో తన మనసంతా లేడిపిల్లపై లగ్నమై వుండింది గనుక మరు జన్మలో తను లేడియై పుట్టినాడట. 2. మిథిలలో ఒక సన్యాసి ఒక చర్మకారుని చెప్పుల్ని అతడికి పైసలీయకుండానే ఉపయోగించుకున్నాడట. అయ్యో అతడి రుణం తీర్చుకోలేకపోతినే అనే వ్యథతోనే కన్నుమూసాడట. కనుక మరుజన్మలో అత డొక చండాలునిగా పుట్టి పూర్వజన్మరుణం తీర్చుకున్నాడట. ఇలాంటి కథలెన్నో] **(10)**

**య ఏవం విద్వాన్ప్రాణం వేద న హాస్య ప్రజా హీయతేఽమృతో భవతి తదేష శ్లోకః ॥**

ఎవరైనా విద్వాంసుడు (బుద్ధిమంతుడు, జ్ఞాని) ఈ విధంగా ప్రాణంగురించి (ప్రాణరహస్యం) తెలుసుకుంటాడో అతడి సంతానపరంపర ఎప్పుడూ ఏ విధంగానూ నష్టపోదు. అది అమరమవుతుంది. ఈ విషయమై దీనితర్వాతి శ్లోకంలో చెప్పబడింది. అంటే ప్రాణ రహస్యం తెలిసి, దాన్ని భక్తిప్రపత్తులతో సంరక్షించి, పూజించే వ్యక్తి వీర్యం అమోఘంగా, దివ్యశక్తిసంపన్నంగా వుంటుందిగనుక అతడి సంతతికూడ బలీయంగా, శాశ్వతంగా వుండిపోతుందని అర్థం. అంతేగాక ప్రాణంయొక్క ఆధ్యాత్మిక రహస్యాన్ని తెలుసుకుని ఆ వ్యక్తి జీవితాన్ని సార్థకంగా తీర్చిదిద్దుకుంటే, అప్పుడతడు సర్వకాలాలకు అమరుడైపోతాడు, అంటే జనన మరణ చక్రంనుండి విముక్తి పొందుతాడనికూడ అర్థం దిగువ ఋచాలో ఈ విషయంగురించి మరింత వివరంగా చెప్పబడింది. **(11)**

**ఉత్పత్తిమాయతిం స్థానం విభుత్వం చైవ పఞ్చధా ।**
**అధ్యాత్మం చైవ ప్రాణస్య విజ్ఞాయామృతమశ్నుతే విజ్ఞాయామృతమశ్నుత ఇతి ॥**

ప్రాణోత్పత్తి రహస్యాన్ని ఎరిగి, అది శరీరంలోకి ఎలా ప్రవేశిస్తుందో ఆ వైనం తెలుసుకుని, దాని వ్యాపకతనుకూడ గ్రహించిన వ్యక్తి, అదే విధంగా ప్రాణం యొక్క బాహ్య, అంతర భేదాలను అంటే ఆధిభౌతిక, ఆధ్యాత్మిక భేదాల రహస్యాన్నికూడ చక్కగా తెలుసుకున్న మానవుడు ఆ జ్ఞానంద్వారా అమృతాన్ని అనుభవిస్తాడు. అంటే అలాంటి వ్యక్తి అమృతస్వరూప పరమానందమయ పరబ్రహ్మను ప్రాప్తంగావించుకుంటాడని అర్థం **(12)**

# తృతీయ ప్రశ్న సమాప్తం

* * * * *

# 4. నాల్గవ ప్రశ్న

**అథ హైనం సౌర్యాయణీ గార్గ్యః పప్రచ్ఛ భగవన్నేతస్మిన్పురుషే కాని స్వపన్తి కాన్యస్మిఞ్జాగ్రతి కతర ఏష దేవః స్వప్నాన్పశ్యతి కస్యైతత్సుఖం భవతి కస్మిన్ను సర్వే సంప్రతిష్ఠితా భవన్తీతి ॥**

తదనంతరం పిప్పలాద మహర్షిని గార్గ్యుడైన (గర్గగోత్రంలో పుట్టిన) సౌర్యాయణి రుషి యిలా అడిగాడు . భగవన్ ! (1) ఈ మనుష్యశరీరంలో (ఇంతకుమునుపు ప్రస్తావించిన దేవతల్లో) ఎవరెవరు నిద్రిస్తారు ? (2) దీనిలో ఎవరెవరు మేల్కొనివుంటారు ? (3) ఈ శరీరంలోవుండి ఏ యే దేవతలు కలలు గంటారు ? (4) ఈ (నిద్రావస్థలోని) సుఖ మెవరికి అనుభవమౌతుంది? (5) ఈ దేవతలంతాకూడ నిశ్చితరూపంలో సంపూర్ణంగా దేనిలో స్థితమై వుంటారు, అంటే దేన్ని ఆశ్రయించివుంటారు? ఈ విధంగా గార్గ్యుడు జీవాత్మ - పరమాత్మలకు సంబంధించి సర్వమూ తెలుసుకోగోరాడు (1)

**తస్మై స హోవాచ యథా గార్గ్య మరీచయోఽర్కస్యాస్తం గచ్ఛతః సర్వా ఏతస్మింస్తేజోమండల ఏకీభవన్తి । తాః పునః పునరుదయతః ప్రచరన్త్యేవం హ వై తత్సర్వం పరే దేవే మనస్యేకీభవతి । తేన తర్హ్యేష పురుషో న శృణోతి న పశ్యతి న జిఘ్రతి న రసయతే న స్పృశతే నాభివదతే నాదత్తే నానన్దయతే న విసృజతే నేయాయతే స్వపితీత్యాచక్షతే ॥**

అప్పుడా పిప్పలాద మహర్షి యిలా జవాబిచ్చాడు : ఓ గార్గ్య సౌరాయణీ ! సూర్యుడు అస్తమించగానే సకల దిక్కుల్లో వ్యాపించివున్న సూర్యకిరణాలు ఏ విధంగానైతే ఈ తేజోమండలంలో కలిసి అదృశ్యమైపోతాయో, ఆ తర్వాత సూర్యుడు ఉదయించేటప్పుడల్లా మళ్లీ మళ్లీ ఎలా అన్ని దిక్కులా వ్యాపిస్తాయో, సరిగ్గా అదే విధంగా ఈ ఇంద్రియాలన్నీకూడ (నిద్రావస్థలో) పరమదైవమైన మనస్సులో ఒక్కటిగా లీనమైపోతాయి. అందువల్ల ఈ జీవాత్మ

ఆ సమయంలో వినదు; చూడదు; వాసనపట్టదు, రుచిచూడదు, స్పర్శించదు; మాట్లాడదు, గ్రహించదు; లైంగిక ఆనందం పొందదు, మలమూత్రాలైనా విసర్జించదు; నడవదు ఆ సమయంలో అది(జీవాత్మ) నిదురిస్తున్నది అని అంటారు. అంటే ఆ అవస్థలో పది ఇంద్రియాలూ పనిచేయవు; అప్పుడే మనిషి నిద్రపోతున్నాడు అని అంటారు. మళ్లీ సూర్యోదయవేళ కిరణాలు సర్వదిశలా పారినట్లే మేల్కొనగానే మనిషి ఇంద్రియాలన్నీ తిరిగి తమ తమ పనులు నిర్వర్తిస్తుంటాయి. మరి యిలాంటి సుషుప్తిలో మనస్సు పని చేస్తూంటుందా, లేక అదికూడ లయమైపోతుందా అనే విషయంలో వేదాంతులమధ్య భిన్నాభిప్రాయాలు వున్నాయని చెప్పుకోవాలి. నిద్రకూడ ఒక చిత్తవృత్తేనని భావించే పతంజలి మహర్షిప్రకారమైతే ఈ సుషుప్త్యవస్థలో మనస్సు దేనిలోనూ విలీనంకాదు. కాని యిదే ఉపనిషత్తులోని తర్వాతి కొన్ని శ్లోకాలలోనైతే నిద్రావస్థలో మనస్సుకూడ లయమైపోతున్నట్లే రాసివుంది ఈ శ్లోకంలో గార్గ్యుడు అడిగిన మొదటి ప్రశ్నకు జవాబు చెప్పబడింది. (2)

**ప్రాణాగ్నయ ఏవైతాస్మిన్పురే జాగ్రతి । గార్హపత్యో హ వా ఏషోऽపానో వ్యానోऽన్వాహార్యపచనో యద్గార్హపత్యాత్ ప్రణీయతే ప్రణయనాదాహవనీయః ప్రాణః ॥**

ఈ దేహరూప నగరంలో పంచప్రాణరూప ప్రాణాగ్ని మాత్రమే సదా మేలుకొనివుంటుంది. ఇక్కడ నిద్రను ఒక యజ్ఞంగా అభివర్ణించడం, ఆ యజ్ఞంలో అగ్నిగా ప్రజ్వలించేది (పంచరూప) ప్రాణమని పేర్కొనడం జరిగింది. ఆ పంచప్రాణాలలో అపానమే గార్హపత్యాగ్ని. వ్యానమే అన్వాహార్య (మాసిక శ్రాద్ధ) పచన నామక అగ్ని - దక్షిణాగ్ని. గార్హపత్యాగ్నినుండి పైకిలేపి తీసుకురాబడే ఆహవనీయ అగ్నే ముఖ్యప్రాణం. ప్రణయనం (పైకిలేపి తీసుకుపోబడడం) వల్ల అది ప్రాణమనబడుతుంది ఇంతకుముందు మూడవ ప్రశ్నకు జవాబుగాకూడ 5వ శ్లోకంలో "ప్రాణాగ్నిలో హవనం చేయబడ్డ అన్నాన్నంతటినీ" అని ప్రస్తావించివుండడం గమనార్హం. (3)

**యదుచ్ఛ్వాసనిఃశ్వాసావేతావాహుతీ సమం నయతీతి స సమానః । మనో హ వావ యజమానః ఇష్టఫలమేవోదానః । స ఏనం యజమానమహరహర్బ్రహ్మ గమయతి ॥**

మరి ఉచ్ఛ్వాస నిశ్వాసాలు రెండూ ఈ యజ్ఞాగ్నికి (ప్రాణాగ్నికి) ఆహుతులవంటివి ఈ ఆహుతులద్వారా శరీరంలో ప్రవేశపెట్టబడే పోషక పదార్థాలే హవి అని, ఆ హవిని శరీరమంతటా సమభావంతో పంపిణీచేసే సమానమే ఈ యజ్ఞానికి హోత, అంటే హవనంచేసే ఋత్విక్కు, వంటిదని తెలియాలి. ఇదికూడ అగ్నిరూపమే అయినప్పటికీ ఆహుతుల్ని చేరవేసే పని చేస్తూండడంవల్ల దీన్ని హోతగా పేర్కొనడం జరిగింది. పోతే మనస్సే యజమాని ఇక ఉదానమే ఆ యజమాని అభీష్టఫలము ఈ ఉదానమే మనోరూప యజమానిని ప్రతిదినము నిద్రావస్థలో బ్రహ్మలోకానికి తీసుకు వెళ్లుతుంది అంటే పరమాత్మ నివాసస్థానమైన హృదయగుహలోకి తీసుకు వెళ్లుతుంది అక్కడ జీవాత్మ మనస్సుద్వారా నిద్రాజనిత విశ్రామసుఖాలను అనుభవిస్తుంది. కాని యిది ఒకవిధమైన తామస సుఖమని, దీన్ని నిజమైన బ్రహ్మప్రాప్తిసుఖంగా భావించరాదని, ఎందుకంటే అలాంటి బ్రహ్మప్రాప్తి సత్వరజోతమోగుణాలు మూడింటికీ అతీతమనీ వేదాంతుల వ్యాఖ్య ఇది గార్గ్యుడడిగిన రెండో ప్రశ్నకు సమాధానం **(4)**

**అత్రైష దేవః స్వప్నే మహిమానమనుభవతి । యద్ దృష్టం దృష్టమనుపశ్యతి శ్రుతం శ్రుతమేవార్థమనుశృణోతి । దేశదిగన్తరైశ్చ ప్రత్యనుభూతం పునః పునః ప్రత్యనుభవతి దృష్టం చాదృష్టం చ శ్రుతం చాశ్రుతం చానుభూతం చాననుభూతం చ సచ్చాసచ్చ సర్వం పశ్యతి సర్వః పశ్యతి ॥**

ఈ స్వప్నాలను చూచే దేవత ఎవరు? అంటూ గార్గ్యుడు అడిగిన మూడో ప్రశ్నకు పిప్పలాద మహర్షి యిక్కడ సమాధానమిస్తున్నాడు. స్వప్నావస్థలో జీవాత్మయే తన మనస్సు, యితర సూక్ష్మ యింద్రియాలద్వారా తన విభూతిని (మహిమాన్విత అస్తిత్వాన్ని) అనుభవిస్తుంది. అంతకు పూర్వం పదే పదే

చూచిన వాటినే ఈ స్వప్నావస్థలో మళ్లీ మళ్లీ చూస్తుంది, పదే పదే విన్నదానినే మళ్లీ మళ్లీ వింటుంది; నానాదిక్కులు నానాదేశాల్లో తిరిగి అనుభవించిన విషయాల్నే మళ్లీ మళ్లీ అనుభవంలోకి తెచ్చుకుంటుంది. అయితే కలల్లో మనకు జరిగింది జరిగినట్టుగాక జరిగిందీ, జరగనిదీ రెండూ వివిధ పాళ్లలో కలగలిసి వినూత్న విచిత్రరూపాల్లో దృశ్యాలు, అనుభవాలు అనుభూతి చెందుతుంటాముగదా కనుకనే యిక్కడ చూచినదాన్నీ, చూడనిదాన్నీ; విన్నదాన్నీ, విననిదాన్నీ, ఉన్నదాన్నీ, లేనిదాన్నీ - ఈ విధంగా ఉభయరకాలైన సమస్త ఘటనలు, పరిణామాల్ని ఈ స్వప్నావస్థలో జీవాత్మ చూస్తుంది; అనుభూతి చెందుతుందని, అంతేగాక స్వయంగా సర్వము తానే అయి వాటిని కనుగొంటుంది, అనుభవిస్తుందని చెప్పబడింది. అంటే నిద్రావస్థలో జీవాత్మ అతిస్వేచ్ఛగా విచరిస్తుందని, ఆ సమయంలో జీవాత్మ తప్ప మరో యితర వస్తువేదీ వుండదని అర్థం (5)

**స యదా తేజసాభిభూతో భవత్యత్రైష దేవః స్వప్నాన్న పశ్యత్యథ తదైతస్మిన్ శరీర ఏతత్సుఖం భవతి ॥**

గార్గ్యముని అడిగిన నాల్గవ ప్రశ్న . నిద్రలో సుఖం ఎవరికి అనుభవమవుతుంది? అని దానికి మహర్షి ఈ విధంగా జవాబిస్తున్నాడు · ఎప్పుడైతే ఈ మనస్సు తేజస్సు అంటే ఉదానవాయువుచే అభిభూతమైవుంటుందో, అంటే ఉదాన వాయువు మనస్సును జీవాత్మ నివాసస్థానమైన హృదయగుహలోకి తీసుకు వెళ్లినప్పుడు, ఆ నిద్రావస్థలో జీవాత్మ మనస్సుద్వారా స్వప్నఘటనల్ని చూడడమనేది వుండదు; కాగా ఆ సమయంలో నిద్రాజనిత సుఖానుభవమే జీవాత్మకు కలుగుతుందని గ్రహించాలి మూడవ ప్రశ్నకు జవాబుచెప్పినప్పుడే ఉదాన వాయువు పేరే తేజస్సని, అదే మనస్సుని బ్రహ్మలోకానికి అంటే హృదయగుహకు తీసుకెళ్తుందని మనం గమనించివున్నాము (చూడు - ప్రశ్న 3 . శ్లో. 9-10) [*భగవద్గీత, 13 వ అధ్యాయమైన క్షేత్ర క్షేత్రజ్ఞ విభాగయోగంలోని 21వ శ్లోకంలో ఈ విషయం యిలా వక్కాగా చెప్పబడింది* **కార్యకారణ కర్తృత్వే హేతుః ప్రకృతి రుచ్యతే । పురుషస్సుఖదుఃఖానాం భోక్తృత్వే హేతురుచ్యతే ॥** – అనగా (వ్యష్టి, సమష్టి

రూపాలైన పిండ, (బ్రహ్మాండాలలో) శరీర ఇంద్రియాలకు సంబంధించిన ఉపాధుల్ని కల్పించే కారణం ప్రకృతి వాటికి సంబంధించిన సుఖ దుఃఖాలను అనుభవించేవాడు క్షేత్రజ్ఞుడు (పురుషుడు - జీవాత్మ) అని ]. **(6)**

**స యథా సోమ్య వయాంసి వాసోవృక్షం సంప్రతిష్ఠన్తే ఏవం హ వై తత్సర్వం పర ఆత్మని సంప్రతిష్ఠతే ||**

గార్గ్యముని తెలుసుకోగోరిని ఐదో అంశం : ఈ మనస్సు, బుద్ధి, ఇంద్రియాలు, ప్రాణం - యివన్నీ దేనిలో స్థితమైవున్నాయి ? దేన్ని ఆశ్రయించివున్నాయి ? అని. దానికి పిప్పలాద మహర్షి యిలా జవాబిస్తున్నాడు . ప్రియశిష్యా ! ఏ విధంగానైతే సాయంకాలంకాగానే అంతదాకా ఆకాశంలో స్వేచ్ఛగా ఎగురుతూండే పక్షులన్నీ తిరిగి తమ నివాసస్థానాలైన చెట్లపై వాలి, నిశ్చింతగా విశ్రాంతి తీసుకుంటాయో, అదే విధంగా ఈ తత్వాలన్నీ (అంటే యింతకు ముందే చర్చింపబడ్డ పంచ భూతాలు, పంచ ప్రాణాలు, పది ఇంద్రియాలు, మనస్సు మొదలైన అంతఃకరణాలు అన్నీ) ఆ పరబ్రహ్మలో సుఖపూర్వకంగా ఆశ్రయం తీసుకుంటాయి. కనుక వీటన్నిటికీ ఆ పరబ్రహ్మే పరమధామం. **(7)**

**పృథివీ చ పృథివీమాత్రా చాపశ్చాపోమాత్రా చ తేజశ్చ తేజోమాత్రా చ వాయుశ్చ వాయుమాత్రా చాకాశశ్చాకాశమాత్రా చ చక్షుశ్చ ద్రష్టవ్యం చ శ్రోత్రం చ శ్రోతవ్యం చ ఘ్రాణం చ ఘ్రాతవ్యం చ రసశ్చ రసయితవ్యం చ త్వక్చ స్పర్శయితవ్యం చ వాక్చ వక్తవ్యం చ హస్తౌ చాదాతవ్యం చోపస్థశ్చానన్దయితవ్యం చ పాయుశ్చ విసర్జయితవ్యం చ పాదౌ చ గన్తవ్యం చ మనశ్చ మన్తవ్యం చ బుద్ధిశ్చ బోద్ధవ్యం చాహఙ్కారశ్చాహఙ్కర్తవ్యం చ చిత్తం చ చేతయితవ్యం చ తేజశ్చ విద్యోతయితవ్యం చ ప్రాణశ్చ విధారయితవ్యం చ ||**

భూమి, దాని తన్మాత్ర (సూక్ష్మగంధము); నీరు, దాని రసతన్మాత్ర; తేజస్సు, దాని రూపతన్మాత్ర; గాలి, వాయుతన్మాత్ర (స్పర్శతన్మాత్ర); ఆకాశం, ఆకాశ

(శబ్ద) తన్మాత్ర; కళ్లు, వాటితోచూడబడే వస్తువులు; చెవులు, వాటితో వినబడే శబ్దాలు, వస్తువులు, ముక్కు, వాటితో వాసన చూడబడే వస్తువులు; నాలుక, దానితో రుచిచూడబడే వస్తువులు; త్వగింద్రియం(చర్మం), దానితో స్పర్శించబడే వస్తువులు; వాగింద్రియం, దానితో మాట్లాడబడే శబ్దాలు; చేతులు, వాటి పట్టులోకి వచ్చే వస్తువులు, ఉపస్థ ఇంద్రియాలు, వాటిద్వారా లభించే లైంగిక ఆనందం; గుదేంద్రియం, దానిద్వారా విసర్జించబడే పదార్థాలు, కాళ్లు, వాటి గమ్యస్థానాలు; మనస్సు, మననం కాబడే వస్తువులు; బుద్ధి, దానితో తెలుసుకోబడే వస్తువులు; అహంకారము, దాని లక్ష్యవిషయం (అహంకర్తవ్యం); చిత్తం, దాని చింతనలోకివచ్చే వస్తువులు; తేజస్సు, దాని లక్ష్యవిషయాలు; పంచరూపాత్మక ప్రాణం, దానిద్వారా జీవంపొంది, ధరింపబడే సకల శరీరాలు - ఇవన్నీకూడ ఆ పరమాత్మను ఆశ్రయించివుండేవే **(8)**

**ఏష హి ద్రష్టా స్ప్రష్టా శ్రోతా ఘ్రాతా రసయితా మన్తా బోద్ధా కర్తా విజ్ఞానాత్మా పురుషః స పరేఽక్షర ఆత్మని సంప్రతిష్ఠతే ॥**

చూసేదీ, స్పర్శించేదీ, వినేదీ, వాసన చూచేదీ, రుచిచూచేదీ, మననం చేసేదీ, తెలుసుకునేదీ, కర్మలు చేసేదీ అయిన ఈ విజ్ఞాన స్వరూప పురుషుడు (జీవాత్మ) ఎవరైతే వున్నారో అతడు(అది)కూడ అనశ్వరమైన పరమాత్మలో చక్కగా స్థితమై వున్నాడు (వున్నది) జీవాత్మకు పరమశాంతి లభించేది పరమాత్మను ప్రాప్తంగావించుకున్నప్పుడే; కనుక దానికిసైతం పరమ ఆశ్రయం ఆ పరమాత్మేనని వేదాంతుల వివరణ. **(9)**

**పరమేవాక్షరం ప్రతిపద్యతే స యో హ వై తదచ్ఛాయమశరీరమలోహితం శుభ్రమక్షరం వేదయతే యస్తు సోమ్య । స సర్వజ్ఞః సర్వో భవతి । తదేష శ్లోకః ॥**

ఎవరైనాగానీ నీడలేని, శరీరంలేని, రంగులేని, ఆ విశుద్ధ అక్షర (అనశ్వర) పరమాత్మను తెలుసుకునేట్లయితే వారు ఆ పరమ అనశ్వర పరబ్రహ్మాకే ప్రాప్తమై

పోతారు. ఓ ప్రియ శిష్యా ! ఇలా పరమాత్మను తెలుసుకున్న వారు ఎవరైనా వుంటే వాళ్లు సర్వజ్ఞులు, సర్వరూపులు అయివుంటారనేదానిలో సందేహం లేదు. ఈ విషయమై దిగువ ఋచాలో చెప్పబడింది (10)

**విజ్ఞానాత్మా సహ దేవైశ్చ సర్వైః ప్రాణా భూతాని సంప్రతిష్ఠన్తి యత్ర ।**
**తదక్షరం వేదయతే యస్తు సోమ్య స సర్వజ్ఞః సర్వమేవా వివేశేతి ॥**

ఓ ప్రియశిష్యా ! సర్వ ప్రాణాలూ, పంచభూతాలు, సమస్త ఇంద్రియాలు, అంతఃకరణాలతోబాటుగా, విజ్ఞానస్వరూప ఆత్మ (జీవాత్మ) ఎవరిని ఆశ్రయించివుంటాయో, అటువంటి అక్షర పరబ్రహ్మను తెలుసుకున్నవారెవరే గాని వారు సర్వజ్ఞులని, సర్వస్వరూప పరబ్రహ్మలో లీనమైపోతారని తెలుసుకోవాలి. గార్గ్య సౌరాయణి అడిగిన నాల్గవ ప్రశ్నకు పిప్పలాద మహర్షి యిచ్చిన సమాధానం యింతటితో సమాప్తం. (11)

# చతుర్థ ప్రశ్న సమాప్తం.

* * * * *

# 5. ఐదవ ప్రశ్న

**అథ హైనం శైబ్యః సత్యకామః పప్రచ్ఛ । స యో హ వై తద్భగవన్మనుష్యేషు ప్రాయణాన్తమోఙ్కారమభిధ్యాయీత । కతమం వావ స తేన లోకం జయతీతి॥**

తదనంతరం ఆ ప్రఖ్యాత పిప్పలాద మహర్షిని శిబిపుత్రుడు సత్యకాముడు యిలా అడిగాడు భగవన్! మనుష్యుల్లో ఎవరైనాగానీ ఆజీవితాంతం(మృత్యుపర్యంతం) ఆ ఓంకారాన్ని చక్కగా ఉపాసిస్తాడో అతడికి ఆ ఉపాసనద్వారా ఏ లోకాలు నిస్సందేహంగా ప్రాప్తిస్తాయి ? అనగా ఆ ఉపాసన ఫలమేమిటి ? (1)

**తస్మై స హోవాచ ఏతద్వై సత్యకామ పరం చాపరం చ బ్రహ్మ యదోఙ్కారః। తస్మాద్విద్వానేతేనైవాయతనేనైకతరమన్వేతి ॥**

అప్పుడా ప్రసిద్ధ పిప్పలాద మహర్షి అతనితో యిలా అన్నాడు ఓ సత్యకామా ! ఈ ఓంకారం నిశ్చయంగా పరబ్రహ్మ, అపరబ్రహ్మ(అంటే పరబ్రహ్మనుండి ప్రకటమైన విరాట్ స్వరూపం - సమస్త చరాచర ప్రకృతి) కూడానూ. అందువల్ల ఈ నిశ్చయజ్ఞానంగల బుద్ధిమంతులైన మనుష్యులు ఇదే ఏకైక ఆలంబనంగా (అంటే ఓంకార జపమొక్కదాని ఆధారంగానే) వాటిల్లో (పరబ్రహ్మ, అపర బ్రహ్మలలో) ఏదో ఒకదానిని శ్రద్ధాప్రపత్తులతో అనుసరిస్తాడు అంటే పరబ్రహ్మ పురుషోత్తముడ్ని మొత్తంగా ప్రాప్తంగావించుకోవాలనే దీక్షతో ప్రణవోపాసన చేసేవాడు ఆ ప్రకారమే పరబ్రహ్మను పూర్తిగా ప్రాప్తంచేసుకుంటాడు. అలా కాక పరబ్రహ్మ విరాట్ స్వరూపంలోని ఏదైనా ఒక అంగాన్ని ప్రాప్తంచేసుకోగోరి ఓంకార జపంచేసే సాధకుడు ఆ ప్రకారమే ఆ అపరబ్రహ్మ అంశాన్ని పొందుతాడని అర్థం. (2)

**స యద్యేకమాత్రమభిధ్యాయీత స తేనైవ సంవేదితస్తూర్ణమేవ జగత్యా మభిసమ్పద్యతే । తమృచో మనుష్యలోకముపనయన్తే స తత్ర తపసా బ్రహ్మచర్యేణ శ్రద్ధయా సమ్పన్నో మహిమానమనుభవతి ॥**

ఈ ఉపాసకుడు ఒకవేళ ఒక్కమాత్రతో కూడుకున్న ఓంకారాన్ని చక్కగా జపం చేసినట్లయితే ఆ ఉపాసనతోనే అతడు తమ ధ్యేయంచే ప్రేరితుడై (మరణానంతరం) త్వరలోనే భూలోకంలో మళ్లీ పుడతాడు. అతడికి ఋగ్వేదపు ఋచాలు మళ్లీ మనుష్యశరీరాన్ని ప్రసాదిస్తాయి అక్కడ (భూలోకంలో) ఆ ఉపాసకుడు (తన కొత్తజన్మలో) తపస్సు, బ్రహ్మచర్యం, భక్తిశ్రద్ధలతో సంపన్నుడై వలసిన ఐహిక ఐశ్వర్యవిలాసాలు అనుభవిస్తాడు. దీనికి వేదాంతులు యిలా భాష్యం చెబుతారు విరాట్ పరమేశ్వరునికి భూః, భువః, స్వః అని మూడు రూపాలు ఈ మూడింటిలో మొదటిదైన భూలోకపు ఐశ్వర్యాలపట్ల సమ్మోహితుడై వాటి ప్రాప్తికోసమే ఓంకారోపాసన చేసేవారు చనిపోయిన అనంతరం తమ ఆఖరుకోర్కెలకు అనుగుణంగానే మళ్లీ భూలోకంలో పుడతారు. ఓంకారపు మొదటిమాత్ర ఋగ్వేదస్వరూపం, దానికి భూలోకంతో సంబంధంవుంది కనుక దాన్ని జపించడంవల్ల ఆ సాధకుడికి ఋగ్వేదపు ఋచాలు మళ్లీ మనుష్యశరీరాన్ని ప్రసాదిస్తాయి. అలా జన్మించిన నూతన మానవుడు తన కొత్త జన్మలో తపస్సు, బ్రహ్మచర్యం, శ్రద్ధాప్రపత్తులద్వారా ఉత్తమ ఆచరణ గావించి తనకు వలసిన ఐహిక ఐశ్వర్యాలు పొందతాడు. అలాంటి సాధకుడు మరణానంతరం నీచయోనుల్లో జన్మించి, చిరకాలం కొట్టుమిట్టాడవల్సిన అవసరంవుండదు అతడు నేరుగా మనుష్యజన్మ ఎత్తుతాడు; మళ్లీ శుభకార్యాలు చేసే శక్తి సామర్థ్యాలు, నానావిధాలైన సుఖాలు అతనికి తప్పక లభిస్తాయి (3)

**అథ యది ద్విమాత్రేణ మనసి సమ్పద్యతే సోऽన్తరిక్షం యజుర్భిరున్నీయతే సోమలోకమ్ స సోమలోకే విభూతిమనుభూయ పునరావర్తతే ॥**

కాని ఒకవేళ అతడు రెండుమాత్రలతోకూడుకున్న ఓంకారాన్ని చక్కగా జపించినట్లయితే మనోమయమైన చంద్రలోకం అతనికి ప్రాప్తమవుతుంది. (మరణానంతరం) అతడు యజుర్వేదమంత్రాలద్వారా పైకి అంతరిక్షంలోవున్న

చంద్రలోకానికి తీసుకుపోబడుతాడు అక్కడి ఐశ్వర్యాల ననుభవించి మళ్లీ ఈ భూలోకానికి తిరిగివస్తాడు అంటే పరమేశ్వరుని భూః, భువః అనే రెండు రూపాలనూ ఓంకారపు రెండుమాత్రల జపంద్వారా ఉపాసించినట్లయితే, అంటే స్వర్గలోకసుఖాల్ని కాంక్షించి ప్రణవోపాసన చేసేట్లయితే అతడ్ని యజుర్వేద మంత్రాలు ఊర్ధ్వముఖంగా చంద్రలోకానికి తీసుకువెళ్తాయి. అక్కడ నానారకాల స్వర్గసుఖాలు అనుభవించిన పిదప తన ఉపాసనాలభ్యపుణ్యం క్షయించిపోగానే ఆ సాధకుడు తిరిగి మర్త్యలోకం వచ్చేస్తాడు. అంటే మళ్లీ మనుష్యజన్మ ఎత్తుతాడు. అంతేకాదు, ఈ భూలోకంలో మరేదైనా నీచయోనిలో జన్మించే ప్రమాదం సైతం లేకపోలేదు. **(4)**

**యః పునరేతం త్రిమాత్రేణోమిత్యేతేనైవాక్షరేణ పరం పురుషమభిధ్యాయీత స తేజసి సూర్యే సంపన్నః। యథా పాదోదరస్త్వచా వినిర్ముచ్యత ఏవం హ వై స పాప్మనా వినిర్ముక్తః స సామభిరున్నీయతే బ్రహ్మలోకం స ఏతస్మాజ్జీవఘనాత్పరాత్పరమ్ పురిశయం పురుషమీక్షతే తదేతౌ శ్లోకౌ భవతః॥**

కాని ఎవరైతే మూడుమాత్రలతోయుక్తమైన ఈ ఓంకార అక్షరోపాసనద్వారానే ఆ పరబ్రహ్మను నిరంతరం ధ్యానంచేస్తాడో ఆ సాధకుడు తేజోమయమైన సూర్యలోకానికి వెళ్తాడు ఏ విధంగానైతే పాము తన కుబుసం విడిచివేస్తుందో సరిగ్గా అదే విధంగా అతడు (ఈ త్రిమాత్రాపూరిత ప్రణవోపాసనద్వారా) సకల పాపాలను విడిచివేస్తాడు. అలా పాపముక్తుడైన ఆ సాధకుడు సామవేద శ్రుతుల ద్వారా నేరుగా బ్రహ్మలోకానికే తీసుకుపోబడుతాడు. అతడికి ఈ జీవ సముదాయరూపంలోని అపరబ్రహ్మతత్వానికి భిన్నమైన అంతకంటె అత్యంత శ్రేష్ఠమైన, సర్వాంతర్యామియైన పరమపురుషోత్తముడు సాక్షాత్కరిస్తాడు ఈ విషయమ్మై దీనితర్వాతి రెండు శ్లోకాలలో చెప్పబడింది ఓంకారనాదంలోని మూడుమాత్రలనూ ఆధ్యాత్మిక విమోచన కాంక్షించి శ్రద్ధగా జపించే సాధకుడు భూః, భువః, స్వః - అనే మూడురూపాలతో యుక్తమైన ఆ పరబ్రహ్మను సంపూర్ణంగా సాక్షాత్కరింపజేసుకుంటాడని దీని తాత్పర్యం **(5)**

**తిస్రో మాత్రా మృత్యుమత్యః ప్రయుక్తా అన్యోన్యసక్తా అనవిప్రయుక్తాః ।
క్రియాసు బాహ్యాభ్యన్తరమధ్యమాసు సమ్యక్ప్రయుక్తాసు న కమ్పతే జ్ఞః ॥**

ఓంకారపు మూడు మాత్రలు ( ఓం = అ+ ఉ+ మ్) పరస్పరం సంయుక్తంగా వుంచబడి ప్రయుక్తంగావించబడినా (అంటే త్రిమాత్రాయుక్తంగా పరబ్రహ్మను ఉద్దేశించి ఓంకారోపాసన చేసినా) లేదా వాటిని వేరువేరుగా భావించి ప్రయోగించినా అంటే పై శ్లోకాల్లో చెప్పినవిధంగా ఏకమాత్రాయుక్తంగా లేక ద్విమాత్రాయుక్తంగా భూ, స్వర్గ లోక సుఖాల్ని అపేక్షించి జపంచేసినా ఒకటి మాత్రం నిజం అది ( జీవాత్మ) మృత్యు యుక్తమైనది. అంటే అది పరివర్తనశీలమైనది, నశ్వరమైనది ఓంకారస్వరూప పర బ్రహ్మయొక్క విరాట్ జగత్స్వరూపాన్ని వదిలిపెట్టనంతవరకు జీవాత్మ జనన మరణ చక్రంలో కొట్టుమిట్టాడుతూండవల్సిందే అలాకాక తన శరీరపు లోపలి, బైటి, మధ్య భాగం(హృదయగుహ) లోని సమస్త క్రియాకలాపాలు ఓంకారరూప పరబ్రహ్మ లీలలే నని గుర్తెరిగి, త్రిమాత్రాయుక్తంగా సంపూర్ణ మోక్షాన్ని కాంక్షించి ఓంకార జపం చేసే జ్ఞానిమాత్రం, అతడు మాత్రమే, పరబ్రహ్మను పొందగలడు; అలా ప్రాప్తం చేసుకున్నపిదప ఎన్నడూ తన ముక్తస్థితినుండి విచలితుడు కాబోడు **(6)**

**ఋగ్భిరేతం యజుర్భిరన్తరిక్షం సామభిర్యత్తత్కవయో వేదయన్తే ।
తమోఙ్కారేణైవాయతనేనాన్వేతి విద్వాన్ యత్తచ్ఛాన్తమజరమమృతమభయం పరంచేతి॥**

ఏకమాత్రాయుక్తంగా ( ఓంకార) జపంచేసే ఉపాసకులు ఋగ్వేదపు ఋచాల ద్వారా మనుష్యలోకానికి, ద్విమాత్రాయుక్తంగా జపంచేసే ఉపాసకులు యజుర్వేద శ్రుతుల ద్వారా అంతరిక్షంలోని చంద్రలోకానికి, త్రిమాత్రాయుక్తంగా పూర్ణరూపంలో ఓంకారం జపించే ఉపాసకులు సామవేద శ్రుతులద్వారా ఆ బ్రహ్మ లోకానికి చేర్చ బడతారు. ఈ విషయం ( రహస్యం) గ్రహించిన జ్ఞానులు కేవలం ఓంకారాన్ని పూర్ణ రూపంలో జపించడంద్వారా, అత్యంత శాంతం, నిర్వికారం, అజరం, అమరం, అభయం, సర్వశ్రేష్ఠమైన ఆ పరబ్రహ్మతత్వాన్ని ప్రాప్తంగావించుకోగల్గుతారు **(7)**

# పంచమ ప్రశ్న సమాప్తం.

* * * * *

# 6. ఆరవ ప్రశ్న

**అథ హైనం సుకేశా భారద్వాజః పప్రచ్ఛ - భగవన్హిరణ్యనాభః కౌసల్యో రాజపుత్రో మాముపేత్యైతం ప్రశ్నమపృచ్ఛత। షోడశకలం భారద్వాజ పురుషం వేత్థ । తమహం కుమారమబ్రువం నాహమిమం వేద యద్యహమి మమవేదిషం కథం తే నావక్ష్యమితి సమూలో వా ఏష పరిశుష్యతి యో నృత మభివదతి తస్మాన్నార్హామ్యనృతం వక్తుమ్ । స తూష్ణీం రథమారుహ్య ప్రవవ్రాజ। తం త్వా పృచ్ఛామి క్వాసౌ పురుష ఇతి ॥**

ఆ తర్వాత పిప్పలాద మహర్షిని భరద్వాజపుత్రుడైన సుకేశుడు యిలా అడిగాడు : భగవన్ ! కోసలదేశ రాకుమారుడైన హిరణ్యానాభుడు నావద్దకు వచ్చి· "ఓ భారద్వాజా ! పదహారు కళల పురుషుడు ఎవరో నీకు తెలుసా? " అని ప్రశ్నించాడు. అప్పుడు నే నా రాజకుమారునికి "నాకు తెలవదు నాకు తెలిస్తే అది నీకెందుకు చెప్పను ? నిజంగా నాకు తెలవదు అనృతం (అబద్ధం) చెప్పే మనిషి సమూలంగా నశించిపోతాడు కనుక నేనెట్టిపరిస్థితుల్లోనూ అబద్ధం చెప్పను" అని సమాధానమిచ్చాను. నా జవాబు విని ఆ రాజకుమారుడు గమ్మున రథమెక్కి తిరిగి వెళ్ళిపోయాడు అదే ప్రశ్న నేను మిమ్మల్ని అడుగుతున్నాను. ఆ (షోడశ కళల) పురుషుడు ఎవరు, ఎక్కడ వుంటాడు ? (1)

**తస్మై స హోవాచ । ఇహైవాన్తఃశరీరే సోమ్య స పురుషో యస్మిన్నేతాః షోడశ కలాః ప్రభవన్తీతి ॥**

అప్పుడు పిప్పలాదుడు యిలా జవాబిచ్చాడు · ఓ ప్రియశిష్యా ! ఆ పదహారు కళల పురుషుడు ఈ శరీరంలోపలే వున్నాడు అంటే పరమాత్మ షోడశ కళలతో కూడి సంపూర్ణమైన జగద్రూప విరాట్ స్వరూపాన్ని ధరించివుంటాడని, ఆ పరమ పురుషుడ్ని అన్వేషించదలిస్తే యింకెక్కడికో వెళ్ళనక్కరలేదు, మన శరీరంలో, హృదయగుహలోనే, లభిస్తాడని వేదాంతుల భాష్యం. (2)

**స యథేమా నద్యః స్యన్దమానాః సముద్రాయణాః సముద్రం ప్రాప్యాస్తం గచ్ఛన్తి భిద్యేతే తాసాం నామరూపే సముద్ర ఇత్యేవం ప్రోచ్యతే । ఏవమేవాస్య పరిద్రష్టురిమాః షోడశ కలాః పురుషాయణాః పురుషం ప్రాప్యాస్తం గచ్ఛన్తి భిద్యేతే చాసాం నామరూపే పురుషం ఇత్యేవం ప్రోచ్యతే స ఏషోఽకలోఽమృతో భవతి తదేష శ్లోకం ॥**

పిప్పలాదుడు మొదట సృష్టినిగురించి చెప్పినతర్వాత యిప్పుడు లయం (ప్రళయం) గురించి వివరిస్తున్నాడు . ఏ విధంగానైతే నదులన్నీ సముద్రంవైపుగా ప్రవహించి, సముద్రాన్ని చేరుకోగానే అందులో విలీనమై, తమ వేర్వేరు అస్తిత్వాలు, పేర్లు రూపు మాసిపోగా కేవలం సముద్రంగా మాత్రమే పిలవబడతాయో, అదే విధంగా పరమాత్మనుండి ఉత్పన్నమైన షోడశ కళలు ఆ సర్వసంపూర్ణంగా వీక్షించే పరమ పురుషుడ్ని పొందినప్పుడు ఆ పరబ్రహ్మలో పూర్తిగా నామరూపాలులేకుండా లయించి పోతాయి. అప్పుడిక ఒక్క పురుషుడుమాత్రమే మిగిలివుంటాడు. ఈ కళలన్నీ ఆ పురుష నామంతోనే పిలవబడుతాయి. ఆ సమయంలో పరమాత్మ నిర్వికారుడుగా, నిస్సంకల్పుడుగా వుంటాడుగనుక ఆ పరమాత్మను కళారహితుడు, అమృత స్వరూపు డని పిలుస్తారు. ఆ పరమాత్మ ప్రశస్తి దీనితర్వాతి శ్లోకంలో వున్నది **(5)**

**అరా ఇవ రథనాభౌ కలా యస్మిన్ప్రతిష్ఠితాః ।**
**తం వేద్యం పురుషం వేద యథా మా వో మృత్యుః పరివ్యథా ఇతి ॥**

రథచక్ర నాభి (నడిమిదిండు) ఆధారంగా చక్రపు ఆకులు ఎలా స్థితమైవున్నాయో అదేవిధంగా సర్వకళలూ ఎవరిలోనైతే సదా స్థితమైవున్నాయో అలాంటి తెలుసు కొనదగ్గ పరమపురుషుడు పరబ్రహ్మను మీరు తెలుసుకోవాలి. ఆ పరబ్రహ్మను తెలుసుకున్నపిదప మృత్యువు మీకే దుఃఖమూ కలగజేయలేదు. అంటే మృత్యువు మాటిమాటికీ మిమ్మకబళించడం, పదే పదే మీరు జనన మరణ చక్రంలో చిక్కుకుని కొట్టుమిట్టాడం వుండదు. మీరు అమరులవుతారు **(6)**

**తాన్హోవాచైతావదేవాహమేతత్పరం బ్రహ్మ వేద। నాతః పరమస్తీతి ॥**

ఆ తర్వాత పిప్పలాదుడు చివరగా ఆ ఆరుగురు శిష్యులతో యిలా అన్నాడు నాయనలారా ! ఈ పరబ్రహ్మ విషయం నాకు యింతమట్టుకే తెలుసు దీనికి వేరుగా మరింత ఉత్కృష్ట తత్వమంటూ యింకొకటి లేదు. నేనీ విషయంలో మీకు చెప్పవల్సిందంతా చెప్పేసాను **(7)**

**తే తమర్చయన్తస్త్వం హి నః పితా యోऽస్మాకమవిద్యాయాః పరం పారం తారయసీతి నమః పరమఋషిభ్యో నమః పరమఋషిభ్యః ॥**

తదనంతరం ఆ ఆరుగురు ఋషులూ తమ గురువు పిప్పలాదునికి కృతజ్ఞతా భావంతో పూజచేసారు గురువర్యా ! మీరు మమ్మల్ని అవిద్యాసముద్రపు ఆవలి తీరానికి దాటించారు. మా అజ్ఞానాన్ని పోగొట్టి మాకు బ్రహ్మతత్వం ఉపదేశించారు కనుక మీరే మాకు నిజమైన పితరులు. పరమఋషులైన మీకు మా నమస్కారాలు. పరమఋషులైన మీకివే మా నమస్కారాలు. **(8)**

## షష్ఠ ప్రశ్న సమాప్తం.

## /. అథర్వవేదీయ ప్రశ్నోపనిషద్ సమాప్తం /.

* * * * *

## శాంతి పాఠం

**ఓం భద్రం కర్ణేభిః శ్రుణుయామ దేవా భద్రం పశ్యేమాక్షభిర్యజత్రాః।**
**స్థిరైరఙ్గైస్తుష్టువాంసస్తనూభిర్వ్యశేమ దేవహితం యదాయుః ॥**
**స్వస్తి న ఇన్ద్రో వృద్ధశ్రవాః స్వస్తి నః పూషా విశ్వవేదాః।**
**స్వస్తి నస్తార్క్ష్యో అరిష్టనేమిః స్వస్తి నో బృహస్పతిర్దధాతు ॥**

**ఓం శాంతిః ! శాంతిః !! శాంతిః !!!**

* * * * * * * * * *

# ముండకోపనిషత్తు

ఇది అధర్వవేదంలోని శౌనకీ శాఖలో వున్న ఉపనిషత్తు.

## శాంతి పాఠం

ఓం భద్రం కర్ణేభిః శ్రుణుమాయ దేవా భద్రం పశ్యేమాక్షభిర్యజత్రాః।
స్థిరైరఙ్గైస్తుష్టువాంసస్తనూభిర్వ్యశేమ దేవహితం యదాయుః॥
స్వస్తి న ఇన్ద్రో వృద్ధశ్రవాః స్వస్తి నః పూషా విశ్వవేదాః।
స్వస్తి నస్తార్క్ష్యో అరిష్టనేమిః స్వస్తి నో బృహస్పతిర్దధాతు॥

ఓం శాంతిః ! శాంతిః !! శాంతిః !!!

దీని అర్థం ప్రశ్నోపనిషత్తులో మనం తెలుసుకునివున్నాము.

# మొదటి ముణ్డక

## మొదటి ఖండం

ఓం బ్రహ్మా దేవానాం ప్రథమః సమ్బభూవ విశ్వస్య కర్తా భువనస్య గోప్తా।
స బ్రహ్మవిద్యాం సర్వవిద్యాప్రతిష్ఠామథర్వాయ జ్యేష్ఠపుత్రాయ ప్రాహ॥

ఓం ! [ ఓం అనేది పరమేశ్వర నామమని, ప్రతి కార్యమూ పరమేశ్వరనామ స్మరణతో ప్రారంభించడం ఉత్తమమని, యిక్కడ అలాగే ప్రారంభం జరిగిందని వేదాంతుల వ్యాఖ్య] - సంపూర్ణ విశ్వస్రష్ట, సకలలోకాలకు రక్షకుడైన బ్రహ్మ

మొట్టమొదటగా ప్రకటమయ్యాడు ఆయన తన జ్యేష్ఠపుత్రుడైన అథర్వునికి సమస్తవిద్యలకు ఆధారభూతమైన బ్రహ్మవిద్యను చక్కగా ఉపదేశించాడు తాను పుట్టినతర్వాత బ్రహ్మ సకల దేవతల్నీ, మహర్షుల్ని, మరీచి మొదలైన ప్రజాపతుల్ని సృష్టించాడని, మహర్షి అథర్వుడు వారందరిలోకీ పెద్దవాడని అంటారు వీరందరి సృష్టితోబాటుగా బ్రహ్మ సమస్తలోకాల్నీ సృజించాడు, అంతేగాక వాటి రక్షణకోసం పదిలమైన నియమాలు రచించాడనికూడ అంటారు కాని ఈ అథర్వుని ప్రసక్తి భారత భాగవతాల్లోగాని, భగవద్గీతలోగాని కనిపించడంలేదు. (1)

**అథర్వణే యాం ప్రవదేత బ్రహ్మాథర్వా తాం పురోవాచాఙ్గిరే బ్రహ్మవిద్యామ్ ।**
**స భారద్వాజాయ సత్యవహాయ ప్రాహ భారద్వాజో ऽ ఙ్గిరసే పరావరామ్ ॥**

బ్రహ్మనుండి లభించిన బ్రహ్మవిద్యను అథర్వ రుషి అంగీ అనే మరో రుషికి వెల్లడించాడు. ఆ అంగీ ఋషి ఈ బ్రహ్మవిద్యను భరద్వాజగోత్రంలో పుట్టిన సత్యవహుడనే ఒక రుషికి వెల్లడించాడు ఆ భారద్వాజుడు తన వంతుకు ఈ విద్యను అంగిరా అనే ఒక రుషికి చెప్పాడు. (2)

**శౌనకో హ వై మహాశాలో ऽ ఙ్గిరసం విధివదుపసన్నః పప్రచ్ఛ । కస్మిన్ను భగవో విజ్ఞాతే సర్వమిదం విజ్ఞాతం భవతీతి ॥**

ఈ అంగిరా రుషివద్దకు ఒక పెద్ద విద్యాలయానికి (గురుకులానికి) అధిపతి అయిన శౌనకుడనే ఒక ప్రసిద్ధ ముని వచ్చి, శాస్త్రవిధిప్రకారం శరణుజొచ్చి, వినయపూర్వకంగా యిలా అడిగాడు : భగవన్ ! దేన్ని తెలుసుకోవడంవల్ల ఈ సర్వస్వమూ తెలుసుకోబడినదవుతుందో నాకు చెప్పగోరుతున్నాను అంటే మనకు కనిపించేది, వినిపించేది, అనుభూతికలిగించేదైన ఈ చరాచర సర్వస్వం గురించీ తెలియజెప్పే ఆ పరమతత్వమేది అని ప్రశ్నించాడు (3)

**తస్మై స హోవాచ। ద్వే విద్యే వేదితవ్యే ఇతి హ స్మ యద్బ్రహ్మవిదో వదన్తి పరా చైవాపరా చ॥**

అప్పుడా శౌనకునితో అంగిరా ఋషి యిలా అన్నాడు . ఓ శౌనకా । బ్రహ్మను తెలుసుకున్నవారు, మనిషి తెలుసుకోదగ్గ విద్యలు రెండున్నాయి 1 పరా (పర బ్రహ్మ విద్య), 2. అపరా (అపరబ్రహ్మ విద్య) అని చెబుతారు **(4)**

**తత్రాపరా ఋగ్వేదో యజుర్వేదః సామవేదోఽథర్వవేదః శిక్షా కల్పో వ్యాకరణం నిరుక్తం ఛన్దో జ్యోతిషమితి । అథ పరా యయా తదక్షరమధిగమ్యతే ॥**

ఆ రెంటిలోనూ ఋగ్వేదం, యజుర్వేదం, సామవేదం, అథర్వవేదమనే నాలుగు వేదాలు( వీటిలో ఐహిక, స్వర్గసుఖాల్ని కాంక్షించి చేసే వివిధ యజ్ఞయాగాదుల, వాటి ఫలాలగురించి సవివరమైన వర్ణనలుంటాయి), శిక్షా (అంటే వేదపఠనం, ఉచ్చారణ ఎలాచేయాలో విధినిర్దేశంగావించే విద్య), కల్పము ( యజ్ఞయాగాదుల విధులు వివరంగా తెలియజేసే విద్య - గృహ్యసూత్రాలు మొదలైనవి కల్పవిద్య కిందికి వస్తాయి), వ్యాకరణం (వైదిక, లౌకిక శబ్దాల అనుశాసనవిద్య), నిరుక్తం (వేదార్థనిర్వచన విద్య), ఛందస్సు (వేద రుచాలు, పాటలు, శ్లోకాల నిర్మాణసూత్రాలవిద్య), జ్యోతిష్యము (గ్రహనక్షత్రాల స్థితిగతులు, మన జీవితాలపై వాటి ప్రభావంగురించి చెప్పే విద్య) - ఈ ఆరు వేదాంగాలు → మొత్తం పది విద్యల పేరే అపరవిద్య పోతే దేనిద్వారానైతే పరబ్రహ్మ అనశ్వర పరమాత్మతత్వం విదితమవుతుంతో అది పరవిద్య. ఈ పరవిద్యకు సంబంధించిన కొన్ని అంశాలు వేదాల్లోకూడ వున్నాయిగనుక ఆ కొన్ని అంశాలు మినహా మిగతా వేదవిద్య అంతా అపరవిద్యగామట్టుకే భావించాలని కొందరు వేదాంతుల వాదన **(5)**

**యత్తదద్రేశ్యమగ్రాహ్యమగోత్రమవర్ణమచక్షుఃశ్రోత్రం తదపాణిపాదమ్ ।
నిత్యం విభుం సర్వగతం సుసూక్ష్మం తదవ్యయం యద్భూతయోనిం పరిపశ్యన్తి ధీరాః ॥**

ఇక్కడ అంగిరా రుషి పరబ్రహ్మ నిరాకార, నిర్గుణ-రూపాన్ని వర్ణించి చెబుతున్నాడు. ఏదైతే (జ్ఞానేంద్రియాలద్వారా) తెలుసుకోబడజాలదో, ఏదైతే (కర్మేంద్రియాలద్వారా) పట్టుకోబడలేదో, దేనికైతే గోత్రాదులు వుండవో, రంగు, ఆకారం వుండవో, కళ్లు, చెవులు మొదలైన ఇంద్రియాలుండవో కాళ్లు,చేతులవంటి కర్మేంద్రియాలుండవో, ఇంకా ఏదైతే నిత్యం, సర్వవ్యాపితం, సర్వగతం, అత్యంత సూక్ష్మం, అవ్యయం, భూతయోని (అంటే సకల భూతాలకు పరమకారణం) అయివుంటుందో ఆ పరబ్రహ్మను జ్ఞానులైన రుషులు సర్వత్రా పరిపూర్ణతత్వంగా వీక్షిస్తారు **(6)**

**యథోర్ణనాభిః సృజతే గృహ్ణతే చ యథా పృథివ్యామోషధయః సమ్భవన్తి ।
యథా సతః పురుషాత్కేశలోమాని తథాక్షరాత్సమ్భవతీహ విశ్వమ్ ॥**

ఏ విధంగానైతే సాలెపురుగు తన (కడుపు)నుండి గూడు అల్లుకుంటుందో, తిరిగి దాన్ని తన(కడుపు)లోకి మింగివేసుకుంటుందో, ఏ విధంగానైతే ఈ భూమిపై రకరకాల ఓషధులు (మందు మొక్కలు) ఉత్పన్నమవుతాయో; ఏ విధంగానైతే సజీవ మానవుని దేహంలో వెంట్రుకలు, రోమాలు పుట్టుకొస్తాయో, అదే విధంగా ఆ అనశ్వర (పరబ్రహ్మ) తత్వంనుండి ఈ సృష్టిలోని సర్వస్వమూ ఉత్పన్నమవుతుంది. ఈ మూడు రకాల దృష్టాంతాలతో అంగిరా ఋషి పరబ్రహ్మ ఈ చరాచర విశ్వాన్ని ఎలా సృష్టించాడో వివరిస్తాడు. [*భగవద్గీత 9వ అధ్యాయం, 7-8 శ్లోకాల్లో* సృష్టిలయాల వర్ణన యిలా చేయబడింది : ***సర్వభూతాని కౌంతేయ ! ప్రకృతిం యాంతి మామికామ్ । కల్పక్షయే పునస్తాని కల్పాదౌ విసృజామ్యహమ్ ॥*** - ఓ అర్జునా ! సమస్తభూతాలు బ్రహ్మకల్పాంతంలో (ప్రళయకాలంలో) నా ప్రకృతిలో లయించిపోతాయి తిరిగి వాటన్నింటినీ నేను కల్పారంభంలో తిరిగి సృష్టిస్తూ వున్నాను ; ***ప్రకృతిం స్వామవష్టభ్య విసృజామి పునః పునః । భూతగ్రామమిమం కృత్స్నం అవశం ప్రకృతేర్వశాత్ ॥*** - నా ప్రకృతిని నావశంలోవుంచుకుని ఈ సర్వభూతాల్నీ మళ్లీ మళ్లీ సృష్టిస్తూ వున్నాను అవన్నీ ప్రకృతిబద్ధాలుగనుక అస్వతంత్రంగావుంటూ ప్రకృతి నియమాల ప్రకారం

మళ్లీ మళ్లీ పుట్టుతూ, గిట్టుతూంటాయి. ఇంకా *గీత* **4:13, 9:10** శ్లోకాల్లోకూడ సృష్టికి పరమాత్మ అప్రయత్న కర్త అని, ఉదాసీనుడైన మూలకారణమని వివరించబడింది అదే విధంగా పోతన *భాగవతంలో ఒకపరి జగములు వెలి నిడి యొకపరి లోనికి గొనుచున్* అంటూ ఈ పరబ్రహ్మతత్వాన్నే భక్త్యావేశంలో వర్ణిస్తాడని మనమీవరకే గమనించివున్నాము]. **(7)**

**తపసా చీయతే బ్రహ్మ తతోఽన్నమభిజాయతే।**
**అన్నాత్ప్రాణో మనః సత్యం లోకాః కర్మసు చామృతమ్॥**

ఈ జగద్రచనాసమయం వచ్చేసరికి అంతదాకా అతిసూక్ష్మరూపంలోవుండే పరబ్రహ్మకు సృష్టిసంకల్పబుద్ధి జనిస్తుందట, ఈ స్ఫురణే పరబ్రహ్మ చేసే తపస్సు ఆ తపస్సువల్ల సూక్ష్మరూపం ఎదిగి ఎదిగి అపారస్థూలప్రమాణం ధరిస్తుంది అదే సృష్టికర్త బ్రహ్మరూపమంటారు వేదాంతులు. ఆ బ్రహ్మనుండి మొట్టమొదటగా అన్నం ఉత్పన్నమవుతుంది సమస్తప్రాణుల్ని ఉత్పత్తిచేసి, పెంపొందించగల శక్తి ఈ అన్నానికి వుంటుంది. ఆ తర్వాత ఈ అన్నంనుండి ప్రాణం, దానినుండి మనస్సు, తర్వాత సత్యం (అంటే యిక్కడ కార్యరూప పంచ మహాభూతాలని), పిదప సమస్తప్రాణులూ, సకల లోకాలూ, ఆపై ఆ ప్రాణుల నానాప్రకారాల కర్మలు, ఆ కర్మలఫలితంగా లభించే అమృతం (అంటే యిక్కడ కర్మఫలాలుగా తప్పనిసరిగా లభించే సుఖ,దుఃఖరూప ఫలితాలని) జనిస్తాయి ఈవిధంగా సంపూర్ణ జగత్తు సృష్టి అవుతుంది. **(8)**

**యః సర్వజ్ఞః సర్వవిద్యస్య జ్ఞానమయం తపః।**
**తస్మాదేతద్బ్రహ్మ నామ రూపమన్నం చ జాయతే॥**

ఎవరైతే సర్వజ్ఞుడుగానూ, సర్వవిదుడిగానూ(అంటే అందరినీ తెలుసుకున్న వాడుగా) వున్నాడో, ఎవరినిగురించిన జ్ఞానమే ఒక మహాతపస్సుగా వుంటుందో ఆ పరమేశ్వరుని(పరబ్రహ్మతత్వం)వల్లే ఈ బ్రహ్మ (విరాట్ స్వరూప జగత్తు), సకల లోకాలు, ప్రాణుల నామాలు, రూపాలు, యింకా వాటిని పెంచిపోషించే అన్నం అన్నీ ఉత్పన్నమవుతాయి. **(9)**

## ప్రథమ ఖండం సమాప్తం.

* * * * *

# రెండవ ఖండం

మొదటి ఖండం, 4వ మంత్రంలో పరా, అపరా విద్యలగురించి ప్రస్తావించ బడింది గదా. ఇప్పు డీ ఖండంలో అపరా విద్యగురించి ప్రధానంగా చెప్ప బడుతున్నది తద్వారా పరా(బ్రహ్మ) విద్యగురించిన జిజ్ఞాసను రేకెత్తించడం కూడ జరుగుతుంది

**తదేతత్సత్యం మన్త్రేషు కర్మాణి కవయో యాన్యపశ్యంస్తాని త్రేతాయాం బహుధా సన్తతాని । తాన్యాచరథ నియతం సత్యకామా ఏష వః పన్థాః సుకృతస్య లోకే ॥**

మానవుని ఔన్నత్యసాధనకుగాను యజ్ఞయాగాది నానావిధాలైన కర్మకాండలేవైతే వేదమంత్రాలలో వున్నట్లు బుద్ధిమంతులైన ఋషులు కనుగొంటారో అది సర్వథా సత్యమే ఈ కర్మకాండలన్నీ మూడు వేదాల్లో - ఋక్, యజుః, సామ వేదాల్లో సవివరంగా వర్ణించబడివున్నాయి కనుక సత్యకాములైన వారు, ఐహిక ఉన్నతిని కోరుకునే వారు పై వేదాల్లో పొందుపర్చబడ్డ నియమాలను చక్కగా పాటిస్తూ వివిధ యజ్ఞయాగాది కర్మకాండలన్నీ నిష్ఠతో నిర్వర్తించాలి. శుభకర్మల ఫలాలు పొందడానికి యిదే ఏకైక మార్గం ఇక్కడ మనం మూడు వేదాలగురించే ప్రస్తావన వుండడం గమనిస్తాం ప్రధానంగా మూడు వేదాలే వున్నట్లు మనం అనేక యితర సందర్భాల్లోకూడ గమనించగలం. కనుక వేదత్రయం ప్రసక్తి ఎక్కడ వచ్చినా అది ఋక్, యజుస్సామ వేదాలగురించేనని తెలుసుకోవాలి; నాల్గవదైన అధర్వవేదం అలాంటప్పుడు ఈ మూడింటిలోనే అంతర్నిహితంగా వున్నట్లు భావించుకోవాలి. (1)

**యదా లేలాయతే హ్యర్చిః సమిద్ధే హవ్యవాహనే ।**
**తదాజ్యభాగావన్తరేణాహుతీః ప్రతిపాదయేత్ ॥**

నిత్యమూ మనుష్యులు అగ్నిని రగిలిస్తూవుండాలి అగ్ని హవ్యవాహనుడు - అంటే దేవతలకు హవిష్యాన్ని మోసుకుపోయి యిచ్చేవాడు. అలాంటి అగ్ని రగిలించబడి, బాగా మండుతూ, ఆ మంటల నాలుకలు భగ భగా పైకి వ్యాపిస్తున్నప్పుడే ఆజ్యభాగాల నడుమ యితర ఆహుతులు వేయాలి అంతేగాని అగ్ని పూర్తిగా జ్వలించి, భగ భగా మంటల నాలుకలు పైకెగయకముందేగాని, లేక ఆ అగ్ని చల్లారిపోయేటప్పుడుగాని ఆహుతులు వేయరాదు యజుర్వేదంలో చెప్పినదాని ప్రకారం ప్రజాపతికోసం మౌనంగా ఒక ఆహుతి, తర్వాత ఇంద్రుని కోసం '**ఆధార** ' మనే పేర పిలవబడే రెండు ఆహుతులు వేసిన పిదప అగ్నిదేవునికి, సోమదేవునికి వేరు వేరుగా సమర్పించబడే రెండు ఆహుతులను '**ఆజ్యభాగాలు**' అని పిలుస్తారు '**ఓం అగ్నయే స్వాహా** ' అంటూ ఉత్తర పూర్వార్థంలోనూ, '**ఓం సోమాయ స్వాహా**' అంటూ దక్షిణ పూర్వార్థంలోనూ ఈ ఆహుతులు వేస్తారు ఈ ఆజ్యభాగాల మధ్య వ్యవధిలోనే మిగతా ఆహుతు లన్నీ వేసేయాల్సివుంటుంది మనుష్యుడు వేదవిహితమైన కర్మకాండలు ఆచరించాలని, నిత్యం వేదోక్తరీతుల్లో అగ్నిహోత్రం (ప్రజ్వలింప) చేయాలని దీని అర్థం **(2)**

**యస్యాగ్నిహోత్రమదర్శమపౌర్ణమాసమచాతుర్మాస్యమనాగ్రయణమతిథివర్జితం చ।**
**అహుతమవైశ్వదేవమవిధినా హుతమాసప్తమాంస్తస్య లోకాన్ హినస్తి ॥**

పైన చెప్పినవిధంగా నిత్యం అగ్నిహోత్రం ప్రజ్వలింపజేసే వ్యక్తిగనుక - (1) దర్శ నామక యజ్ఞం (ప్రతి అమావాస్యనాడు చేసే ఇష్టి) చేయనట్లయితే, లేక (2) పౌర్ణ మాస యజ్ఞం (ప్రతి పౌర్ణమినాడు చేసే ఇష్టి) చేయనట్లయితే, లేక (3) చాతుర్మాస్య యజ్ఞం (నాలుగు నెలల్లో పూర్తయ్యే ఒక శ్రౌత యాగవిశేషం) చేయనట్లయితే, లేక (4) ఆగ్రయణ కర్మ (శరదృతువు, వసంత రుతువుల్లో కొత్త అన్నం వండి దాన్ని ఇష్టిగా సమర్పించుకునే ఆగ్రయణ యజ్ఞం) చేయనట్లయితే, లేదా (5) తాను చేసే యజ్ఞంలో అతిధులను తగురీతిలో సత్కరించకుంటే, లేక (6) యజ్ఞంలో ఆహుతులు సమయంతప్పకుండా నియమప్రకారం వేయనట్లయితే, లేక (7) బలి వైశ్వదేవ నామక కర్మ

చేయనట్లయితే; లేక (8) దానిలో శాస్త్రవిధిని అవహేళనచేస్తూ తద్విరుద్ధంగా హవనం చేసేటట్లయితే - అప్పుడు అలాంటి అగ్నిహోత్రం ఆ అగ్నిహోత్రి (యజ్ఞంచేసే వ్యక్తి) యొక్క ఏడు పుణ్యలోకాలనూ నష్టంగావించివేస్తుంది సవ్యమైన రీతిలో శుచిగా యజ్ఞం చేస్తే అలాంటి మనిషికి భూలోకంనుండి సత్యలోకందాకా మొత్తం ఏడు పుణ్యలోకాలు దక్కే అవకాశంవుంటుంది. కాని పైన పేర్కొన్న 8 తప్పిదాల్లో ఏది జరిగినా అవన్నీ దక్కకుండా వమ్మయే ప్రమాదం వుంది. కనుగ నిత్యాగ్నిహోత్రి కేవలం అగ్నిని రగిలించినంతమాత్రాన సరిపోదు, దాన్ని శాస్త్రోక్తంగా, ఎలాంటి లొసుగులు లేకుండా రగిలించి, అత్యంత జాగ్రత్తగా యజ్ఞం చేయాలని నిర్దేశించబడింది (3)

**కాలీ కరాలీ చ మనోజవా చ సులోహితా యా చ సుధూమ్రవర్ణా ।**
**స్ఫులిఙ్గినీ విశ్వరుచీ చ దేవీ లేలాయమానా ఇతి సప్త జిహ్వాః ॥**

ఆహుతులు సమర్పించాలంటే యజ్ఞాగ్ని ఏ విధంగా మండుతూండాలో యిక్కడ వర్ణించబడింది. (1) కాలీ (నల్లరంగు కలది), (2) కరాళీ (అత్యుగ్రమైనది - కాకతగిలే, నిప్పంటుకునే భయంకల్పించేది); (3) మనోజవా (మనస్సులా అతి చంచలమైనది); (4) సులోహితా (సుందరమైన ఎరుపురంగు గలది); (5) సుధూమ్రవర్ణా (చక్కని పొగవంటి రంగుగలది), (6) స్ఫులింగినీ (నిప్పురవ్వలు చిమ్ముతూండేది); మరియు (7) విశ్వరుచీ (అన్నివైపులనుండి ప్రకాశిస్తూ, దేదీప్యమానంగా వెలిగేది) - అనే ఏడు భగభగమనే శిఖలున్నప్పుడే - అంటే హవిని గ్రహించడానికి అగ్నిదేవుడు సాచిన ఏడు నాలుకల్లా ఆ శిఖలు ప్రజ్వరిల్లుతున్నప్పుడే - దాంట్లో ఆహుతులు వేయాలి. అంతేగాని సరిగా మండని, లేక చల్లారిపోతూండే అగ్నిలో ఆహుతులు వేస్తే నిరర్థకం (4)

**ఏతేషు యశ్చరతే భ్రాజమానేషు యథాకాలం చాహుతయో హ్యాదదాయన్ ।**
**తం నయన్త్యేతాః సూర్యస్య రశ్మయో యత్ర దేవానాం పతిరేకోऽధివాసః ॥**

పైనచెప్పిన విధంగా ఏడు నాలుకలతో భగభగమండే అగ్నిజ్వాలలో ఎవరైతే శాస్త్రోక్తంగా, సమయానుసారంగా ఆహుతులు వేసి అగ్నిహోత్రం నిత్యం చేస్తారో ఆ అగ్నిహోత్రిని (అతని మరణసమయంలో) ఆ ఆహుతులు సూర్యకిరణాలుగా మారి తమవెంట తీసుకువెళ్లి సర్వదేవతలకూ ఏకైక యజమాని అయిన ఆ ఇంద్రుడు నివసించే లోకానికి చేరుస్తాయి. అంటే శాస్త్రోక్తంగా, నియమబద్ధంగా యజ్ఞంచేసే నిత్యాగ్నిహోత్రికి స్వర్గసుఖాలు ఖాయంగా లభిస్తాయని చెప్పబడుతున్నది. **(5)**

**ఏహ్యేహీతి తమాహుతయః సువర్చసః సూర్యస్య రశ్మిభిర్యజమానం వహన్తి ।**
**ప్రియాం వాచమభివదన్త్యోऽర్చయన్త్య ఏష వః పుణ్యః సుకృతో బ్రహ్మలోకః ॥**

మరి ఆ ఆహుతులు సూర్యకిరణాలై యజమానిని ఏ రీతిగా ఇంద్రలోకం చేరుస్తాయో యిక్కడ వర్ణించబడుతున్నది. పైవిధంగా బాగా మండే యజ్ఞాగ్నిలో వేయబడ్డ ఆ దేదీప్యమానమైన ఆహుతులు ఆ యజమాని (అగ్నిహోత్రి)తో (అతని మరణ వేళ) యిలా - "రా, రా, నీవు చేసిన శుభకర్మల ఫలంగా నీకీ బ్రహ్మలోకం లభిస్తున్నది నీవు సకల స్వర్గసుఖాలు పొందే స్వర్గలోకమిదే రా ! " అంటూ ప్రియవచనాలు పదే పదే పలుకుతూ, చక్కగా ఆదర సత్కారాలు చేస్తూ, (సూర్యకిరణాలుగా మారి) సూర్యకిరణాల ద్వారా ఆ యజమాని (అగ్నిహోత్రి)ని బ్రహ్మలోకానికి తీసుకు వెళ్తాయట ఇక్కడ స్వర్గలోకం, బ్రహ్మలోకం రెండూ ఒకటేననే విధంగా చెప్పబడడం గమనార్హం ఇంద్రుడు భగవంతుని అపరస్వరూపం అంటే అపర బ్రహ్మ గనుక యిది సరియైనదేనని వేదాంతుల వ్యాఖ్య **(6)**

**ప్లవా హ్యేతే అదృఢా యజ్ఞరూపా అష్టాదశోక్తమవరం యేషు కర్మ।**
**ఏతచ్ఛ్రేయో యేఽభినన్దన్తి మూఢా జరామృత్యుం తే పునరేవాపి యన్తి॥**

ఈ యజ్ఞరూప నౌకలు పద్దెనిమిదీకూడ చాల అదృఢమైనవి, అస్థిరమైనవి. వీటిలో దిగువశ్రేణికిచెందిన కర్మలే (ఉపాసనారహిత సకామ కర్మలే) సూచించబడ్డాయి మూర్ఖులు కొందరు యివే కళ్యాణదాయక సాధనాలని చెప్పి ప్రశంసిస్తుంటారు. కాని యిందువల్ల వారికి విమోచన లభించదు సరికదా జరామరణాలుమాత్రం పదే పదే సంభవిస్తాంటాయి. అంటే యిక్కడ యజ్ఞాన్ని ఒక నౌకలా వర్ణించడం జరిగింది. అంతేగాక వాటి సంఖ్య పద్దెనిమిది అనికూడ చెప్పబడింది అంటే నిత్య, దర్శ, పౌర్ణమాస, చాతుర్మాస్య వగైరా భిన్నరకాల యజ్ఞాలు పద్దెనిమిది వున్నట్లు లెక్క పైన మూడో శ్లోకంలో చెప్పిన ప్రకారమైతే ఈ యజ్ఞాల్లో ఏ లోపం జరిగినా ఫలం దక్కదుగదా. కనుక ఈ యజ్ఞాలవల్ల బ్రహ్మసాయుజ్యం అటుంచి స్వర్గసుఖాలు దక్కేదికూడ సందేహమే. కనుకనే ఈ నౌకలు అదృఢం, అస్థిరం అని చెప్పబడ్డాయి వీటిని నమ్ముకునే వారు జనన మరణ చక్రంలో చిక్కుకుని కొట్టుమిట్టాడుతూనే వుంటారు వేదాలలో అంత గొప్పగా ప్రశంసించబడ్డ యజ్ఞకార్యాలను యిక్కడ వేదాంతాలలో ఒక విధంగా అపహాస్యం చేయడమే యిదని గమనించాలి కనుక ఈ దశ వచ్చేసరికి అంతకు పూర్వం చెప్పబడిన అసంఖ్యాక కర్మకాండలపట్ల కొందరు ఆలోచనాపరుల్లో ఒక విధమైన నిరసన, అసంతృప్తి పెల్లుబికాయని, కనుక వాళ్ళు ఆధ్యాత్మిక చింతనకు, ఉపాసనకు మరికొన్ని ప్రత్యామ్నాయ మార్గాలు వెదకసాగారని గ్రహించాలి **(7)**

**అవిద్యాయామన్తరే వర్తమానాః స్వయంధీరాః పణ్డితం మన్యమానాః।**
**జఙ్ఘన్యమానాః పరియన్తి మూఢా అన్ధేనైవ నీయమానా యథాన్ధాః॥**

అవిద్యలో వుంటూనే తమకు తాము బుద్ధిమంతులుగానూ, పండితులుగానూ లెక్కించుకునే మూర్ఖులు పదే పదే దెబ్బలుతింటూ (కష్టనష్టాలు పడుతూ) కూడ వివేకం తెచ్చుకోక గుడ్డివాని చేయిపుచ్చుకుని( మార్గదర్శకత్వంలో) నడిచే గుడ్డివాళ్ళలాగే తమ గమ్యం చేరలేక అటూ ఇటూ దారితప్పి తిరుగుతూ

వుంటారు. ఇక్కడకూడ బ్రహ్మతత్వోపాసనకుబదులు మిధ్యాకర్మకాండలపై శ్రద్ధాసక్తులు చూపించేవారిని తీవ్రంగా విమర్శించబడింది. [ఇదే శ్రీమహా భాగవతం లో మన పోతన - *కాననివాని నూతగొని కాననివాడు విశిష్ట వస్తువుల్ గానని భంగి గర్మములు గైకొని కొందఱు కర్మబద్ధులై కానరు విష్ణు ...* అంటూ చక్కగా పద్యం చెప్పాడు] **(8)**

**అవిద్యాయాం బహుధా వర్తమానా వయం కృతార్థా ఇత్యభిమన్యన్తి బాలాః ।**
**యత్కర్మిణో న ప్రవేదయన్తి రాగాత్తేనాతురాః క్షీణలోకాశ్చ్యవన్తే ॥**

ఆ మూర్ఖులు అవిద్యలో (ఐహిక, స్వర్గసుఖాలు కాంక్షించే సకామ కర్మల్లో) అనేకవిధాలుగా మగ్గుతూనే, అలాంటి సకామకర్మలు చేసి తాము కృతార్థులమై పోయామని పొంగిపోతూంటారు. అయితే వాళ్లు సకామకర్మలు చేస్తూ విషయాసక్తి కలిగివుంటారుగనుక బ్రహ్మతత్వాన్ని ఎరుగలేక, చేరలేక నిజమైన కళ్యాణం పొందలేకపోతారు. కనుక వాళ్లు మాటి మాటికీ పుణ్యలోకాలనుండి (అంటే యజ్ఞయాగాది కర్మకాండల ఫలంగా కొంతకాలం పాటు స్వర్గసుఖాలు పొందినా ఆ తర్వాత అక్కడనుండి) తోసివేయబడుతూ, భూలోకం లేక యితర అధోలోకాల్లో పడి [వివిధ నీచ జన్మలెత్తుతూ] దుఃఖాలు అనుభవిస్తూ, సదా ఆరాటం చెందుతూనేవుంటారు. **(9)**

**ఇష్టాపూర్తం మన్యమానా వరిష్ఠం నాన్యచ్ఛ్రేయో వేదయన్తే ప్రమూఢాః ।**
**నాకస్య పృష్ఠే తే సుకృతేనుభూత్వేమం లోకం హీనతరం వా విశన్తి ॥**

ఇష్ట , పూర్త కర్మలను శ్రేష్ఠమైనవిగా భావించే పరమ మూర్ఖులు దానికి భిన్నమైన వాస్తవిక శ్రేయస్సునుగురించి ఎరుగరు కనుక తమ పుణ్య (సకామ) కర్మలద్వారా వాళ్లు స్వర్గలోకంలో ఉచ్చతమ స్థానాన్ని పొందినా, అక్కడి దివ్యసుఖాలను అనుభవించిన పిదప మళ్లీ (అక్కడనుండి) ఈ భూలోకానికో, లేక యింత కంటే అధోలోకాలకో పడిపోయి [శూకర-కూకర, క్రిమికీటకాది హీన జన్మలెత్తి] దుఃఖాలు అనుభవిస్తూంటారు. ఇక్కడ యజ్ఞయాగాది శ్రౌతకర్మలు 'ఇష్ట' కర్మ లనీ, పోతే బావులు తవ్వించడం, తోటలు పెంచడం, చెరువులు నిర్మించడం

వంటి లోకోపకార కార్యాలు 'పూర్త ' కర్మలనీ తెలుసుకోవాలి. ఈ శ్రౌత, పూర్త కర్మలకంటెకూడ బ్రహ్మతత్త్వోపాసనే శ్రేష్ఠమని చెప్పబడింది **(10)**

**తపఃశ్రద్ధే యే హ్యుపవసన్త్యరణ్యే శాన్తా విద్వాంసో భైక్ష్యచర్యాం చరన్తః।**
**సూర్యద్వారేణ తే విరజాః ప్రయాన్తి యత్రామృతః స పురుషో హ్యవ్యయాత్మా ॥**

కాని యిలా ఐహిక, స్వర్గసుఖాలు కాంక్షించి కర్మకాండలు చేసేవారికి భిన్నంగా అలాంటి సుఖాలపట్ల నిరాసక్తులై, వైరాగ్యభావంతో అడవుల్లో వుంటూనో లేక భిక్షాటన చేస్తూ తిరుగుతూనో, లేక గృహస్థులైనా శాంతస్వభావులై సంయమంతో, శ్రద్ధతో తపస్సు (బ్రహ్మతత్త్వోపాసన) చేసేవాళ్లు - అంటే తమ తమ వర్ణాశ్రమ ధర్మాలనుబట్టి సంయమపూర్వకంగా శమదమాది ధర్మాలతో, నిర్వికార భావంతో ఆ పరమాత్మనే ప్రార్థిస్తూండేవారని వేదాంతుల వ్యాఖ్య - నేరుగా సూర్యలోకానికే పోతారు, అక్కడనుండి నిత్యము, అవ్యయము, అమృత స్వరూపమైన ఆ పరమాత్మ సన్నిధికి చేరుకుంటారు. **(11)**

**పరీక్ష్య లోకాన్కర్మచితాన్బ్రాహ్మణో నిర్వేదమాయాన్నాస్త్యకృతః కృతేన।**
**తద్విజ్ఞానార్థం స గురుమేవాభిగచ్ఛేత్సమిత్పాణిః శ్రోత్రియం బ్రహ్మనిష్ఠమ్ ॥**

ఇష్ట, పూర్త కర్మలు శ్రద్ధగా చేస్తూ అలాంటి సకామకర్మలవల్ల లభించే లోకాలను నిశితంగా పరిశీలించిన బ్రాహ్మణులు వాటి అనిత్యత్వాన్ని గుర్తించి, అలాంటి సకామకర్మలవల్ల స్వతఃసిద్ధ నిత్య తత్త్వమైన పరమాత్మ దుర్లభమని గ్రహించి, ఆ పరబ్రహ్మ జ్ఞానంపొందడానికిగాను చేతిలో సమిధలు పట్టుకుని, వేదాలను చక్కగా అర్థంచేసుకున్న బ్రహ్మనిష్ఠులైన (పరమాత్మతత్త్వాన్ని ఎరిగిన) గురువు వద్దకు వినయపూర్వకంగా వెళ్లాలి ఇక్కడ సకామ కర్మలను పూర్తిగా త్రోసి వేయడంకాక అవి చేసి, వాటి ఫలితాలను పరీక్షించవల్సివుందనే సూచన వుంది అంటే ఎవరికైనా స్వీయానుభవంవల్లగాని వైరాగ్య భావం రాదని అంతరార్థం. అలా వైరాగ్యభావం కలిగినతర్వాత యిక కావల్సింది ఒక గురువు హిందూ తత్త్వశాస్త్రంలో గురువుకున్న మహత్తు అపారమైనది; అనిర్వచనీయమైనది

ఎంత చదివినా, ఆచరించినా సరియైన గురువు లేకుంటే అది నిరర్థకమేనన్న సూచన ప్రతి చోటా కనిపిస్తుంది అందుకే *గురుర్బ్రహ్మ, గురుర్విష్ణు ... ... గురు* **సాక్షాత్ పరబ్రహ్మ** అన్నారుకూడ. అలాంటి గురువు దగ్గరకు ఏమి తీసుకెళ్లినా లేకున్నా చేతిలో సమిధలు పట్టుకునైతే వెళ్లాలి అంటే అరణ్యాల్లో, ఆశ్రమాల్లో వసించేవారికి అగ్ని ఆవశ్యకత అపారం, దాన్ని రగిలించడానికి సమిధలు అత్యవసరం, కనుక అవి అమూల్యమని అంతరార్థం లేక బహుశా అవి సంకేత పరంగాకూడ (పూర్వ) ప్రాముఖ్యాన్ని సూచిస్తూవుండవచ్చు. **(12)**

**తస్మై స విద్వానుపసన్నాయ సమ్యక్ప్రశాన్తచిత్తాయ శమాన్వితాయ ।**
**యేనాక్షరం పురుషం వేద సత్యం ప్రోవాచ తాం తత్త్వతో బ్రహ్మవిద్యామ్ ॥**

అలాంటి సంపూర్ణ శాంతస్వభావుడు, మనస్సు, ఇంద్రియాలపై విజయం సాధించిన శ్రద్ధాళువు అయిన శిష్యుడు తన వద్దకు వచ్చి శరణు వేడినప్పుడు అలా ప్రార్థించబడే జ్ఞాని, మహాత్ముడైన ఆ గురువు అతడ్ని చేరదీసి, అతడికి బ్రహ్మతత్వాన్ని చక్కగా ఉపదేశించాలి. దానిద్వారా ఆ శిష్యుడు నిత్యము, అనశ్వరమైన ఆ పరబ్రహ్మతత్వాన్ని గ్రహించేట్లు చేయాలి అంటే యిక్కడ శిష్యుని స్వభావం ఎలావుండాలి, గురువు కర్తవ్యమేమిటనే విషయాలు వివరించబడ్డాయి. బ్రహ్మతత్వం ప్రతి ఒక్కరికీ బోధించబడేదికాదు. అందుకు అర్హత వుండాలి. శాంతస్వభావంకలిగిన, నిర్వికారుడైన, శ్రద్ధాళువైన వ్యక్తికే ఆ అర్హత వుంది. అలాంటి అర్హతకలిగిన శిష్యుడు వచ్చినప్పుడు గురువు విధిగా అతడ్ని చేరదీసి, మరే ప్రతిఫలాపేక్ష లేకుండా అతడికి చక్కగా, బాగా అర్థమయ్యే విధంగా ఆ బ్రహ్మతత్వాన్ని ఉపదేశించాలి. **(13)**

## ద్వితీయ ఖండం సమాప్తం

## ప్రథమ ముణ్డక సమాప్తం.

* * * * *

# రెండవ ముణ్డక

## మొదటి ఖండం

అపర విద్య స్వరూప స్వభావాలు, దాని ఫలాలనుగురించి, బ్రహ్మతత్వంతో పోలిస్తే దాని తుచ్ఛతగురించి ప్రథమ ముండకం, ద్వితీయ ఖండంలో చెప్పబడింది. అలాగే దానిపట్ల విరక్తిచెంది పర(బ్రహ్మ) విద్య పొందడానికిగాను సాధకుడు ఒక సద్గురువును శరణు కోరాలని ఆదేశించబడింది ఇప్పుడు ఈ ప్రకరణంలో పరవిద్యగురించి వర్ణించబడుతున్నది

**తదేతత్సత్యం యథా సుదీప్తాత్పావకాద్విస్ఫులిఙ్గాః సహస్రశః ప్రభవన్తే సరూపాః ।**
**తథాక్షరాద్వివిధాః సోమ్య భావాః ప్రజాయన్తే తత్ర చైవాపియన్తి ॥**

మహర్షి అంగిరా యిలా అంటున్నాడు ఓ ప్రియ శిష్యా (శౌనకా) ! ఇంతకు మునుపు పరమాత్మస్వరూపం వర్ణిస్తూ నేను నీకేదైతే చెప్పానో అది సర్వథా సత్యమైనది. ఏ విధంగానైతే బాగా మండుతున్న అగ్నినుండి ప్రకాశవంతమైన నిప్పురవ్వలు వేలాదిగా ఎగిసి నలుదిక్కులా చెదిరి పడుతూంటాయో, అలాగే అనశ్వరమైన ఆ పరబ్రహ్మనుండి నానా ప్రకారాలైన భావాలు- మూర్త, అమూర్త పదార్థాలు- (సృష్టికాలంలో) ప్రకటమౌతుంటాయి. అలాగే మళ్లీ (ప్రళయ కాలంలో) అవి ఆ పరబ్రహ్మతత్వంలో లయించి పోతుంటాయి. (1)

**దివ్యో హ్యమూర్తః పురుషః సబాహ్యాభ్యన్తరో హ్యజః ।**
**అప్రాణో హ్యమనాః శుభ్రో హ్యక్షరాత్పరతః పరః ॥**

నిశ్చయంగా ఆ దివ్యపురుషుడు (పరబ్రహ్మ) ఆకారరహితుడు, సమస్త జగత్తు లోపల, వెలుపలకూడ వ్యాపించినవాడు, పుట్టుక లేని వాడు, మనస్సులేనివాడు, అందుచేత అత్యంత పరిశుద్ధుడు. అందువల్లే అనశ్వరమైన జీవాత్మకంటెకూడ ఆ పరబ్రహ్మ సర్వథా శ్రేష్ఠుడు (2)

ఏతస్మాజ్జాయతే ప్రాణో మనః సర్వేన్ద్రియాణి చ।
ఖం వాయుర్జ్యోతిరాపః పృథివీ విశ్వస్య ధారిణీ॥

దీనినుండే (అంటే నిరాకారుడు, మనస్సు, ఇంద్రియాలు మొదలైన కారణ సముదాయాలు లేనివాడు, అయితే సర్వశక్తిమంతుడైన పరమాత్మనుండే) ప్రాణం ఉత్పత్తవుతుంది అలాగే మనస్సు(అంతఃకరణాలు), సకలేంద్రియాలు, ఆకాశం, వాయువు, తేజస్సు, నీరు, భూమి (విశ్వస్యధారిణీ పృధివీ - సకల ప్రాణులకూ ఆధారమైన భూమి) - అనే పంచ మహాభూతాలు ఉత్పన్నమవుతాయి. (3)

అగ్నిర్మూర్ధా చక్షుషీ చన్ద్రసూర్యౌ దిశః శ్రోత్రే వాగ్వివృతాశ్చ వేదాః।
వాయుఃప్రాణోహృదయం విశ్వమస్యపద్భ్యాం పృథివీ హ్యేషసర్వభూతాన్తరాత్మా॥

దానికి (నిరాకార, నిర్వికార పరబ్రహ్మయొక్క విరాట్ పరమేశ్వరరూపానికి) అగ్ని తల సూర్యచంద్రులు కళ్లు సకలదిక్కులే చెవులు ప్రకటమైన వేదాలే దాని వాణి వాయువు ప్రాణం. ఈ విశ్వమే దాని హృదయం దాని రెండు పాదాలనుండి భూమి ఉత్పన్నమైంది ఇదే సమస్త ప్రాణులకు అంతరాత్మ అయిన పరబ్రహ్మస్వరూపం [ఇదే శ్రీమహాభాగవతం లో యిలా కొంత వేరుగా చెప్పబడింది భగవంతుడైన హరి విరాడ్విగ్రహంబునందు భూత భవిష్య ద్వర్తమానంబైన విశ్వంబు విలోక్యమానంబగు. ధరణీ సలిల తేజస్సమీరణ గగనాహంకార మహత్తత్వంబు లనియెడి సప్తావరణంబులచేత నావృతంబగు మహాండకోశంబైన శరీరంబునందు ధారణాశ్రయంబైన వైరాజపురుషుండు దేజరిల్లు. అ మ్మహాత్మునికి బాదమూలంబు పాతాళంబు, పార్ష్ణిభాగ పాదాగ్ర భాగంబులు రసాతలంబు, గుల్ఫంబు మహాతలంబు, జంఘలు తలాతలంబు, జానుద్వయంబు సుతలంబు, ఊరువులు వితలాతలంబులు, జఘనంబు మహీతలంబు, నాభీవివరంబు నభస్తలంబు, వక్షంబు గ్రహ తారకా ముఖర జ్యోతిస్సమూహ సమేతంబగు నక్షత్ర లోకంబు, గ్రీవము మహర్లోకము, ముఖంబు జనలోకంబు, లలాటంబు తపోలోకంబు, శీర్షంబులు సత్యలోకంబు, బాహుదండంబు లింద్రాదులు, కర్ణంబులు దిశలు, శ్రవణేంద్రియంబు శబ్దంబు, నాసాపుటంబు లశ్వినీ దేవతలు, ఘ్రాణేంద్రియంబు గంధంబు, వదనంబు వహ్ని, నేత్రంబు లంతరిక్షంబు, చక్షురింద్రియము సూర్యుండు, రేయింబగళ్లు ఱెప్పలు, భ్రూయుగ్మ విజృంభణంబు బ్రహ్మపదంబు, తాలువులు జలంబు, జిహ్వేంద్రియంబు రసంబు, భాషణంబులు సకల వేదంబులు, దంష్ట్రలు దండధరుండు, దంతంబులు పుత్రాది స్నేహకళలు, నగవులు జనోన్మాదకారిణియగు మాయ,

కటాక్షంబులు దురంత సంసర్గంబులు, పెదవులు వ్రీడాలోభంబులు, స్తనంబులు ధర్మంబు, వెన్నుధర్మమార్గంబు, మేఢ్రంబు ప్రజాపతి, వృషణంబులు మిత్రావరుణులు, జఠరంబు సముద్రంబులు, శల్య సంఘంబులు గిరులు, నాడీ నివహంబులు నదులు, తనూరుహంబులు తరువులు, నిశ్వాసంబులు వాయువులు, కాలంబు గమనంబు, కర్మంబులు నానావిధ జంతు సన్నివహసంవృత సంసరణంబులు, శిరోజంబులు మేఘంబులు, కట్టు పుట్టంబులు సంధ్యలు, హృదయంబు ప్రధానంబు, సర్వవికారంబులకు నాశ్రయభూతంబైన మనము చంద్రుండు, చిత్తంబు మహత్తత్వంబు, అహంకారంబు రుద్రుండు, అశ్వాశ్వతర్యుష్ట్ర గజంబులు నఖంబులు, కటిప్రదేశంబు పశు మృగాదులు, విచిత్రంబులైన యాలాపనైపుణంబులు పక్షులు, బుద్ధి మనువు, నివాసంబు పురుషుండు, షడ్జాదులైన స్వరవిశేషంబులు గంధర్వ విద్యాధర సిద్ధ చారణాప్సర స్సమూహంబులు, స్మృతి ప్రహ్లాద ప్రముఖులు, వీర్యంబు దైత్య దానవానీకంబై యుండు. మఱియు నమ్మహావిభునకు ముఖంబు బ్రాహ్మణులు, భుజంబులు క్షత్రియులు, ఊరులు వైశ్యులు, చరణంబులు శూద్రులు, నామంబులు నానావిధంబులైన వసు రుద్రాది దేవతాభిదానంబులు, ద్రవ్యంబులు హవిర్భాగంబులు, కర్మంబులు యజ్ఞ ప్రయోగంబులు, ఇట్టి సర్వమయుండైన పరమేశ్వరుని విగ్రహంబున ముముక్షుండైన వాడు మనస్సంధానంబు సేయవలయు ... ... అంటే ఇది ఉపనిషత్తులతర్వాత చాలా కాలానికి, పురుషసూక్తంసైతం వెలువడిన పిదప వర్ణాశ్రమధర్మాలను కూడ వివరిస్తూ జరిగిన వర్ణన అని గమనించాలి మన కింతవరకు ఉపనిషత్తుల్లో వర్ణాశ్రమధర్మ ప్రస్తావన కనిపించకపోవడంకూడ ముఖ్యంగా గమనార్హమే] **(4)**

**తస్మాదగ్నిః సమిధో యస్య సూర్యః సోమాత్పర్జన్య ఓషధయః పృథివ్యామ్ ।**
**పుమాన్రేతః సిఞ్చతి యోషితాయాః బహ్వీః ప్రజాః పురుషాత్సమ్ప్రసూతాః ॥**

దానినుండే అగ్ని ప్రకటమయింది దాని సమిధలు (ఇంధనం) సూర్యుడు ఆ అగ్నినుండి సోమం (చంద్రుడు) ఉత్పన్నమయింది ఆ చంద్రబింబంనుండి పర్జన్యం (మేఘం) పుట్టింది మేఘాలు వర్షించడంవల్ల ఈ భూమిపై నానా విధాలైన ఓషధులు ఉత్పన్నమైనాయి. (ఈ మందుమొక్కల్ని భక్షించడంద్వారా కలిగే) వీర్యంతో పురుషుడు స్త్రీ (యోని)ని తడుపుతాడు దానివల్ల సంతానోత్పత్తి జరుగుతుంది. ఈ విధంగా ఆ పరమ పురుషుని నుండి నానావిధ చరాచర జీవజాలం నియమపూర్వకంగా ఉత్పన్నమయింది **(5)**

**తస్మాదృచః సామ యజూంషి దీక్షా యజ్ఞాశ్చ సర్వే క్రతవో దక్షిణాశ్చ ।**
**సంవత్సరశ్చ యజమానశ్చ లోకాః సోమో యత్ర పవతే యత్ర సూర్యః ॥**

ఈ పరమపురుషునినుండే ఋగ్వేదపు ఋచాలు, సామవేద మంత్రాలు, యజుర్వేద శ్రుతులు, దీక్ష (అంటే యజ్ఞాన్ని ఆరంభించేముందు యజమాని అనుష్ఠానసంబంధమైన నియమాలను తాను తప్పక పాలిస్తాననే సంకల్పంతో చేసే శపథం), సమస్త యజ్ఞాలు, క్రతువులు, ఇంకా దక్షిణలు ఉద్భవించాయి. అలాగే సంవత్సరరూప కాలం, యజ్ఞాలు చేసే అధికారంగల యజమాని, ఆ యజ్ఞాల ఫలంగా సూర్యచంద్రుల ప్రకాశం వ్యాపించివుండే సకల లోకాలు ఉద్భవించాయి. తాత్పర్యమేమంటే సర్వస్వమూ దాని (పరబ్రహ్మతత్వం) నుండే ఉత్పత్తయింది. అదే అన్నింటికీ పరమ కారణం. **(6)**

**తస్మాచ్చ దేవా బహుధా సంప్రసూతాః సాధ్యా మనుష్యాః పశవో వయాంసి ।**
**ప్రాణాపానౌ వ్రీహియవౌ తపశ్చ శ్రద్ధా సత్యం బ్రహ్మచర్యం విధిశ్చ ॥**

దానినుండే అనేక విధాలైన దేవతాగణాలు ఉద్భవించారు దానినుండే సాధ్య గణాలు(ఒక రకమైన స్వర్లోకవాసులు), నానాప్రకారాలైన మనుష్యులు, పశు పక్ష్యాదులు, ప్రాణ-అపాన వాయువులు, వడ్లు, యవలు(బార్లీ) వంటి అన్న ధాన్యాలు, అలాగే తపస్సు, శ్రద్ధ, సత్యం, బ్రహ్మచర్యం (ఈ బ్రహ్మచర్యానికీ తర్వాతి కాలపు ఆశ్రమధర్మానికి సంబంధించిన బ్రహ్మచర్యానికీ తేడా వున్నట్లనిపిస్తుంది ఇక్కడ బ్రహ్మచర్యమంటే బ్రహ్మతత్వజిజ్ఞాస అని అర్థం చేసుకోవాలేమో), యింకా యజ్ఞాదుల అనుష్ఠానానికి వలసిన విధినియమాలు అన్నీ ఉత్పన్నమయినాయి అంటే సర్వస్వానికీ పరమ కారణమదే. **(7)**

**సప్త ప్రాణాః ప్రభవన్తి తస్మాత్ సప్తార్చిషః సమిధః సప్త హోమాః।**
**సప్త ఇమే లోకా యేషు చరన్తి ప్రాణా గృహాశయా నిహితాః సప్త సప్త॥**

దానినుండే సప్తప్రాణాలు [అంటే యిక్కడ విషయాలను ప్రకటంచేసే విశేష ప్రాణశక్తులుగల ఏడు ఇంద్రియాలు - కళ్లు, చెవులు, ముక్కు, నాలుక, నోరు (వాక్కు), చర్మం (స్పర్శ), మనస్సు - అని అర్థం] పుట్టుకొచ్చాయి { పై ఏడే కాక యింకో నాలుగు - కాళ్లు, చేతులు, ఉపస్థ, గుదం - కూడ ఇంద్రియాలేనని, వెరసి మొత్తం పదకొండు ఇంద్రియాలున్నాయని బ్రహ్మసూత్రాల్లో చెప్పబడింది}. సప్తార్చులు (కాలీ, కరాళీ మొదలైన ఏడు అగ్నినాలుకలు) ఉద్భవించాయి. సప్త సమిధలు ( అంటే చూడడం, వినడం, రుచిచూడడంవంటి ఏడు ఇంద్రియవృత్తులు) ఉత్పన్నమయినాయి. ఏడు హవనాలు (అంటే బాహ్యావిషయరూప సప్త సమిధలు ఇంద్రియరూప సప్తాగ్నుల్లో నిక్షిప్తంకావడం), ఈ ఇంద్రియాల నివాసస్థానాలుగావుండే సప్తలోకాలు పుట్టాయి వీటిలో ఇంద్రియరూప సప్త ప్రాణాలు విచరిస్తూ తమ తమ వృత్తుల్ని నిర్వర్తిస్తుంటాయి. ఈ ఏడేడు తత్వాల సముదాయాలు పరమాత్మద్వారానే సమస్త ప్రాణుల్లో హృదయరూప గుహాంతరాళాల్లో అలా నిక్షిప్తం చేయబడ్డాయి **(8)**

**అతః సముద్రా గిరయశ్చ సర్వేऽస్మాత్స్యన్దన్తే సిన్ధవః సర్వరూపాః।**
**అతశ్చ సర్వా ఓషధయో రసశ్చ యేనైష భూతైస్తిష్ఠతే హ్యన్తరాత్మా॥**

దీనినుండే సకల సముద్రాలు, పర్వతాలు ఉత్పన్నమయినాయి దీనినుండే నానా విధాలైన నదీనదాలు ఉద్భవించి, ప్రవహిస్తున్నాయి ఇంకా దీనినుండే సమస్త ఓషధులు ఉత్పన్నమయినాయి అంతేగాక ఏ రసంతోనైతే పుష్టిపొంది పరమాత్మ (అంతరాత్మ) సమస్తప్రాణుల ఆత్మలతోబాటుగా వాటి వాటి హృదంతరాళాల్లో వసించివుంటాడో ఆ రసంకూడ దానినుండే ఉద్భవించింది. **(9)**

**పురుష ఏవేదం విశ్వం కర్మ తపో బ్రహ్మ పరామృతమ్ । ఏతద్యో వేద నిహితం గుహాయాం సోऽవిద్యాగ్రన్థిం వికిరతీహ సోమ్య ॥**

తపస్సు అంటే సంయమరూప సాధనాలు, కర్మ అంటే బాహ్యసాధనాలద్వారా చేసే పనులు, అలాగే పరమామృతస్వరూప బ్రహ్మ - ఇవన్నీకూడ ఆ పరమాత్మలోనే నిక్షిప్తమైవున్నాయి. కనుక ఓ ప్రియ శిష్యా ! హృదయరూప గుహాంతరాళంలో దాగివున్న ఈ అంతర్యామి పరమేశ్వరుడ్నిగురించి తెలుసుకొనేవారు ఈ మనుష్య శరీరంలోవుంటూనే అవిద్యారూప చిక్కుముడిని విప్పగల్గుతారు అంటే నిజమైన, అన్ని సంశయాలకు, భ్రమలకు దూరమైన బ్రహ్మవిద్యను పొంది పరమాత్మకు ప్రాప్తమైపోతారు. **(10)**

## ప్రథమ ఖండం సమాప్తం.



# రెండవ ఖండం

**ఆవిః సంనిహితం గుహాచరం నామ మహత్పదమత్రైతత్సమర్పితమ్ । ఏజత్ ప్రాణన్నిమిషచ్చ యదేతజ్జానథ సదసద్వరేణ్యం పరం విజ్ఞానాద్యద్వరిష్ఠం ప్రజానామ్ ॥**

అది (పరబ్రహ్మ) అత్యంత ప్రకాశవంతమైనది. సమస్త ప్రాణులకు అత్యంత సన్నిహితమైనది. ఆ ప్రాణుల హృదయగుహల్లో దాగివుండడంచేత ***గుహాచర*** అనే పేర ప్రసిద్ధమైన మహాపదం (పరమప్రాప్యమైనది) అది. చేష్టలు (కదలికలు, చర్యలు) జరిపే, ఊపిరిగల, కళ్లు రెపరెపలాడే (నిమేషములైన) సకల ప్రాణులూ ఈ పరమాత్మలోనే ప్రతిష్ఠితమైవుంటాయి అన్నింటికీ ఆశ్రయమైనది అదే. సత్తు అదే, అసత్తూ అదే - అంటే కార్యమూ, కారణమూ రెండూ అదే; ప్రకటమైనది, అప్రకటమైనది రెండూ అదే అలాంటి పరబ్రహ్మతత్వాన్ని నీవు తెలుసుకోవల్సింది. సకల ప్రాణులు ఏరి కోరి తెలుసుకోదగిన దది; కాని సమస్త ప్రాణుల బుద్ధికీ అతీతమైనది - అంటే కేవలం బుద్ధిద్వారానే అయితే అజ్ఞేయమైనదది (1)

**యదర్చిమద్యదణుభ్యోఽణు చ యస్మింల్లోకా నిహితా లోకినశ్చ । తదేత దక్షరం బ్రహ్మ స ప్రాణస్తదువాఙ్మనః । తదేతత్సత్యం తదమృతం తద్వేద్ధవ్యం సోమ్య విద్ధి ॥**

ఏదైతే అత్యంత ప్రకాశవంతమైనదో, ఏదైతే సూక్ష్మాతిసూక్ష్మమైనదో, దేనిలోనైతే సమస్త లోకాలు - వాటిలోని సకల లోకులతోయుక్తంగా - స్థితమై వున్నాయో, అదే అనశ్వరమైన బ్రహ్మ; అదే ప్రాణం; అదే వాక్కు; అదే మనస్సు. అదే ఈ సత్యమనేది. అదే అమృతతత్వం. కనుక ఓ ప్రియశిష్యా ! ఈ తెలుసుకోదగిన తత్వాన్ని నీవు తెలుసుకోవల్సింది (2)

**ధనుర్గృహీత్వౌపనిషదం మహాస్త్రం శరం హ్యుపాసానిశితం సన్దయీత।**
**ఆయమ్య తద్భాగవతేన చేతసా లక్ష్యం తదేవాక్షరం సోమ్య విద్ధి॥**

ఓ ప్రియశిష్యా! ఔపనిషద (అంటే ఉపనిషత్తుల్లో వర్ణింపబడిన ఓంకార రూప) మహాయుధమైన విల్లును అందుకొని, ఉపాసనద్వారా నిశ్చయంగా సునిశితం గావించబడిన బాణాన్ని సంధించి, పవిత్ర భావపూర్ణ చిత్తంద్వారా ఆ బాణాన్ని లాగి ఆ అనశ్వరమైన పరబ్రహ్మను లక్ష్యంగా చేసుకొని (గురితప్పక) ప్రయోగించవల్సింది **(3)**

**ప్రణవో ధనుః శరో హ్యాత్మా బ్రహ్మ తల్లక్ష్యముచ్యతే।**
**అప్రమత్తేన వేద్ధవ్యం శరవత్తన్మయో భవేత్ ॥**

ప్రణవనాదమే (ఓంకారమే) ఆ ధనుస్సు; ఆత్మ(జీవాత్మ)యే ఆ బాణం; పరబ్రహ్మే దాని లక్ష్యం అని చెబుతారు. సంధించి విడవబడ్డ బాణం ఎలాగైతే మరే యితర చింతన లేకుండా తన్మయభావంతో లక్ష్యంవైపు సాగిపోతుందో, అదే విధంగా అప్రమత్తతతో తన్మయభావంతో ఉపాసన చేసే సాధకుడు మాత్రమే ఆ లక్ష్యాన్ని (పరబ్రహ్మను) బేధించగలడు (చేరగలడు) **(4)**

**యస్మిన్ద్యౌః పృథివీ చాన్తరిక్షమోతం మనః సహ ప్రాణైశ్చ సర్వైః।**
**తమేవైకం జానథ ఆత్మానమన్యా వాచో విముఞ్చథామృతస్యైష సేతుః॥**

దేనిలోనైతే స్వర్గం, భూమి, వాటిమధ్యగల అంతరిక్షం(సంపూర్ణ ఆకాశం), వాటిలోని సమస్త ప్రాణులతోయుక్తంగా మనస్సూ మమేకమై (గుచ్చబడి) వున్నాయో ఆ ఏకైక, (అన్నిటికీ) ఆత్మరూపమైన తత్వాన్ని (పరబ్రహ్మను) తెలుసుకో ఇతర సమస్త విషయాలను వదిలిపెట్టు ఇదే అమృత సేతువు (అంటే అమృతస్వరూప పరబ్రహ్మను చేర్చడానికిగాను సంసార సముద్రం దాటించే వంతెన ) అని తెలుసుకో **(5)**

**అరా ఇవ రథనాభౌ సంహతా యత్ర నాడ్యః స ఏషో ऽ న్తశ్చరతే బహుధా జాయమానః ।**
**ఓమిత్యేవం ధ్యాయథ ఆత్మానం స్వస్తి వః పారాయ తమసః పరస్తాత్ ॥**

రథచక్రం నాభి (కేంద్రం - ఇరుసు)కు అంటుకునివుండే ఆకుల్లాగా సమస్త దేహ (రూప) నాడులన్నీ దేనికి అంటుకునివుంటాయో, ఆ హృదయరూప గుహలో నానా రూపాల్లో ప్రకటమయ్యే పరమాత్మ అంతర్నిహితమై వుంటాడు ఆ అంతర్యామి పరమాత్మ శరీరాంతరాల్లో చరిస్తూంటాడు. ఈ పరమాత్మను ప్రణవంద్వారా (ఓం అనే పేరుద్వారానే) మీరు ధ్యానించండి. ఈ విధంగా నిరంతర ఓంకార నాదోపాసన ద్వారానే మీరు అజ్ఞానాంధకారాన్ని దాటి, భవసాగరం ఆవలి తీరానవుండే ఆ తేజోమయమైన పరమాత్మను చేరుకోగలరు మీకు కళ్యాణమగుగాక ! **(6)**

**యః సర్వజ్ఞః సర్వవిద్యస్యైష మహిమా భువి ।**
**దివ్యే బ్రహ్మపురే హ్యేష వ్యోమ్న్యాత్మా ప్రతిష్ఠితః ॥**

**మనోమయః ప్రాణశరీరనేతా ప్రతిష్ఠితో ऽ న్నే హృదయం సన్నిధాయ ।**
**తద్విజ్ఞానేన పరిపశ్యన్తి ధీరా ఆనన్దరూపమమృతం యద్విభాతి ॥**

సర్వజ్ఞుడు, సమస్తమూ సకల కోణాలనుండీ ఎరిగినవాడు, ఈ ఆశ్చర్యకర మహిమను యీ జగత్తులో ప్రకటంగావించేవాడు, సుప్రసిద్ధుడైన సర్వప్రాణులకూ ఆత్మ అయిన ఈ పరాత్పరుడు దివ్య ఆకాశరూపమైన బ్రహ్మలోకంలో స్థితమై వున్నాడు సకల ప్రాణుల ప్రాణాల్ని, శరీరాల్ని నియంత్రించే ఈ నాయకుడు మనస్సుద్వారా వ్యాప్తి చెందుతాడుగనుక మనోమయుడనబడతాడు. ఈ పరమాత్మ సకలప్రాణుల హృదయ కమలాల్లో స్థితమైవుండి, అన్నమయమైన స్థూలశరీరంలో ప్రతిష్ఠితుడైవుంటాడు. అలాంటి ఆనంద స్వరూపుడు, అనశ్వరుడు, సర్వత్రా ప్రకాశమానుడు అయిన ఆ పరబ్రహ్మను బుద్ధిమంతులైన మానవులు విజ్ఞానంద్వారా చక్కగా తెలుసుకోగలుగుతారు. తమముందు సాక్షాత్కరింపజేసుకోగల్గుతారు **(7)**

**భిద్యతే హృదయగ్రన్థిశ్ఛిద్యన్తే సర్వసంశయాః ।**
**క్షీయన్తే చాస్య కర్మాణి తస్మిన్దృష్టే పరావరే ॥**

కార్యకారణస్వరూపుడైన ఆ పరబ్రహ్మతత్వాన్ని తెలుసుకొనడంతోనే ఈ జీవాత్మ హృదయంలోని చిక్కుముడులు విడిపోతాయి,సంశయాలన్నీ తొలగిపోతాయి సమస్త

(శుభాశుభ) కర్మలూ నష్టమైపోతాయి అంటే జీవుడు కర్మ బంధనాలనుండి, ఇతర బంధనాలన్నిటినుండీ ముక్తిపొంది ఆ పరబ్రహ్మను ప్రాప్తం గావించుకుంటాడు **(8)**

**హిరణ్మయే పరే కోశే విరజం బ్రహ్మ నిష్కలమ్ ।**
**తచ్ఛుభ్రం జ్యోతిషాం జ్యోతిస్తద్యదాత్మవిదో విదుః ॥**

ఆ నిర్మల, నిర్వికార, నిరవయవ పరబ్రహ్మ తేజోమయమైన పరమధామంలో విరాజమానమై వుంటుంది. అది సర్వదా విశుద్ధంగానూ, సమస్త జ్యోతులకూ (దీప్తి నొసగే అనిర్వచనీయ) జ్యోతిగానూ వుంటుంది దానిని ఆత్మజ్ఞానులు మాత్రమే తెలుసుకోగల్గుతారు, తెలుసుకొని వుంటారు **(9)**

**న తత్ర సూర్యోభాతి న చన్ద్రతారకం నేమా విద్యుతో భాన్తి కుతోఽయమగ్నిః ।**
**తమేవ భాన్తమనుభాతి సర్వం తస్య భాసా సర్వమిదం విభాతి ॥**

అక్కడ (పరమధామంలో) సూర్యుడు ప్రకాశించడు, లేదా చుక్కలుగాని, చంద్రుడు గాని ప్రకాశింపరు మెరుపుతీగలు మెరవవు మరి ఈ అగ్నిగురించైనా వేరుగా చెప్పేదేముంది? అదీ జ్వలించదు దాని (పరబ్రహ్మ) ప్రకాశంవల్లే అవన్నీ ప్రకాశించు తుంటాయి. దాని తేజస్సువల్లే ఈ సమస్త జగత్తూ వెలుగుతూంటుంది **(10)**

**బ్రహ్మైవేదమమృతం పురస్తాద్బ్రహ్మ పశ్చాద్బ్రహ్మ దక్షిణతశ్చోత్తరేణ ।**
**అధశ్చోర్ధ్వం చ ప్రసృతం బ్రహ్మైవేదం విశ్వమిదం వరిష్ఠమ్ ॥**

ఈ అమృతస్వరూప పరబ్రహ్మే ముందు వెనుకలా, కుడి, ఎడమలా, పైన, కింద - అంటే సకల దిశలా, సర్వ కోణాల్లో వ్యాపించివుంది అసలుకు ఈ సంపూర్ణ విశ్వమంతా బ్రహ్మయే. అంటే సమస్త జగత్తులోనూ సర్వశ్రేష్ఠమైన పరబ్రహ్మే పరివ్యాప్తమై వుందని గ్రహించాలి **(11)**

## ద్వితీయ ఖండం సమాప్తం

# ద్వితీయ ముణ్డక సమాప్తం.

★ ★ ★ ★ ★

# మూడవ ముణ్డక

## మొదటి ఖండం

**ద్వా సుపర్ణా సయుజా సఖాయా సమానం వృక్షం పరిషస్వజాతే ।
తయోరన్యః పిప్పలం స్వాద్వత్త్యనశ్నన్నన్యో అభిచాకశీతి ॥**

పరస్పరం స్నేహితుల్లా కలిసిమెలిసివుండే ఆ రెండు పక్షులూ (జీవాత్మ, పరమాత్మలు) ఒకే చెట్టు(ఈ శరీరం)ను ఆశ్రయించి వుంటాయి. ఆ రెంటిలోనూ ఒకటి ఆ వృక్ష ఫలాన్ని (కర్మరూప ఫలాన్ని) రుచిచూస్తూ భక్షిస్తూంటుంది. కాగా రెండవది ఏమీ తినకుండా కేవలం అలా చూస్తూ వుంటుంది అంటే జీవాత్మ ఐహిక సుఖభోగాలను అనుభవిస్తుందని, కాని పరమాత్మమాత్రం శరీరంలోని హృదయగుహలో వుంటూనే నిరాసక్తంగా, నిర్వికారంగా సర్వం గమనిస్తూవుంటుందని అర్థం ఒకటి రాగద్వేష యుక్తమై వుండగా మరొకటి వైరాగ్యభావంతో వుంటుంది. *భగవద్గీత* ***15:1*** లో ఈ ప్రపంచాన్ని ఒక అశ్వత్థ (రావి) వృక్షంగా పోల్చడం మనం గమనించాము. ఇక్కడ శరీరాన్ని అలాంటి వృక్షంగానూ, జీవాత్మ, పరమాత్మలను ఆ చెట్టుపై గూడు కట్టుకునివుండే రెండు పక్షులుగానూ పోల్చడం జరుగుతున్నది. అలాగే జీవాత్మ, పరమాత్మలు రెండూ వెలుగు నీడలవంటివని కఠోపనిషత్తులో అభివర్ణించడం కూడ మనం గమనించాము. ఈ వర్ణనలన్నీ ఈ రెంటి (జీవాత్మ, పరమాత్మల) సాన్నిహిత్యాన్ని, అంతిమంగా వాటి మమేకతను సూచిస్తున్నాయి. ఈ శ్లోకం తమ ద్వైతవాదానికి పరిపుష్టి నిస్తుందని శ్రీవైష్ణవులు చెబుతారు **(1)**

**సమానే వృక్షే పురుషో నిమగ్నో ऽ నీశయా శోచతి ముహ్యమానః ।
జుష్టం యదా పశ్యత్యన్యమీశమశ్య మహిమానమితి వీతశోకః ॥**

ఇంతకుముందే చెప్పిన శరీరరూప వృక్షంయొక్క హృదయమనే గూడులో ఆశ్రయం తీసుకునివుండే జీవాత్మ , తన సరసనే వున్న పరమాత్మను ఎరగనంత

వరకు, విషయాసక్తిలో మునిగి, ఐహిక భోగవిలాసాలు కాంక్షిస్తూ అసమర్థతా రూప దైన్యస్థితిని అనుభవిస్తూ, మోహవశమై రాగద్వేషాలతో దుఃఖపడుతూనే వుంటుంది. అయితే ఎప్పుడైతే ఇలాంటి జీవాత్మ, దివ్య మహిమాన్వితమైన, సదా భక్తులచే పూజింపబడి, సేవించబడే ఆ పరమేశ్వరుని అకారణ దయ, అనురాగాలవల్ల తనకంటె భిన్నమైన పరమాత్మను, దాని దివ్యమహిమను దర్శించ గల్గుతుందో, అప్పుడది శోకరహితమై పోతుంది. పరమాత్మ సన్నిధే సకల దుఃఖాలకు విమోచన కలిగిస్తుంది (2)

**యదా పశ్యః పశ్యతే రుక్మవర్ణః కర్తారమీశం పురుషం బ్రహ్మయోనిమ్ ।**
**తదా విద్వాన్పుణ్యపాపే విధూయ నిరఞ్జనః పరమం సామ్యముపైతి ॥**

ఎప్పుడైతే ఈ ద్రష్ట (జీవాత్మ) అందరినీ శాసించే, ఆ బ్రహ్మకుసైతం ఆది కారణమైన, సమస్త జగత్తునూ సృష్టించిన, దివ్యజ్యోతిర్మయ రూపియైన ఆ పరమ పురుషుణ్ణి సాక్షాత్కరింపజేసుకుంటుందో అప్పుడది తాను చేసిన పుణ్యాలు, పాపాలు అన్నింటి కర్మఫలాలనుండి విముక్తమై పోతుంది. ఆ విధంగా విశుద్ధ నిర్మలత్వాన్ని పొందిన ఆ జ్ఞాని మహాత్మ సర్వోత్తమ సమతను ప్రాప్తం గావించుకుంటాడు. [*భగవద్గీత, 12 వ అధ్యాయం, 13-19 శ్లోకాలలో* ఈ సర్వోత్తమ సమతాస్థితిగురించి చక్కగా వర్ణించబడింది ఉదాహరణకు 13- 14 శ్లోకాల్లో - *అద్వేష్టా సర్వ భూతానాం మైత్రః కరుణ ఏవ చ । నిర్మమో నిరహంకారః సమదుఃఖసుఖః క్షమీ ॥; సంతుష్ట సతతం యోగీ యతాత్మా ధృఢనిశ్చయః । మయ్యర్పిత మనోబుద్ధిః యో మద్భక్త స్స మే ప్రియః ॥*- అని చెప్పబడింది అంటే, భక్తియోగనిష్ఠగలవానికి సర్వభూతాలందు ద్వేషభావం అసలే వుండదు, కాగా కరుణ, స్నేహ భావాలుంటాయి అహంకార, మమకారాల్ని వర్జించి అతడు సుఖదుఃఖాల్ని సమంగా చూచే ఓరిమి కలిగివుంటాడు మనోనిగ్రహం కలిగి, ఎల్లప్పుడూ సంతృప్తి కలిగి ఉన్నత జీవిత లక్ష్యాలు కలిగి ధృఢనిశ్చయంతో తన మనోబుద్ధుల్ని నాకర్పించే అలాంటి భక్తుడు నాకెంతో యిష్టుడు అని అర్థం నాకు అంటే యిక్కడ ఆ పరమాత్మకు అని అర్థం]. (3)

**ప్రాణో హ్యేష యః సర్వభూతైర్విభాతి విజానన్విద్వాన్భవతే నాతివాదీ ।**
**ఆత్మక్రీడ ఆత్మరతిః క్రియావానేష బ్రహ్మవిదాం వరిష్ఠః ॥**

ఇదే (ఈ పరమాత్మే) ప్రాణం. ఈ పరమ ప్రాణమే సృష్టిలోని సకల ప్రాణుల ద్వారా బహిర్గతమై ప్రకాశిస్తుంటుంది. అంటే ఈ శరీరంలోని చైతన్యమంతా, చేష్టలన్నీ ఏ విధంగానైతే ప్రాణంపైనే ఆధారపడివుంటాయో, అదే విధంగా ఈ విశ్వంలోని సమస్త చరాచర వస్తుజాలం, ప్రాణికోటి చేష్టలన్నీకూడ ఆ పరమ ప్రాణమైన పరమాత్మపై ఆధారపడివుంటాయనే అర్థంకూడ ఈ సంగతి తెలుసుకున్న జ్ఞానవంతుడు అతివాది (డంబాచారాలు పలికేవాడు) కాజాలడు. తనలోనే ఆ పరమాత్మ నిక్షిప్తమైవున్నట్లు ఎరిగివుండడంచేత యధాయోగ్యమైన కార్యాలు (కర్మలు) నిర్వర్తిస్తూ, తనలోనే వున్న ఆ అంతర్యామితోనే ఆడుకుంటూ, అన్నీ ఆ అంతర్యామి సుఖభోగానికే అర్పిస్తూ వుంటాడు. ఇలాంటి జ్ఞాని బ్రహ్మతత్వవేత్తలలోకెల్లా శ్రేష్ఠుడైవుంటాడు అంటే అంతటి జ్ఞానికావడం ఎంతో దుర్లభమనే అర్థంకూడ యిమిడివుంది. [ ఇదే ***భగవద్గీత, 7:19*** లో యిలా చెప్పబడింది *బహూనాం జన్మనామంతే జ్ఞానవాన్మాం ప్రపద్యతే । వాసుదేవ స్సర్వమితి స మహాత్మా సుదుర్లభః ॥* - అంటే అనేక జన్మల సాధనా ఫలితంగా అరుదుగా ఒకరికి జ్ఞానోదయమవుతుంది అదే అతనికి తుది జన్మ దేహాంతంలో అతడు నన్నే (వాసుదేవుని) పొందుతాడు *జీవో బ్రహ్మైవ నా పరః* - అంటే జీవాత్మ, పరమాత్మల ఐక్యతనేగాక, **సర్వం ఖల్విదం బ్రహ్మ** - అంటే ఇదంతాకూడ బ్రహ్మ నని జీవుడు, ఈశ్వరుడు, సమస్త చరాచర ప్రకృతి అంతా ఒకే పరబ్రహ్మస్వరూపంగా తెలుసుకొనడమే ఆ జ్ఞానం అంటే సర్వం వాసుదేవమయం అని తెలుసుకోవడం అలాంటి జ్ఞానస్థితి సాధించిన మహాత్ములు అతి అరుదు అని అర్థం]. **(4)**

**సత్యేన లభ్యస్తపసా హ్యేష ఆత్మా సమ్యగ్జ్ఞానేన బ్రహ్మచర్యేణ నిత్యమ్ ।**
**అన్తఃశరీరే జ్యోతిర్మయో హి శుభ్రో యం పశ్యన్తి యతయః క్షీణదోషాః ॥**

ఈ శరీరంలోపలే (హృదయగుహలో) జ్యోతిర్మయము, పరమ విశుద్ధము అయిన ఆత్మ(పరమాత్మ) స్థితమైవుంది. ఆ పరమాత్మను ప్రాప్తం చేసుకోవాలంటే అది సదా సత్యవచనం, నిరంతర తపస్సు, బ్రహ్మచర్య పాలనలవల్ల లభించే సంపూర్ణ యధార్థజ్ఞానంద్వారామాత్రమే సాధ్యం అవుతుందనేది నిస్సందేహమే. క్షీణదోషుడైన (ఏ దోషములేని) ప్రయత్నశీల సాధకునికే యిది సాధ్యం. అతడుమాత్రమే పరమాత్మను చూడగల్గుతాడు. **(5)**

**సత్యమేవ జయతి నానృతం సత్యేన పన్థా వితతో దేవయానః ।**
**యేనాక్రమన్త్యృషయో హ్యాప్తకామా యత్ర తత్సత్యస్య పరమంనిధానమ్ ॥**

సత్యమే గెలుస్తుంది; అబద్ధం (అనృతం) కాదు. ఎందుకంటే దేవయాన మార్గం, అంటే దేవతలు పయనించే మార్గం - పరమాత్మను ప్రాప్తం చేసుకోవడానికి వలసిన మార్గం, సత్యంతోనే నిండివుంటుందిగనుక ఆ మార్గం గుండానే పూర్ణకాములైన రుషివర్యులు పయనిస్తుంటారు, ఆ మార్గంలోనే సత్యస్వరూప పరబ్రహ్మయొక్క పరమ ధామం వుంది. **(6)**

**బృహచ్చ తద్దివ్యమచిన్త్యరూపం సూక్ష్మాచ్చ తత్సూక్ష్మతరం విభాతి ।**
**దూరాత్సుదూరే తదిహాన్తికే చ పశ్యత్స్విహైవ నిహితం గుహాయామ్ ॥**

అది (ఆ పరబ్రహ్మ) మహత్తరమైనది, దివ్యమైనది, అచింత్యరూపం (ఆలోచనకు చిక్కని రూపం) కలది ఇంకా అది సూక్ష్మాతిసూక్ష్మరూపంలో వ్యక్తమై ప్రకాశిస్తూంటుంది అలాగే అది దూరాతిదూరంగా నిలిచివుంటుంది. అదే సమయంలో ఈ శరీరంలోనే వుండడంవల్ల అతి సమీపంగాకూడ వుంటుంది అది యిక్కడే దానిని కనుగొనదల్చిన ప్రాణుల శరీరాల్లోనే వాటి హృదయగుహల్లో నిహితమైవుంటుంది. అంటే అది లేని స్థానమంటూ వుండదు అనవరతం దాన్ని ధ్యానంచేసేవారికి అత్యంత సమీపంలోనే, వాళ్ల హృదయాల్లోనే అంతర్నిహితంగానే అగుపిస్తుంది అని అర్థం [మన పోతన రాసిన తెలుగు **మహాభాగవతం** లో ప్రహ్లాదుడు చెప్పే - *ఇందు గల డందు లేడని, సందేహము వలదు చక్రి సర్వోపగతుం డెం దెందు వెదకి చూచిన, నం దందే గలడు దానవాగ్రణీ! వింటే* - అనే ప్రఖ్యాత పద్యం చటుక్కున గుర్తుకువస్తూంది] **(7)**

**న చక్షుషా గృహ్యతే నాపి వాచా నాన్యైర్దేవైస్తపసా కర్మణా వా ।**
**జ్ఞానప్రసాదేన విశుద్ధసత్త్వస్తతస్తు తం పశ్యతే నిష్కలం ధ్యాయమానః ॥**

కళ్లతోగాని, వాక్కుతోగాని, లేక యితర ఏ ఇంద్రియాలతోనేగాని దాన్ని (పరబ్రహ్మను) గ్రహించడం అసాధ్యం. లేక తపస్సుతోగాని లేదా శుభాశుభ కర్మలతోగాని దాన్ని పొందడమూ అసాధ్యమే విశుద్ధ అంతఃకరణంగల సాధకుడుమాత్రమే, అలాంటి పరిశుద్ధ అంతఃకరణంతో నిరంతరం ధ్యానం

చేస్తూండడం వల్ల కలిగే నిర్మలజ్ఞానంద్వారా దాన్ని (ఆ నిరవయవ పరబ్రహ్మను) దర్శించగల్గుతాడు [దీన్నే *భగవద్గీత,* ***11:8*** లో తనకు విశ్వరూపం చూపవల్సిందిగా అర్జునుడు ప్రార్థించినప్పుడు శ్రీకృష్ణుడు *న తు మాం శక్య సే ద్రష్టుం అనేనైవ స్వచక్షుషా । దివ్యం దదామి తే చక్షుః పశ్య మే యోగమైశ్వరమ్ ॥* - అంటే, ఓ అర్జునా ! నా దివ్య రూపాన్ని నీ చర్మచక్షువులతో చూడలేవు కనుక నీకు దివ్యదృష్టి (జ్ఞానదృష్టి) నిస్తున్నాను ఈ దివ్యదృష్టితో నా విశ్వరూపం సందర్శించు మన్నట్లు చెప్పబడింది] **(8)**

**ఏషో ऽ ణురాత్మా చేతసా వేదితవ్యో యస్మిన్ప్రాణః పఞ్చధా సంవివేశ ।**
**ప్రాణైశ్చిత్తం సర్వమోతం ప్రజానాం యస్మిన్విశుద్ధే విభవత్యేష ఆత్మా ॥**

దేనిలోనైతే ఐదువిధాలైన ప్రాణం చక్కగా వసించివుంటుందో ఆ శరీరంలోనే (ఆ పంచవన్నెల రామచిలుక గూటివృక్షంలోనే) స్థితమైవుండే ఈ సూక్ష్మాతి సూక్ష్మమైన ఆత్మ (జీవాత్మ)ను మనస్సుద్వారానే తెలుసుకొన శక్యమవుతుంది మరి సకల ప్రాణుల సమస్త చిత్తాలూ ప్రాణాలతో నిండివుంటాయిగదా మరి ఈ సమస్తప్రాణాలకూ ఆధారభూతమైన పరమాత్మను తెలుసుకోవాలంటే జీవాత్మకు ఎలా సాధ్యం ? అదెలాగంటే జీవుడు తన అంతఃకరణాన్ని విశుద్ధంగా రూపొందించుకొన్నప్పుడే జీవాత్మకు ఈ శక్తి లభిస్తుంది అంటే ఐహిక భోగవిలాసాలను కాంక్షించకుండా సతతమూ 'హరినామస్మరణ' లో వ్యస్తమై వున్నప్పుడే పరమాత్మ ప్రాప్తమవుతుందని అర్థం **(9)**

**యం యం లోకం మనసా సంవిభాతి విశుద్ధసత్త్వః కామయతే యాంశ్చ కామాన్ ।**
**తం తం లోకం జయతే తాంశ్చ కామాంస్తస్మాదాత్మజ్ఞం భూతికామః ॥**

విశుద్ధ అంతఃకరణంగల మనిషి ఏ ఏ లోకాలుకావాలని మనస్సులో కోరుకుంటే ఆ యా లోకాలు అతనికి లభిస్తాయి, ఏ ఏ భోగాలు కావాలని కోరుకుంటే ఆ యా భోగాలు లభిస్తాయి అందువల్లే కేవలం ఐహిక భోగాలు కోరుకునేవాళ్లు విశుద్ధ అంతఃకరణం కలిగి శారీరక భోగవాంఛకాక ఆత్మజ్ఞానాన్ని కలిగివుండే మహాత్ములకు గౌరవసత్కారాలు చేయాలి. **(10)**

# ప్రథమ ఖండం సమాప్తం.

* * * * *

# రెండవ ఖండం

[పరిశుద్ధ అంతఃకరణంగల సాధకుని సామర్థ్యాన్ని వర్ణిస్తూ సందర్భానుసారంగా ఇష్టకామ్యసిద్ధిగురించికూడ ఇంతకు ముందటి ప్రకరణం (మొదటి ఖండం)లో ప్రస్తావించడం జరిగింది. ఈ ఖండంలో నిష్కామ కర్మల్ని ప్రశంసిస్తూ, సకామ భావనల్ని నిరసిస్తూ తత్త్వోపదేశాలు చేయబడుతున్నాయి]

**స వేదైతత్పరమం బ్రహ్మధామ యత్ర విశ్వం నిహితం భాతి శుభ్రమ్ ।**
**ఉపాసతే పురుషం యే హ్యకామాస్తే శుక్రమేతదతివర్తన్తి ధీరాః ॥**

ఈ సమస్త విశ్వమూ దేనిలోనైతే నిహితమైవుంటుందో ఆ పరమ తేజోమయ బ్రహ్మధామాన్ని విశుద్ధ అంతఃకరణంగల వ్యక్తి తెలుసుకోగలుగుతాడు అలాంటి వ్యక్తి కేవలం ఆ పరమపురుషుడ్నిమాత్రమే ఉపాసిస్తూండడంవల్ల ఈ జగత్తుకు సంబంధించిన ఐహిక భోగవిలాసాలేవీ అతడ్ని పట్టివుంచలేవు అందుచేత అలాంటి బుద్ధిమంతుడైన సాధకుడు ఈ రజోవీర్యమయమైన (భోగమయమైన) ప్రపంచాన్ని అధిగమించి నేరుగా ఆ బ్రహ్మలోకం చేరుకోగల్గుతాడు. అంటే జనన మరణ చక్రంలో చిక్కుకొని కొట్టుమిట్టాడుతూ వుండకుండా బ్రహ్మసాయుజ్యాన్ని పొందగల్గుతాడు (1)

**కామాన్యః కామయతే మన్యమానః స కామభిర్జాయతే తత్ర తత్ర ।**
**పర్యాప్తకామస్య కృతాత్మనస్త్విహైవ సర్వే ప్రవిలీయన్తి కామాః ॥**

సుఖభోగాల్ని ఆదరించేవాళ్లే, వాటివల్ల తనివితీరుతుందని భావించేవాళ్లే వాటిని కోరుకుంటారు అలా కోరుకోవడంవల్ల ఆ యా కోరికలనుబట్టి అవి లభించే ఆ యా స్థానాల్లో (యోనుల్లో) జన్మిస్తుంటారు కాని పూర్ణకాములకు, అంటే ఐహిక సుఖభోగాలపై ఆసక్తి, వ్యామోహాలు లేకుండేవారికి ఈ శరీరంలోనే ఆ కోరికలన్నీ లీనమైపోతాయి అంటే కేవలం పరమాత్మ ధ్యానమే ప్రవృత్తిగాగల, విశుద్ధ అంతఃకరణాలుగల వ్యక్తులు తమ కోర్కెలనుబట్టి వివిధ జన్మ లెత్తవల్సిన దుస్థితిలో పడక, జనన మరణ చక్రంనుండి శాశ్వత ముక్తి పొందుతారు. (2)

**నాయమాత్మా ప్రవచనేన లభ్యో న మేధయా న బహునా శ్రుతేన ।**
**యమేవైష వృణుతే తేన లభ్యస్తస్యైష ఆత్మా వివృణుతే తనుం స్వామ్ ॥**

ఈ ఆత్మ (పరమాత్మ) ఏవైనా ప్రవచనాలద్వారాగాని, లేక బుద్ధికుశలతవల్లగాని, లేదా దాన్ని ప్రశంసించే స్తోత్రాలు బాగా వినడంద్వారాగాని లభ్యం కాజాలదు అది (పరమాత్మ) తానుగా ఎవరిని ఏరి కోరి వరిస్తుందో వారికే, వారిద్వారానే ప్రాప్తం కాగలదు. అలాంటి ఎంపికచేసుకున్న బుద్ధిమంతులైన జ్ఞానులకే పరమాత్మ తన్నుతాను ప్రకటం చేసుకుంటుంది [*భగవద్గీత* ***11 : 53-55*** శ్లోకాల్లో ఈ విషయం స్పష్టంగా ప్రకటింపబడింది వేదాధ్యయనంవల్లగాని, తపస్సువల్లగాని, దానంవల్లగాని, యజ్ఞంవల్లగాని నీవు నన్ను దర్శించిన రీతిన మరెవ్వరైనా నన్ను దర్శించాలంటే సాధ్యంకాదని, అందుకు అనన్యభక్తిమాత్రమే ఏకైక మార్గమని ***53, 54*** శ్లోకాల్లో చెప్పబడింది. ముఖ్యంగా ***11: 55*** లో - *మత్కర్మకృ న్మత్పరమో మద్భక్తస్సంగ వర్జితః । నిర్వైరస్సర్వభూతేషు యస్స మామేతి పాండవ ॥* - అంటే, విషయాసక్తిని వీడి, సర్వభూతములందు వైరద్వేషాలు లేకుండా, నాకొరకు సత్కర్మలు చేస్తూ, నన్నే పరమగతిగా నెంచి భక్తితో నన్ను సేవించేవాడుమాత్రమే నన్ను పొందగలడిన కృష్ణుడు అర్జునునికి చెబుతాడు. ఈ శ్లోకంలో భక్తి, కర్మ, జ్ఞాన మార్గాలు మూడూ ప్రకటమవుతున్నాయని, కనుక యిదే గీతాసారమని ఆదిశంకరుని అభిప్రాయమట]. **(3)**

**నాయమాత్మా బలహీనేన లభ్యో న చ ప్రమాదాత్తపసో వాప్యలిఙ్గాత్ ।**
**ఏతైరుపాయైర్యతతే యస్తు విద్వాంస్తస్యైష ఆత్మా విశతే బ్రహ్మధామ ॥**

ఈ ఆత్మ(పరబ్రహ్మ) బలహీనుడైన మనిషిద్వారా (అంటే ఉపాసనా బలం లేని మనిషిద్వారా) ప్రాప్తం చేసుకోబడజాలదు అలాగే లక్షణరహితమైన (అంటే సాత్విక లక్షణాలు లోపించిన) తపస్సుద్వారాగానీ, ప్రమాదంద్వారాగానీ (అంటే ఆకస్మిక సంభావ్యతవల్లగానీ) లభ్యంకాదు. అయితే బుద్ధిమంతుడైన సాధకుడు ఈ మార్గాలద్వారా ప్రయత్నిస్తే - అంటే ప్రమాదరహిత ప్రయత్నాలతో, సాత్వికలక్షణాలుగల తపస్సుతో, సంయమంతో, ఉత్కట అభిలాషతో నిరంతర ధ్యానం చేస్తూవుండేపక్షంలో - అతని జీవాత్మ (జనన మరణ చక్రంనుండి ముక్తిపొంది) నేరుగా ఆ బ్రహ్మధామం చేరుకోగల్గుతుంది. **(4)**

**సంప్రాప్యైనమృషయో జ్ఞానతృప్తాః కృతాత్మానో వీతరాగాః ప్రశాన్తాః ।**
**తే సర్వగం సర్వతః ప్రాప్య ధీరా యుక్తాత్మానః సర్వమేవావిశన్తి ॥**

వీతరాగులు (పూర్తిగా విషయాసక్తిలేనివారు), విశుద్ధ అంతఃకరణాలుగలవారు అయిన రుషివర్యులు దీనిని (ఈ పరమాత్మను) పూర్తిగా ప్రాప్తంగావించుకుని, ఆ జ్ఞానంతో పూర్తిగా సంతృప్తులవుతారు; పరమ శాంతిని పొందుతారు ఈ విధంగా తమ్ము తాము ఆ పరమాత్మతో సంయుక్తంగావించుకునే ఆ జ్ఞానులు సర్వవ్యాప్తమైన ఆ పరమాత్మను సకల దిశలు, పక్షాలనుండీ ప్రాప్తం చేసుకుని, తద్వారా ఆ సర్వరూప పరమాత్మలోనే పూర్తిగా లీనమైపోతారు. (5)

**వేదాన్తవిజ్ఞానసునిశ్చితార్థాః సంన్యాసయోగాద్యతయః శుద్ధసత్త్వాః ।**
**తే బ్రహ్మలోకేషు పరాన్తకాలే పరామృతాః పరిముచ్యన్తి సర్వే ॥**

ఎవరైతే వేదాంత(ఉపనిషత్తుల) విజ్ఞానంద్వారా దానికి అర్థభూతమైన ఆ పరబ్రహ్మను నిశ్చయంగా తెలుసుకుంటారో, సన్యాసయోగానుష్ఠానంద్వారా (అంటే కర్మఫలాలను, విషయాసక్తిని త్యాగంచేయడంద్వారా) ఎవరి అంతఃకరణాలైతే పరిశుద్ధంగా రూపొందాయో, అలాంటి ప్రయత్నశీలురైన సాధకులందరూ చనిపోయేటప్పుడు (అంటే శరీరత్యాగం చేసేటప్పుడు) (మరే యితర లోకాలకూగాక నేరుగా) బ్రహ్మలోకానికే వెళతారు అక్కడ పరమ అమృతస్వరూపులుగా రూపొంది సంసారబంధనాలనుండి శాశ్వతంగా విమోచన పొందుతారు (6)

**గతాః కలాః పఞ్చదశ ప్రతిష్ఠా దేవాశ్చ సర్వే ప్రతిదేవతాసు ।**
**కర్మాణి విజ్ఞానమయశ్చ ఆత్మా పరే ऽ వ్యయే సర్వ ఏకీభవన్తి ॥**

అలాంటి మహాజ్ఞాని దేహత్యాగం చేసినప్పుడు అతడి పదిహేను కళలు, మనస్సుతోయుక్తంగా సర్వేంద్రియాలకు సంబంధించిన దేవతలంతా తమ తమ అభిమాన సమష్టి (విశ్వవ్యాప్త) దేవతల్లో లీనమైపోతారు ఆ పై ఆ జీవన్ముక్తుడి

(జీవాత్మ)కి వాటితో ఏ సంబంధమూ వుండదు. దాని తర్వాత అతడి సమస్త కర్మలు, అతడ విజ్ఞానమయి జీవాత్మ - సర్వమూ ఆ అజరామర, అనశ్వర పరబ్రహ్మలో ఒక్కటిగా లీనమైపోతాయి [ఇక్కడ 15 కళలంటే - శ్రద్ధ, ఆకాశం మొదలైన పంచ మహాభూతాలు, ఇంద్రియాలు, మనస్సు, అన్నం, వీర్యం, తపస్సు, మంత్రం, కర్మ, లోకం, నామం అని. ప్రశ్నోపనిషత్తు 6·4 లో ఈ వివరాలు మనం తెలుసుకోగలం] **(7)**

**యథా నద్యః స్యన్దమానాః సముద్రే ఽ స్తం గచ్ఛన్తి నామరూపే విహాయ ।**
**తథా విద్వాన్నామరూపాద్విముక్తః పరాత్పరం పురుషముపైతి దివ్యమ్ ॥**

ఏ విధంగానైతే ప్రవహించే నదులు తమ నామ రూపాల్ని విడిచిపెట్టి సముద్రంలో విలీనమైపోతాయో, అదేవిధంగా జ్ఞానులైన మహాత్ములు తమ నామరూపాల నుండి విముక్తులై, ఉత్తమోత్తముడైన, దివ్యపురుషుడైన పరమాత్మలో ఒక్కటిగా లీనమై పోతారు **(8)**

**స యో హ వై తత్పరమం బ్రహ్మ వేద బ్రహ్మైవ భవతి నాస్యాబ్రహ్మవిత్కులే భవతి । తరతి శోకం తరతి పాప్మానం గుహాగ్రన్థిభ్యో విముక్తోఽమృతో భవతి ॥**

ఎవరేగాని ఆ పరబ్రహ్మ పరమాత్మను తెలుసుకొనేట్లయితే వారు నిజానికి దానిలో లీనమైపోయి తామే పరబ్రహ్మగా అయిపోతారనేది నిశ్చయమే అంతేగాక వారి కులంలోకూడ (అంటే వారి సంతతిలో) బ్రహ్మను తెలుసుకో(లే)ని వారంటూ ఎవరూ వుండరు. అలాంటి మహాత్ములు సర్వవిధాల చీకు చింతలనుండి ముక్తులై వుంటారు; పాప సముద్రం ఆవలి దరిచేరివుంటారు, హృదయంలోని చిక్కుముడులన్నీ విడిపోయి, అంటే సర్వ సంశయాలూ దూరం చేసుకుని అమరులైపోతారు. **(9)**

**తదేతదృచాభ్యుక్తమ్ -**

**క్రియావన్తః శ్రోత్రియా బ్రహ్మనిష్ఠాః స్వయం జుహ్వత ఏకర్షిం శ్రద్ధయన్తః।**
**తేషామేవైతాం బ్రహ్మవిద్యాం వదేత శిరోవ్రతం విధివద్యైస్తు చీర్ణమ్ ॥**

బ్రహ్మవిద్యగురించిన ఈ విషయం ఋచాలలో (వేద వాక్యాల్లో - ఋగ్వేద ఋచాలలో) కూడ చెప్పబడింది. నిష్కామ కర్మలు చేసేవాడు, శ్రోత్రియుడు (అంటే వేదార్థజ్ఞాత), బ్రహ్మనిష్ఠగలవాడు, శ్రద్ధాసక్తులతో తాను స్వయంగా ఏకర్షి అనే పేరుగల యజ్ఞాగ్నిలో నియమానుసారంగా హవనం చేసేవాడు, అలాగే విధిపూర్వకంగా సర్వశ్రేష్ఠ వ్రతాన్ని పాటించేవాడు అయిన సాధకుడే బ్రహ్మవిద్య పొందడానికి అర్హుడు; అటువంటి వ్యక్తికే బ్రహ్మవిద్య బోధించాలని వాటిల్లో చెప్పబడింది **(10)**

**తదేతత్సత్యమృషిరఙ్గిరాః పురోవాచ నైతదచీర్ణవ్రతోऽధీతే । నమః పరమ ఋషిభ్యో నమః పరమఋషిభ్యః ॥**

ఆ బ్రహ్మవిద్యారూపమైన ఈ సత్యాన్ని పూర్వం అంగిరా మహర్షి (శౌనకుడనే ఋషికి) వెల్లడించాడు. విధిపూర్వకంగా బ్రహ్మచర్య వ్రతం పాటించనివాడు ఈ విద్యను చదవలేడు, అంటే దీని గూఢార్థాన్ని తెలుసుకోజాలడు. పరమ ఋషికి నమస్కారం. పరమ ఋషికి నమస్కారం. **(11)**

## ద్వితీయ ఖండం సమాప్తం

## తృతీయ ముణ్డక సమాప్తం

# అథర్వవేదీయ ముణ్డకోపనిషద్ సమాప్తం.

★★★★★

# శాంతి పాఠం

ఓం భద్రం కర్ణేభిః శ్రుణుయామ దేవా భద్రం పశ్యేమాక్షభిర్యజత్రాః।
స్థిరైరఙ్గైస్తుష్టువాంసస్తనూభిర్వ్యశేమ దేవహితం యదాయుః ॥
స్వస్తి న ఇన్ద్రో వృద్ధశ్రవాః స్వస్తి నః పూషా విశ్వవేదాః।
స్వస్తి నస్తార్క్ష్యో అరిష్టనేమిః స్వస్తి నో బృహస్పతిర్దధాతు ॥

**ఓం శాంతిః ! శాంతిః !! శాంతిః !!!**

దీని అర్థం ప్రశ్నోపనిషత్తులో మనం తెలుసుకునివున్నాము

★ ★ ★ ★ ★